# ముద్రారాక్షసము

(విశాఖదత్తకృతి)



అనువాదకుఁడు
విద్వచ్ఛిరోమణి.
అవధానము చంద్రశేఖరశర్మ



గ్రంథకర్త

విద్వచ్ఛిరోమణి

అవధానము చంద్రశేఖరశర్మ

శ్రీః

# ఉపోద్ఘాతము.

—:♦:—

పరమభోగ్యమైన ప్రాచీన సంస్కృతరూపకములు కొన్నిటిలో విశాఖదత్తుని ముద్రారాక్షస మొకటి. శృంగారరస గంధమైనను లేక, కేవలము రాజనీతి జిత్తులును, గత్తులును ఆధారముగాఁ గొని కథాసంవిధానమును కమనీయముగా నడపిన రచనయిది. దానికి తోడు దీని భాషాశైలి గూడ కొంత జటిలమై మార్దవము చాలక చదువరులను ఏకధారగా ముందుకు సాఁగనీయనిదైనను, భావముల యానురూప్యమును, అర్థముల యుచితసంగ్రహమును గలిగి రసికుల కాకర్షకముగ నున్నది. ఈ విషయమున సంస్కృత వాఙ్మయమం దెల్ల దీనివంటి దిదే యని చెప్పవచ్చును. ఈ కవిదే 'దేవీ చంద్రగుప్తము' అను నింకొక రూపక ముండినదని తెలియవచ్చుచున్నది గాని దానిని కన్నులారఁ జూచుభాగ్యము మన కింకను కలుగలేదు. కలుగఁ గలదను నాశంసయు నానాఁటికి శిథిల మగుచున్నది.

ఈ శతాబ్దపుఁ దొలుతనే శ్రీ తిరుపతి వేంకటేశ్వర మహాకవులు దీనిని తెలిఁగించినారు. కాని అప్పటికే ఇంకెవరో దీనిని తెలిఁగించి యున్నట్లు వారు దీని ప్రస్తావనలో పేర్కొన్నారు * కాని దాని వివరములు నాకు తెలియవు. ఈ శతాబ్దిలో ప్రాచీన సంస్కృత మహారచనలు తెలిఁగించు నుత్సాహము పునరుక్తముగా పలువురు పండితులకుఁ గలిగినది. కనుక ఇఁకఁ గొంద ఱెవరైనను ఆ ప్రయత్నము చేసియుందురు. అట్టివారిలో శ్రీ అవధానము చంద్రశేఖర శర్మగారొక్కరు, ఈ తెలిఁగింపును సంతరించినవారు, నాకు పరిచితులగు భాగ్యము గల్గినది. ఉభయభాషల సారస్వతమందును

---

* చూ. షష్టిపూర్తి మహోత్సవ ముద్రణము ౨వ సంపుటము,

తలస్పర్శి సంస్కారము గలిగి, సహజ వినయసంపత్తియు, ఎడతెగని వివిధవిషయుఁ గల వీరికి ఆ గుణములను ప్రతిబింబింపఁ జేయు కవితా శిల్పము సిద్ధించినది. భావమును మీఱని భాష, భాషను దిద్దితీర్చిన బంధము, వీరి ప్రధాన కావ్యగుణములు, హృదయసమాధిని ఓర్పును దెలుపునవి. వీరి ధార సహజముమాత్రమే గాదు; సాధితమై సంస్కృత మైనదిగూడ. ముద్రితములైన 'దీనచింతామణి' 'ప్రవాసి' అను ఖండకావ్యములను, తప్పక ముద్రింపవలసిన 'మాతృగుప్తుఁడు' అను కావ్యమును చదివిచూడఁ గల్గినవారికి ఇవి సుగృహీత విషయములే.

తిరుపతి వేంకటకవుల ధారాళ కవితాశిల్పము తెలుఁగుసీమ నలుమూలలను మారుమ్రోఁగినది. మ్రోఁగుచున్నది. దాని గుణ ప్రశంస యిప్పుడు చేయఁ బనిలేదు. కాని యీ నాటకమును తెలిఁగించుటలో వారి రచన కొంత స్వచ్ఛందముగా సాఁగిన దని చెప్పక తీరదు. దానికి వారి రచనలే ప్రధానముగా సమ్మికొని నడచిన 'సరస్వతీ' పత్రికకు మాసాశనముగా సిద్ధముచేయఁబడిన వానిలో ఇదియు నొక్క రచన యగుట ముఖ్యకారణ మనవచ్చును. నైసర్గికమైన వారిస్వతంత్ర మనోధర్మముగూడ ఇందు ప్రతిబింబితమై యుండును. మఱి కార్యాంతర వ్యగ్రతచే చేసినదానిని మరల దిద్దితీర్చు నవకాశము లేమి మఱొక హేతువు. దీనిని వారి కృతుల షష్టిపూర్తి మహోత్సవ ముద్రణము సాధించిన శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు నాల్గవ సంపుటపు పీఠికలో తెలిపియున్నారు. ఇంతే కాదు; మూలమును పరిశోధించి పాఠభేదములను సేకరించిన విమర్శకార్యము ఇటీవలనే విపులముగా జరిగినది. ఎట్లును మూలమును యథావత్తుగా తెలుఁగులో చదివిచూడఁ గోరువారికి తిరుపతి వేంకటకవుల తెలిఁగింపు వలసినంత తృప్తి నీయ దనుట సత్యము. ఒక్క యుదాహరణము మాత్ర మిత్తును :—

తృతీయాంకమున శరద్వర్ణన రూపకమైన యీ క్రింది శ్లోకమును చూడుఁడు.

అపా ముద్వృత్తానాం నిజ ముపదిశంత్యా స్థితిపదం
దధత్యా శాలీనా మవనతి ముదారే సతి ఫలే,
మయూరాణా ముగ్రం విషమిక హారంత్యా మద మహో
కృతిః కృత్స్నస్యాయం వినయ ఇవ లోకస్య శరదా. (పు. ౩.

దీనికి పై కవిద్వయపు తెలిఁగింపు ఇట్లున్నది

సీ. ఉద్వృత్తు లగువారి కుండ దెంతైశ్వర్య
మే నని తటినుల కృశత దెలుప
ఫలము సిద్ధించినకొలఁది సత్పురుషులు
వంగియుందు రటంచు వరులు నొదువ
నొడలెఱుంగక దాన మొనరింప వెల్లఁబా
టబ్బు నంచును దెల్ల మబ్బు నుడువఁ
గలుషితం బైనను ఘనులచిత్తము క్రమం
బుగఁ దేఱు నని జలంబులు వచింప

తే. ఘనులఁ గన్గొని మిగులఁ గేక లిడువారి
పొగరు నిల్వంబడదఁటన్న పోల్కి మత్త
కేకి మదహాని దెల్ప నీ లోకమునకుఁ
గలుపుచున్నది వినయ మీశరాల మిప్పుడు. (పు. ౩౯)

మూలమందలి చిక్కని భావ మిందు సాఁగఁదీయఁబడి బంధమును—అర్థమును సడలి యుండుటయు, సీసపద్యమును నింపవలయుటకై స్వతంత్రముగా క్రొత్తయర్థములు తెచ్చిపెట్టఁబడి యుండుటయు స్పష్టము కే.

ఈ తెలిఁగింపును రచించిన శర్మగారు పరివర్తన మొక కళగా సాధించుటయందలి కష్టములను చక్కగా గమనించినారు. వారే ఈనాటక ప్రస్తావనలో చెప్పినట్లు,

తే. వలఁతి నుడికారి మున్న భావంబు సున్న;
భావపుంబుష్టి యున్న నల్పంబు శయ్య;
రెండునుం గూడ మూలానుస్మృతి దొలంగుఁ;
గత్తిపై సాము అనువాద కావ్యరచన.'

మఱి మూలమందలి యందచందా లన్నియు చెక్కుచెదరక దించవలె నని, అనూదితభాషయం దవి స్వాభావికముగాఁ దోఁపవలె నని దృఢాభిప్రాయము గల యీ కాలములో అనువాదకళ మఱింత కఠిన మగుచున్నది. ఎంతో నేర్పు, ఓర్పు లేనిది సంతసరకుగా ఆ కూర్పును సంతరించ లేము. పై సంస్కృతపద్యమునకు శర్మగారి తెలిఁగింపును చదివితిమేని ఆ రెండు గుణములను వీ రెంత యలవఱుచుకొన్నారో తెలియఁగలదు.

"ఉ. హద్దు దొలంగువారిఁ దగ
వౌ నిజమార్గమునం జరింపఁగా
దిద్ది, ఫలాభివృద్ధి విన
తిం గొన శాలుల నిచ్చి, నెమ్ములన్
దద్దయు మించు దుస్సహమ
దంబుఁ దొలంచి శరత్సమాగమం
బద్దిర! తీర్చిదిద్దె విన
యంబున నిల్వఁగ నెల్లలోకముల్." (పు. ౨౭).

వీరి యీ తెలిఁగింపంతయు ఇంతే చిక్కఁదనముతో, పలుచోట్ల ఇంతకన్న మెఱుఁగుగా సాఁగినది. తెలుఁగుసీమ సహృదయులు హార్దముగా స్వాగత మీయవలసిన రచన యిది. నేఁటి యాంధ్రీకర్తలలో ఆ పని కింత చక్కని యధికారము గలవారు కొందఱే కలరు.

తిరుపతి.
దుర్ముఖి ఆశ్వయుజ
శుక్ల దశమి.
13-10-1956.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

# సమీక్ష

ముద్రారాక్షసము గీర్వాణమున రంగప్రయోగయోగ్య ప్రసిద్ధనాటకములలో నొకటి. అది శ్లాఘ్యముగా అనువాదముం గని తెలుఁగుల యనుభవమునకుం దక్కుట మిక్కిలి లోభనీయమైనది. అనువాదము మూలసదృశమగు గుణవత్త కలుగకున్న ఆదరార్హము గాకపోవును. 'తప్పులతడికె' యైన మఱి చెప్పవలయునా? అట్లుగాక మూలగుణమును వెలయించిన 'పరనిర్వృతి' ఇదున దగును. అట్టి గుణవత్త కలిగినను, 'దొంగ గాను సొంతదారను గాను' అని యొకానొక యనువాద కవిమహత్తరుఁడు చెప్పినట్లు అది విశేషముగా మూలకారునికిం జెందును. అట్లే ఆయన వాక్యాంతరముం బోలె, అనువాదమును పరిశీలించుచో 'చెప్పి తయ్యె హెచ్చు చీకిరే నాకంత, విడిచితయ్యె చీమ నెంద్రుకంత' అనునట్టి 'పిసిని' 'పిప్పి' విమర్శకుం జొరరాదు. ఐనను ఘనుల యనువాదములు తెలుఁగునం గలవుగదా. హీరహర్షుని కృతి లేకున్న, శ్రీనాథుఁడు 'విద్వదౌషధమును' యోగించియుండఁగలఁడా? తెలుఁగొకండ' (=పులకండము) అన్న యాముక్తకవి ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము అతిప్రౌఢ గంభీర పద్యగద్యాత్మకము విష్ణుపురాణగత పరాశరానుష్టుప్పులకు అనువాదమే గదా! రెంటను శ్రీనాథుఁడు సెప్పిన యుదాత్తానువాద నియమములు పాటింపఁబడినవి. 'కావ్యేషు నాటకం రమ్యమ్' 'సందర్భేషు దశరూపకం శ్రేయః' అన్నట్లు రమ్యతరమును, శ్రేయస్తరమును అగు నాటకమును అనువదించుట అంతకంటెను కత్తిమీఁది సాముంబోనిది. ఆ సామున తనకు తానే సాటి 'పహిల్‌వాను'ను, 'వస్తాదు'ను అగు శ్రీమద్వేదము వేంకటరాయ శాస్త్రులవారి కాళిదాసత్రయ, హర్షత్రయ, భవభూత్యుత్తరములు నిత్యప్రత్యగ్రదీధితితో లక్ష్యముగా వెలుంగుచున్నవి. ఆ మార్గముం ద్రొక్కిన యాయుష్మంతుఁడు అవధానము చంద్రశేఖరశర్మ రచించిన ముద్రారాక్షసాంధ్రానువాదము కరము శ్లాఘ్యముగా నున్నది. తక్కిన నాటకములకంటెను, కౌటిల్యనాయక మగు ముద్రయందు ఇతివృత్త కౌటిల్యము గహనమును,

దురవగాహమును నై యున్నది. దానికి శ్రీ ధ్రువపండితుఁడు, తదాంగ్ల టీకాకారుఁడు సాధుపాఠ నిర్ణయపూర్వముగా మంచి రేవులు, సులువుగా దిగి ఈఁదఁ దగినట్లు ఏర్పఱిచినాఁడు. ఈ క్రొత్త యనువాదమున ఆ రహస్యము లెల్ల పదిలపఱుపఁబడెను. పాత్రోచితముగా ఆంధ్రము—సంస్కృతముగను, ప్రాకృతముగను ఏకాకారముగాఁ గాక, నైపుణితో పాత్రముల తారతమ్యమునకు సదృశమగు తారతమ్యము గలుగ నాశ్రయింపఁబడెను. యమపటచరాహితుండిక చ్ఛద్మ సిద్ధార్థక జీవసిద్ధ్యాదుల ప్రాకృతగాథలకు సంగ్రథితములైన గేయములు ఔచితీ నిపుణతానురూపతలు కలిగి యున్నవి. ఇంతకుమునుపు ముద్రకు ఆంధ్రమున అనువాదము ఉండియు. పెక్కు కారణములచే లేనియట్లు తలంపఁదగియుండఁగా, ఈ క్రొత్తముద్ర ఆంధ్రమున గొప్ప బోసినే సరసముగా నింపినది. గద్యములకును, పద్యములకును ప్రశస్తమగు శయ్య కుదురుటయ కాక, 'కథమ్' 'అయే' 'ఏషః' 'అథవా' 'తథాహి' 'దిష్ట్యా' 'అనుగృహీతోఽస్మి' 'స్వనియోగ మశూన్యం కురు'-అను మొదలగువానింబోలు నాటకసంభాషణలో 'పరిభాష' అన దగు వాని మర్మజ్ఞానము లెస్సగా ఆవిష్కరింపఁబడినది. ఏల అతివిస్తరము? ముద్రకు అనువాదము ప్రశంస నందుటకు ఎట్లుండఁదగునో అట్లున్నది ఇది. ఇట్లే రంగమునఁ బ్రయోగమునకు యుక్తులగుఁ దగిన శూద్రక మృచ్ఛకటికయు, భాసాంగహర్ష కృతులును శ్రీ చంద్రశేఖరోద్యమమునకు అంద ఆంధ్రికి తోడవు లవుంగాక. 'నాటకాన్తం హి సాహిత్యమ్' కదా! ఈ మార్గమున ఆంధ్రుల నూతన స్వాతంత్ర్యాభ్యుదయమున ఆంధ్రరాజ్యమున ఆంధ్ర చాణక్య రాక్షస చంద్ర మలయ జీవసిద్ధి సిద్ధార్థకాదులను ఊహించియు, అట్లే నేఁటి మన మహాభరతరాజ్యమునను అభినవ చాణక్య రాక్షసాదుల నూహించియు స్వతంత్ర నాటకములును రచితములగును గాక. స్వస్తి.

సింహపురి
2-8-1956

నే. రామదాసు.

శ్రీః

# విజ్ఞప్తి

ముద్రారాక్షసము సంస్కృతమునందలి యేకైక రాజకీయ నాటకము. అందువలన సంస్కృత నాటకములలో దీని కొక విశిష్ట స్థానము గలదు. పాత్ర చిత్రణమునం దేమి, సంవిధాన కౌశలమునం దేమి, ఔచిత్య పోషణమునం దేమి దీనికి దీటు రాఁగల సంస్కృత నాటకములు వ్రేళ్లమీఁద లెక్కింపఁ దగినవే. ఇందలి యితివృత్తము రాజకీయమే గాక చారిత్రిక వ్యక్తులగు చంద్రగుప్త చాణక్యులకు సంబంధించినది యగుటచేత చాణక్యుని యర్థశాస్త్రముతో కవి దీనికి నిపుణతమముగా సంబంధమును గలిపినాఁడు. అర్థశాస్త్రములో శాస్త్రకారునిగా గుర్తించిన చాణక్యుని నిందు తత్ప్రయోక్తగాఁ దర్శింతుము. అర్థశాస్త్ర ప్రసిద్ధము లగు పారిభాషికములు ఎన్నో యిందు శబ్దార్థరూపములతోఁ గానవచ్చును. ఇంతేకాక లాక్షణికుల రూపక లక్షణములకు సైతము ఇది విపులతమ మగు నుదాహరణమై యున్నది.

ఏతద్రచయిత యగు మహాకవి విశాఖదత్తుఁడు దత్తవంశీయుఁడు. ఈతని పితామహుఁడు వటేశ్వరదత్తుఁడు. లక్షనుండి మూఁడు లక్షల కర్షముల వఱకును రాజభాగము నందునట్టి సామంతుఁడు కాఁగా, తండ్రియగు భాస్కరదత్తుఁడు ముప్పదినుండి యేఁబది లక్షల కర్షముల వఱకును రాజభాగము నందు * మహారాజ పదము

* శ్లో. లక్షకర్షమితో భాగో రాజతో యస్య జాయతే।
వత్సరే వత్సరే నిత్యం ప్రజానా మవిపీడనైః।
సామంత స్స నృపః ప్రోక్తో యావల్లక్షత్రయావధిః।
తదూర్ధ్వం దశలక్షాంతో నృపో మాండలిక స్స్మృతః।
తదూర్ధ్వం తు భవే ద్రాజా యావద్వింశతిలక్షకః।
పంచాశల్లక్షపర్యంతో మహారాజః ప్రకీర్తితః॥ శుక్రనీతి.

నుండెను. నాటక రచనా కాలమునకు తండ్రి యింకను నుండె నేమో కవి తన రాజకీయ పదమును పేర్కొనలేదు.

వీరు ఎవరికి సామంతులు? కవి యేకాలమువాఁడు? అను ప్రశ్నములకు సమాధానమువిషయమున చారిత్రికులు భిన్నాభిప్రాయులై యున్నారు. రెండవ చంద్రగుప్తుని సామంతుల కోవలోని వాఁడై యితఁడు క్రీ. శ. 5 వ శతాబ్దివాఁ డగు నని కొందఱనఁగా, మఱికొందఱు కాన్య కుబ్జేశ్వరుఁ డగు నవంతివర్మ కాలము వాఁడై అతని సామంత వంశమువాఁడై క్రీ. శ. 6 వ శతాబ్దపు టుత్తరార్ధమువాఁడు కాఁదగు ననిరి. భరతవాక్యమునందలి "చంద్రగుప్తః" "అవంతివర్మా" అను పాఠభేదములు ఈ వాదములకు ఉపోద్బలకము లైనవి. భరతవాక్యములో మ్లేచ్ఛ విజేతగాఁ బేర్కొనఁ బడిన రాజు రెండవ చంద్రగుప్తుఁడే యని కొందఱు వాదింపఁగా, రెండవ చంద్రగుప్తుని తరువాత నర్ధశతాబ్దమునకుఁ గాని హూణులు పంచనద ప్రాంతమునఁ గుదురుకొనలేదు; కావున తద్విజయ మాతనికిఁ గుదుర దనియు, నాఱవశతాబ్దివాఁ డగు నవంతివర్మ స్థానేశ్వరపతి యగు ప్రభాకర వర్ధనునితోఁ గలిసి క్రీ. శ. 582 ప్రాంతమున హూణులను జయించె ననియు, తద్విజయ ప్రశస్తిని బాణుఁడు ప్రభాకర వర్ధనునకు నంటింపఁగా విశాఖదత్తుఁడు అవంతివర్మకు జోడించినాఁ డనియు, నందుచే భరత వాక్యమున 'నవంతివర్మ' పాఠమే సాధీయ మనియు శ్రీ ధ్రువపండితులు నిరూపించియున్నారు. ఆ మతమున నితఁ డాఱవ శతాబ్దమువాఁడగును. చారిత్రికులలో నితనిని 11, 12 శతాబ్దుల వఱకును సాఁగఁ దీసినవారును నున్నారు. కాని 10, 11 వ శతాబ్దులకుఁ జెందిన దశరూపక సరస్వతీకంఠాభరణములలో నీతని శ్లోకము లుదాహృతము లగుటవలన వారి వాదములు గ్రాహ్యములు గావు.

వరిపంటను, వఙ్గదంపకమును పేర్కొనుటచేతను, కవనమున గౌడీరీతిని పెల్లుగా వాడుటను నీతఁడు వంగదేశీయుఁడుగా నుండు నని శ్రీ శారదారంజనరాయ లభిప్రాయపడిరి. మలయకేతుని

రాజ్యమగు పర్వతక ప్రదేశమునకు తూర్పున మలయదేశమును, దక్షిణమున కౌలూతమును, పడమట కాశ్మీరమును నిర్దేశించుటచే నీతఁడు కన్యాకుబ్జమునకు లోఁబడిన యొక హిమాలయ ప్రాంత మండలమున రాజకీయాధికారిగా నుండి యా ప్రాంతములను చక్కఁగా నెఱిఁగి యుండు నని శ్రీ ధ్రువపండితు లూహించినారు.

ఈతఁడు ముద్రారాక్షసమునే గాక మఱి రెండు నాటకములను గూడ రచించినట్లు తెలియుచున్నది. వానిలో 'దేవీ చంద్రగుప్త' మనునది యొకటి. 'సాహసాంకుఁడు', 'విక్రమాదిత్యుఁడు' అను బిరుదముల నందిన రెండవ చంద్రగుప్తునకు సంబంధించిన యితివృత్త మిది. చంద్రగుప్తుని జ్యేష్ఠ సోదరుఁ డగు రామగుప్తుఁ డొక శకాధిపతితో యుద్ధము చేసి యోడి బందియై సంధిపణముగా తన రాణిని ధ్రువదేవిని సమర్పించునట్లు ఒడఁబడి విముక్తుఁడై రాఁగా, అవమానకరమగు నా సంధికి చంద్రగుప్తుఁడు కుపితుఁడై యన్న నొప్పించి తాను ధ్రువదేవి వేషమును దాల్చి పరిచారికా వేషధారులగు యోధులతోఁ గూడ శత్రు శిబిరమును ప్రవేశించి యేకాంతమునఁ బగతుని వధించి నిజరూపధరులగు పరివారముతోఁ గూడ విక్రమించి రిపుస్కంధావారము దాఁటి నిజసైన్యముతోఁ గలిసి పగతురపై వీరవిహారము సేసి విజయము నందిన మహోజ్జ్వల వీరగాథ యిది. ఈ రామగుప్తుఁ డింకను చారిత్రికుల యెఱుకకు రాలేదు. కాని పై వృత్తాంతము బాణుని హర్షచరిత్రమున సూచితమై తద్వ్యాఖ్యాత యగు శంకరమనీషిచే వివరింపఁబడినది. శృంగార ప్రకాశమునను దీనిసూచనము గలదు. నాట్యదర్పణములోను, శృంగార ప్రకాశములోను ఈ నాటకములోనివిగా పెక్కు శ్లోకము లుదాహృతములై యున్నవి. ఇట్లు మహాద్భుత కథా సంవిధాన రమణీయమై యభిజ్ఞుల సమాదరణమునకు భాజనమై వెలసిన యీ యుత్తమ నాటకము ఉదాహృత కతిపయ శ్లోకమాత్ర శేషమై కాలగర్భమున లీనమై యుండుట నేఁటి సారస్వతసేవకుల దౌర్భాగ్యము. అది యెన్నఁటికేని యును

సూర్యాలోకమున కంది మన కొఱఁతను దీర్చుఁగాక యని యాశించుచు నట్టి పుణ్య ముహూర్తమును ప్రతీక్షింతము గాక.

ఈతని నాటకములలో మఱియొకదాని పేరు తెలియ వచ్చుట లేదు, కాని, సదుక్తి కర్ణామృతములో నీతనిదిగా నుదాహరింపఁబడిన—

"రామోఽసౌ భువనేషు విక్రమగుణై ర్యాతః ప్రసిద్ధిం పరా
మస్మద్భాగ్యవిపర్యయై ర్యది పున ర్దేవో న జానాతి తమ్,
వందీ వైష యశాంసి గాయతి మరు ద్యస్యైక బాణాహత
శ్రేణీ భూత విశాల తాల వివరోద్గీర్ణై స్స్వరై స్సప్తభిః."

అను శ్లోకమును బట్టి, రామాయణ కథను ఆధారముగాఁ గొన్న అట్టి నాటక మొకటి యుండి యుండు నని శ్రీ ధ్రువపండితులు ఊహించినారు.

ఇంతకును ఈ మహాకవి రచనములలో నిప్పటికి లభ్యమైన యీ ముద్రారాక్షస మొక్కటి మాత్రమే.

పూర్వోక్తములగు పెక్కు గుణముల కలిమిచే నీ నాటకము చిరకాలము క్రిందటనే నా మనస్సును ఆకర్షింపఁగా దీనిని అనువదింప సంకల్పించితిని. అప్పుడు నాకు దొరకనది ధుండిరాజు వ్యాఖ్యానముతోడి ప్రాచీనప్రతి యొక ఆ వ్యాఖ్యానము రూపకలక్షణ సమన్వయమునకే ఎక్కువ ప్రాధాన్యము నిచ్చినది గావునను, అచట నచట నందలి పాఠములు గూడ సంతృప్తికరములుగా నుండకపోవుటచేతను ప్రత్యంతర పరిశోధనము ఆవశ్యకమైనది. ఈ యత్నమున నాకు లభించిన ప్రతు లివి.

1. శ్రీ కనకలాల్ ఠాకూరు పండితుల భావబోధినీ వ్యాఖ్యతోడి ప్రతి.
2. శ్రీ శారదా రంజనరాయుల సంస్కృతాంగ్ల వ్యాఖ్యా విమర్శనములతోడి ప్రతి. (1918 లో ముద్రితము. గోవర్ధనప్రెస్. కలకత్తా)
3. శ్రీ కాశీనాథ త్ర్యంబక తెలాంగు పండితుల యాంగ్ల వివరణముతోడి ప్రతి. (1918 లో ముద్రితము. నిర్ణయసాగరప్రెస్. బొంబాయి)

4. శ్రీ 'ఆచార్య' ధ్రువపండితుల యాంగ్ల విమర్శానువాదములతోడి ప్రతి. (1930 లో ముద్రితము. ఓరియంటల్ బుక్ ఏజెన్సీ, పూనా.)

వీని సాయమున నా యల్పబుద్ధికి సముచితము లని తోఁచిన పాఠములను గ్రహించితిని. ఈ నా కృషికి నెంతేని సాహాయ్య మొనర్చిన పై వ్యాఖ్యాతలకును, విమర్శక పండితేంద్రులకును విశేషించి యీ గ్రంథ విషయమున ననల్ప పరిశోధనముఁ గావించి పెక్కు రహస్యములను వెలువరించిన శ్రీ ధ్రువపండితులకును నా కృతజ్ఞతాభివాదము లర్పించుచున్నాఁడను.

ఇట్లు దీనికై కొంత పరిశ్రమ మవసరము కాఁగా 1941 లో ప్రారంభించిన యనువాదము 1942 వ సంవత్సరముతుదకుఁ గాని పూర్తిగాక పోయినది. పిమ్మటఁ బెక్కు సభలలోను, పండిత గోష్ఠులలోను నిందలి భాగములు పఠితములై పలువురు పెద్దల మన్ననల నందినవి. అందుచే ఈ నాటకమునకు నింతకుముందే పలువురు పెద్దల యనువాదము లున్నను ఈ నా యనువాదమున కును సముచితస్థాన ముండక పోదను విశ్వాసము గలిగి దీనిని ప్రకటింపను సజ్జుఁడ నైతిని.

అయిన నేమి? అందఱకును దెలిసిన యార్థిక కారణముచే నిది యింతవఱకును అముద్రితముగానే యుండిపోయినది. ఇట్లుండఁగా దాదాపు రెండు సంవత్సరముల క్రిందట నిచటఁ గొందఱు యువకులు భాషాభిమానులగు నుదారుల సాయముతో 'సాహితీ సామ్రాజ్య' మను పేరిట నొక సారస్వత సంఘమును నెలకొల్పుటయు, తత్కార్యకర్తలు తమ సంఘముపక్షమున శారదాదేవికి సమర్పించు నాదిమ పూజా కుసుమముగా దీనిని ప్రకటింతు మని కోరఁగా నంగీకరించితిని. వారికి నా ధన్యవాదము లర్పించు చున్నాఁడను.

అపరిచితు లైనను కోరుటయే తడవుగా నాయందలి వాత్స ల్యమున దీనికి నుపోద్ఘాతమును వ్రాసి యిచ్చిన విమర్శకాగ్రేసరులు

శ్రీమాన్ రాళ్లపల్లి. అనంతకృష్ణశర్మగారికిని, ఏతత్సమీక్షా పూర్వకముగా నాశీర్వదించిన శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు యమ్. ఏ గారికిని, సాకల్యముగా చదివి సదభిప్రాయముల నొసఁగి నన్ను ప్రోత్సహించిన సహృదయ పండిత ప్రకాండులకును నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివాదముల నర్పించుచున్నాఁడను.

ముద్రణకార్యములో శ్రద్ధ దీసికొనిన కవితాసామ్రాజ్య పట్టభద్రులు శ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారికిఁ (నంద్యాల) గృతజ్ఞతా ప్రహ్వుఁడనై నా ధన్యవాదముల నర్పించుకొనుచున్నాఁడను.

"ఆ పరితోషా ద్విదుషాం
న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్."

పోరుమామిళ్ల
19-7-56

ఇట్లు
బుధజనవిధేయుఁడు,
అవధానము చంద్రశేఖరశర్మ.

# పండితాభిప్రాయములు

## 'మహాకవి' 'శతావధాని'

## గడియారము వేంకటశేష శాస్త్రిగారు

## శివభారతకర్త

## అభినందనము

బ్రహ్మశ్రీ అవధానము చంద్రశేఖరశర్మగారి "ముద్రారాక్షసము" (ఆంధ్రానువాదము) చదివి మిగుల సంతసించితిని. ఈ రచనలో నింత చక్కఁగఁ గృతార్థులైనందుకు వారిని హృదయపూర్వకముగ నభినందించుచున్నాను.

అనువాదకార్యము మిగుల సాహసముతోఁ గూడినపని. పరిశ్రమ ఎక్కువ-ఫలము తక్కువ. ఎందు కనఁగా, ఇందులో వస్తువునందును, విన్యాసమునందును, పాత్రౌచిత్యమునందును, భావసంపదయందును మేలిగుణము లన్నియు మూలగ్రంథకర్త మూటగట్టుకొనును. అవశిష్టము లనువాదకునకు మిగులును. అప్పుడుకూడ నటనట ప్రేలుచూపులు తప్పవు. శ్రీనాథాదు లనుసరించిన యనువాదసరణి యైనచో "దోషంబులు పరిహరించి, గుణంబులు పెంచి..." ఇత్యాదిగాఁ గొంత స్వాతంత్ర్యము నవలంబింప నవకాశమున్నది. "కృతియుఁ జనరంజకమై తనర్చు"-నట్లుగాఁ దీర్చుసౌకర్యము గూడ నున్నది. కాని, శ్రీ శర్మగారు చేపట్టినది కేవల మసిధారావ్రతచర్య. ఈ దీక్షలో "ఇది యనువాదముగాక స్వతంత్ర రచన" యనుకొనునట్లు నిర్వహించి ప్రగల్భత వెల్లడించిరి. ఇది మిక్కిలి ముదావహము.

కాళిదాసాదుల సంస్కృతనాటకములకుఁ బ్రాచీనాంధ్రకవుల యనువాదములు లేవనియే చెప్పవచ్చును. కొన్ని యున్న వనుకొన్నను నైవాని కవిపద్యముల చ్ఛాయలే యనవలెను. ఆధునికులు కొందఱు శ్రీ వీరేశలింగప్రభృతులు కొన్ని నాటకము లనువదించిరి. కాని యా యనువాదముల మూర్తిలో మొగములో నడకలో సొగసులో ననువాదముద్ర లగపడుచున్నను, అంతకంటె మేలిరచనలు వచ్చువఱకు నవియే యుత్తమ రచనలుగా నిలిచి, యొకదానితో నొకటి 'పోటీ' పడుచున్నట్లున్నవి. నిజముననే యనువాదములు చేయుటలో ఆ సంస్కృతభాషా సాధువిన్యాసముల నీ తెనుఁగుభాషా మర్యాదలతో, జాతీయములతోఁ, బలుకుబళ్లతోఁ దీర్చి దిద్దవలసినపుడు రెండుభాషలలో బల మెంతగా పుంజుకొని యుండవలెనో హృదయ మెంతగా పండవలెనో యనుభవరసికు లెఱుఁగనిదిగాదు. శ్రీశర్మ

గారి రచనలో నా కెంతటి యొప్పిదము లెంత యనువుగ నందగించినవో హృదయము విచ్చి చూడవలె నని నా మనవి. నా మట్టుకు నేను దీని యందచంద ములకు, నంతస్సారమునకు నాత్మామోదము నభిషేకింపకుండలేను. 'ఈయన మీవాఁడేమో' యనువారికిఁ జెప్పవలసినది లేదు గాని, ఈ రచనలోని సహజమైన నడక, సరసమైన వాక్కు, సరళమైన కూర్పు, సాహిత్యములోని కమ్మందనము లట్టివి.

బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు శ్రీ ముద్రారాక్షసము ననువదించిరి. వారు మహాకవులు. ఆకృతియు సుకవిస్తుతి నందినది. మఱి యొక రిద్ద అనువదించి నట్లు వినికి. ఆ గ్రంథము లన్నింటిని శ్రీ విశాఖదత్త మహాకవి మూలగ్రంథమును, శ్రీ శర్మగారి యీ యనువాదమును నెదురెదురుగా నుంచుకొని చదివి చూచినచో నన్నింటిలోని తీరు తీయముల నప్పళించుకొని యాస్వాదించి యానందింపఁగలము రసజ్ఞలోక మట్లు చేయుఁగాక.

ఈ కృతి నిట్లు ఆంధ్రసాహిత్యమున కర్పించిన శ్రీ శర్మగారి నభినందించుచు ఇతోధికముగ శారదాసపర్య సలుపుటకై భగవానుఁడు వీరికిఁ జిరాయు రారోగ్య భాగ్యములఁ బ్రసాదించుఁగాక యని యాశీర్వదించుచున్నాను.

ప్రొద్దుటూరు
23-11-56

గడియారము. వేంకటశేష శాస్త్రి.

---

శిరోమణి
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు
ఆంధ్ర సంస్కృతాధ్యాపకులు.
రాజబహాదూరు వేంకటరామారెడ్డి మహిళా కళాశాల
హైదరాబాదు.

చిరంజీవి అవధానము చంద్రశేఖరశర్మగారికి ఆశీఃపురస్సరముగా వ్రాయునది.

... ... మీ పొత్తమును జదివితిని. ఒక్క గుక్కలోఁ జదివితిని. మీ యనువాదము చాలఁ జక్కగా నున్నది. పద్యములు ధారాశుద్ధియుఁ బ్రసాదగుణమును గలిగి హృదయరంజకములుగా నున్నవి. ఇదివఱకుఁ గల యనువాదములలో దీనికిఁ బోల్కయే లేదు. వెనుక నొక తూరి విన్నాను. ఇప్పుడు నిట్టి భాగ్యము నాకుఁ గలిగినది. ఇంకొకసారి మిమ్మభినందించుచున్నాను... ...

44, శేరాకాంపౌండు,
సికిందరాబాదు
18-7-1956

[illegible]
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.

'కవి సమ్రాట్'

విశ్వనాథ సత్యనారాయణగారు

విజయవాడ.

ఆర్యా,

తమ ముద్రారాక్షసమును జూచితిని. మీ పద్యరచన చాల సుకుమారముగా నున్నది. మీరు పాత్రౌచితి ననుసరించి వాడుకభాషను, గేయములను రచించుట కూడ బాగుగా నున్నది.

ప్రధానముగా మీ పద్యరచన రమ్యముగా నున్నది. వచనము మిక్కిలి సుగమముగా నున్నది.

ఇంత కష్టమైన గ్రంథము నింత సుకుమారముగా వ్రాయుట ప్రశంస్యము.

విశ్వనాథ సత్యనారాయణ.

---

అభినవ వాగనుశాసన, మహోపాధ్యాయ

మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు

సంస్కృతాంధ్ర ధ్యాపకులు (R td.), ఆంధ్ర విశ్వవిద్యాలయము.

---

సహృదయుల హృదయము నాకర్షించిన కొలఁది సంస్కృత రూపకములలో ముద్రారాక్షస మొకటి. వస్తు పాత్ర రసౌచిత్యమున వన్నెకెక్కిన యీ నాటకమున కాంధ్రానువాదములు మున్నుదయింపకపోలేదు గాని, శిరోమణి చంద్రశేఖర శర్మగారి యీ యనువాదము పండిత పామర రంజక మయిన సరసశయ్య నధిగమించిన దనక తప్పదు. పాత్రోచితభాష ప్రయోగించుట కారణముగా నీ యాంధ్రీకరణము చదువుటకును, ప్రదర్శించుటకును గూడ రమ్యమై వెలయుచున్నది. భావగంభీరములైన యిందలి పెక్కు శ్లోకముల తెలిఁగింపు సుగమమై హృద్యంగమ మగుట యీ యనువాదమందలి విశేషము. ఈ కాలమునఁ బ్రదర్శింపఁ దగిన పూర్వనాటకములలో నిది గణనీయము.

ధవళేశ్వరము
27-6-1956

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

## దేవులపల్లి రామానుజరావుగారు

ఆంధ్ర సారస్వత పరిషదుపాధ్యక్షులు

శ్రీ అవధానము చంద్రశేఖరశర్మగారికి నమస్కారములు.

ఆర్యా,

కార్యాంతరములవలన తమగ్రంథమునకు అభిప్రాయము పంపుటలో జరిగిన యాలస్యమునకు చింతించుచున్నాను.

సంస్కృతవాఙ్మయములో ముద్రారాక్షస నాటకము చాల విచిత్రమైన కోవకు చెందినది. ఇందలి యితివృత్తమునుబట్టి నాటకోత్కృష్టత కథావస్తువునఁగాక కవియందే ఆధారపడియుండు నను రహస్యము వెల్లడియగుచున్నది. సామాన్యముగా సుకుమారబుద్ధుల నాకర్షింపని జటిల శాస్త్రవిషయములను సుందరముగా చిత్రించు ప్రతిభ విశాఖదత్త మహాకవికే కల దన్న సత్యమునకు తలవంపులు కాఁజాలదు. వీరరసప్రధాన మగుట కాఁబోలును, ఇందు స్త్రీపాత్రములు లేవు. ప్రదర్శనయోగ్యముగ రసోచితముగ నుండుటకై మూలకారుఁడు పద్యములను చాల తక్కువ రచించినాఁడు. మానవ మనస్తత్త్వమును, సాంఘిక రాజనీతులను క్షుణ్ణముగ నెఱిఁగిన రాజవంశీయుఁ డగుట విశాఖదత్త మహాకవి ఈ యసాధారణ నాటకమును రచింపఁ గలిగినాఁడు.

అనేక మహాగుణవిశిష్టమగు నీ ముద్రారాక్షస నాటకమును కవిహృదయమును గుర్తించి, యథామాతృకముగ తెలుఁగు నుడికారము చెడకుండునట్లు సరళసుందర భాషలో ననువదించిన మిమ్ము అభినందించుచున్నాను. తమపద్యముల శైలి ప్రత్యేకముగ ప్రశంసింపఁదగినది. పాత్రోచితభాషను గూర్చుటలోఁగూడ మీ రవలంబించిన పద్ధతి సముచితముగ నున్నది. మూలమునందలి సొంపు చెడకుండ భాషా కాఠిన్యమును తగ్గించి యితివృత్తము సుబోధక మగునట్లు చేసి స్వతంత్ర రచనవలె ఈ యనువాదమును నిర్వహించిన మీ నుండి ఆంధ్రలోక మిట్టి యుత్తమరచనలకై ఆశించుచున్నది.

ఈ గ్రంథమును ఉన్నత కక్ష్యలకు పాఠ్యముగ నిర్ణయించి ప్రభుత్వము మిమ్ము ప్రోత్సహించుఁగాక. సెలవు.

హైదరాబాదు
29-8-1956

భవదీయుఁడు,
దేవులపల్లి రామానుజరావు.

శ్రీ

# నాటక కథా సంగ్రహము.

—: o :—

చాణక్యుఁడు నందుల నందఱను వంశనాశముగాఁ జంపి మగధ సామ్రాజ్యమునఁ జంద్రగుప్తుని బట్టాభిషేకము గావించి తన ప్రతిజ్ఞను బూర్తి చేసికొనెను. ఆ తరువాతఁ జంద్రగుప్తుని సామ్రాజ్యమును సుస్థిరము చేయుటయే యాతని ప్రధాన లక్ష్య మయ్యెను. ఆకాలమున నందుల మంత్రులలో రాక్షసుఁ డనువాఁ డొకఁ డుండెను. ఆతఁ డన్నచోఁ బ్రజల కందఱకును నెంతయో యనురాగము. అతఁడు ప్రజ్ఞా పౌరుషములు గలవాఁడు. ఆతని రాజభక్తి యద్వితీయ మైనది. అట్టి రాక్షసుని నెట్లైనను లోఁబఱచుకొని యొప్పించి చంద్రగుప్తుని యొద్ద మంత్రిగా నుండునట్లు చేసినఁగాని మౌర్యసామ్రాజ్యము స్థిరపడఁజాల దని భావించి చాణక్యుఁ డాతనిని లోఁబఱచుకొనుటకు 'సంకల్పించెను. కాని అది సామాన్య మైన పనిగాదు. రాక్షసునకు నందులపైఁ గల భక్తి యసాధారణమైనది. అందుచేత నతఁడు చంద్రగుప్తుని నాశముచేసి స్వామి ఋణమును దీర్చుకొనవలె నని సర్వథా ప్రయత్నము చేయుచుండెను. నందవంశములో నేమాత్రమువాఁడు మిగిలియున్నను రాక్షసుఁడు తన యత్నమును మానఁ డని చాణక్యుఁడు నందకులములో నొక మొలకగూడ లేకుండ నేరివైచి హతముగావించెను. చివరకుఁ దపోవనములో నున్న నందవంశీయుఁడు సర్వార్థసిద్ధిని గూడఁ జంపించెను. అయిన నేమి? రాక్షసుఁడు పర్వతకుఁ డను మ్లేచ్ఛరాజు కుమారుఁడగు మలయకేతువు నాశ్రయించి చంద్రగుప్తునిపై దండెత్తఁ జూచుచుండెను.

చాణక్యుని మేధాశక్తి యద్వితీయ మైనది. దానికిఁ దోడు ఆతని చారదృష్టియును సామాన్యముగాదు. వారిలో వారికిఁ గూడ నొకరి కొకరు తెలియనంత గూఢముగా నాతఁడు అసంఖ్యాకు లగు చారుల నెల్లయెడల నంపెను. అతని చారులు వ్యాపింపనిచోటు లేదు. రాక్షసునికి అంతరంగికుఁ డగు జీవసిద్ధి చాణక్యుని సహాధ్యాయి యగు నిందుశర్మయే! రాక్షసుఁడు మలయకేతువును చేరుటకంటె ముందుగనే చాణక్యునివాఁ డగు భాగురాయణుఁడు మలయకేతువునకుఁ బ్రాణమిత్రుఁ డయ్యెను. అతఁడు చాణక్యుఁడే పర్వతకుని జంపించెనని మలయకేతువుతోఁ జెప్పి భీతుఁ డగు నారాజపుత్త్రుని సురక్షితముగా పలాయితుని జేయించి ప్రాణరక్షకుఁడుగా నతని కాప్తుఁ డయ్యెను.

పురజనుల నడవడులను కనిపెట్టుటకు చాణక్యుఁడు నియోగించిన గూఢచారులలో నిపుణకుఁ డనువాఁడు మాఱువేషముతో యమపటమును తీసికొని పాటలు పాడుచు నిల్లిల్లు దిరుగుచు ప్రజల వర్తనమును గమనించుచుండెను. వాఁ డొకనాఁడు చాణక్యునియొద్దకు వచ్చి జీవసిద్ధియను బౌద్ధసన్న్యాసియును, కాయస్థుఁ డగు శకటదాసును, రత్నాలసెట్టియగు చందనదాసుఁడును చంద్రగుప్తునిపై ద్వేషముతో నున్నారని యతనికి నివేదించెను. వారిలో చందనదాసునియింట రాక్షసుఁడు తన కుటుంబమును దాఁచి పోయినాఁ డనియుఁ దెలిపి దానికి తార్కాణముగా తనకు చందనదాసుని యింటియొద్ద దొరకిన, రాక్షసుని పేరు చెక్కిన యుంగరమును అతఁడు చాణక్యున కర్పించెను. రాక్షసుని ముద్రిక చిక్కుటతో రాక్షసుఁడే తనకుఁ జిక్కెనని చాణక్యుఁడు సంతోషించెను. నిపుణకుని పంపిన తరువాత చాణక్యుఁ డా యుంగరము సాహాయ్యమున రాక్షసుఁడు వ్రాయించిన ట్లొక కపటలేఖను సృష్టించి, తన్మూలమున మలయకేతువునకును, రాక్షసునకును భేదము కల్పించి రాక్షసుని నిరాశ్రయుని జేయవలెనని పన్నుగడ పన్నెను. సరిగా నా సమయముననే చంద్రగుప్తుఁడు "పర్వతకునకు నుత్తరక్రియలు చేయుఁడు" అనియు, "నాతని యాభరణములను దానము చేయుఁడు" అనియు చాణక్యునకు చెప్పిపంపెను. చాణక్యుఁ డా యాభరణములను దానము తీసికొనుటకు తనవారినే బ్రాహ్మణులను బంపి వానిని తనయొద్దకుఁ దెప్పించుకొని వానిని గూడఁ దన పన్నుగడకు సాధనములుగాఁ జేసికొనెను. మలయకేతువు సైన్యములో ప్రధానులై రాక్షసునిమీఁద మిక్కిలి విశ్వాసముతో నున్న యైదుగురు సామంతరాజులను బేర్కొనుచు ఒకానొకరు ఒకానొకరికి వ్రాసిన ట్లొక కపటలేఖను చాణక్యుఁడు సృష్టించెను. కాని దానిని తాను వ్రాయక, తన చారుఁడగు సిద్ధార్థకుఁ డను రాజపురుషుని సాయమున రాక్షసుని మిత్రుఁ డగు శకటదాసునిచేత వ్రాయించెను. దానిమీఁద రాక్షసుని యుంగరముతో ముద్రనుగూడ వేయించెను.

ఈపని పూర్తియైన తరువాత చాణక్యుఁడు నిపుణకుఁడు తెలిపిన రాజద్రోహులను దండింప సమకట్టెను. వారిలో జీవసిద్ధి తన గూఢచారుఁడే!; అయినను "ఈ జీవసిద్ధి రాక్షసప్రేరితుఁడై విషకన్యచేఁ బర్వతేశ్వరుని జంపించినాఁ" డని యపరాధమును జాటించి యవమానపూర్వకముగా నతనిని నగరమునుండి వెడలఁ గొట్టించెను. అట్లాతఁడు మరల రాక్షసుని జేరుటకు నవకాశము గల్పించెను. రెండవవాఁడు శకటదాసు. "ఇతఁడు రాజును చంపించుటకు యత్నించుచున్నాఁ" డని దోషమును ప్రఖ్యాపించి చాణక్యుఁ డాతనిని కొఱుత వేయుట కాజ్ఞాపించెను. కాని యట్లు జరుగనీయక సిద్ధార్థకుని మూలమున వానిని వధ్యస్థానమునుండి తప్పించి

రాక్షసుని యొద్దఁ జేర్పించెను. "రాక్షసుఁ డిచ్చు బహుమానమును గ్రహింపు" మనియు, "దానిని గూడ రాక్షసుని ముద్రిక చేతనే గుర్తించి భద్రపఱచి, తరువాత నా యుంగరమును రాక్షసునకే చేర్చి కొంతకాల మాతనినే సేవించుచుండు" మనియు నాతఁడు సిద్ధార్థకున కాజ్ఞాపించి యవసరము వచ్చినపుడు చేయఁదగిన కర్తవ్యము నుపదేశించి పంపెను. మూఁడవ వాఁడగు చందనదాసును బిలిపించి "రాక్షసుని గృహజనము నప్పగింపు" మని నయ భయముల నెన్నోరీతుల నడిగి చూచెను. శరణాగత రక్షకుఁ డగు చందనదాసుఁడు చాణక్యుని యాదేశమును నిరాకరించి ప్రాణత్యాగమునకు సైతము సిద్ధపడెను. చాణక్యుఁ డాతనికి సర్వస్వ హరణమును, సకుటుంబ కారాగార వాసమును తాత్కాలిక దండనములుగా విధించి పిమ్మట రాజాచే మరణదండన విధింపింతు నని ప్రకటించెను. కాని యింతటి మిత్రుని రాక్షసుఁ డెట్టైనను రక్షింపకపోఁ డనియు, నీతనికొఱకైనను నతఁడు తనకు లోఁబడు ననియు చాణక్యుఁడు నిశ్చయించెను.

ఇఁక రాక్షసుఁడు చంద్రగుప్తుని రూపుమాపుటకుఁ జేసిన ప్రయత్నము లిన్నన్ని గావు. విషకన్యను చంద్రగుప్తున కంటింపఁ జూచెను. ప్రధానశిల్పియగు దారువర్మని, చంద్రగుప్తునిమావటివాఁ డగు బర్బరకుని, రాజవైద్యుఁ డగు నభయదత్తుని, శయనాధికారియగు ప్రమోదకుని, మర్మఘాతకు లగు బీభత్సకాదులను లోఁబఱచుకొని సమయము చిక్కినప్పుడెల్ల చంద్రగుప్తుని జంపింపఁ జూచెను. దారువర్మ, చంద్రగుప్తుఁడు రాజభవనమును ప్రవేశించునప్పుడు అతని మీఁదఁ ద్రోయుటకు ననువుగా రాచనగరుముందర నొక యంత్ర గోపురమును నిర్మించి యలంకరించెను. బర్బరకుఁడు సమయమునకు వేచియుండెను. వైద్యుఁడు విష మిశ్రిత మగు రసాయనమును సిద్ధము చేసెను. ప్రమోదకుఁడు కనుపెట్టియే యుండెను. బీభత్సకాదులు సొరంగము చేసికొని పోయి పడకటింటి గోడలలో దాఁగి సిద్ధముగా నుండిరి.

అయిన నేమి? చాణక్యుని బుద్ధిబలమును, చంద్రగుప్తుని దైవబలమును గలిసి రాక్షసుని యత్నము నొక్కదానిని గూడ సాగనీయలేదు. చాణక్యుఁ డన్నింటిని కనిపట్టి తప్పించెను. విషకన్యకు పర్వతకుని బలి గావించెను. తాను చెప్పకముందే దారువర్మ గోపురమును నిర్మించి సింహద్వారము నలంకరించుటను గని యనుమానించెను. వెంటనే యాతఁడు "అర్ధరాత్రమున చంద్రగుప్తుఁడు రాజభవనమును బ్రవేశించు" నని ప్రఖ్యాపించెను. పర్వతకుని తమ్ముఁ డగు వైరోచకుని బిలిచి "మీ యన్నపాలి సగము రాజ్యమును నీకిత్తు" నని చెప్పి నమ్మించి యతనిని

గూడఁ జంద్రగుప్తునితోఁ బాటుగాఁ బీఠముమీఁదఁ గూర్చుండఁబెట్టి పట్టాభిషేకము చేయించెను. చంద్రగుప్తుని యాభరణము లన్నియును వైరోచకునకుఁ బెట్టి యాతఁడే చంద్రగుప్తుఁ డనిపించున ట్లలంకరింపించెను. చంద్రగుప్తుఁ డొక్క పిడియేనుఁగు నెక్కించెను. చంద్రగుప్తానుయాయు లగు రాజుల నాతనివెంట నంపెను. రాజభవన ప్రవేశమునకు వైరోచకుఁడే మొదటివాఁ డయ్యెను. అతఁడే చంద్రగుప్తుఁ డని భ్రమపడి మావటివాఁ డగు బర్బరకుఁ డంకుశపు టొరలో దాఁచిన పిడికత్తి నందుకొనెను; దారువర్మ గోపురమును మీఁదఁ ద్రోయుటకు సిద్ధపడెను. కాని మావటివాఁ డంకుశపు టొరను తాఁకఁగానే యేనుఁ గాతఁడు తన్ను గొట్టునేమో యను భయముచేత తటాలున తన నడకను మార్చెను. అందువలన దారువర్మ పడఁద్రోసిన యంత్ర గోపురము గుఱితప్పి మావటివానిపైఁ బడఁగా నాతఁడు చచ్చెను. దారువర్మయును తన కెట్లును చావు తప్ప దని తెగించి యంత్రము చీలను బెఱికికొని చంద్రగుప్తుఁ డను భ్రాంతితో వైరోచకుని బొడిచి చంపెను. ఈ ద్రోహమును జూచుచున్న కాలుబలములవారు రాళ్లను, మంటి పెళ్లలను తల కొకటిగా విసరివైచి దారువర్మను జంపిరి. ఇట్లు బర్బరక, వైరోచక, దారువర్మలు నిహతులైరి. అభయదత్తుఁడు సిద్ధము చేసిన రసాయనమును చాణక్యుడు రాజు నెదుట బంగారు గిన్నెలో నుంచి పరీక్షించెను. గిన్నె రంగు మాఱఁగానే ఆమందు విషమిశ్రిత మని నిరూపించి దానిని వైద్యునిచేతనే త్రావించెను. వైద్యుఁడు నిహతుఁ డయ్యెను. ప్రమోదకుఁడు రాక్షసుఁ డిచ్చిన ధనమును మతిలేనివాఁడై అతి వ్యయముగా ననుభవింపసాగెను. దాని నెఱిఁగి చాణక్యుఁడు వానిని విచారించి నిజము తెలిసికొని మరణదండన విధించెను. తరువాత చంద్రగుప్తుఁడు పడకటింటిలోనికిఁ బ్రవేశించుటకుఁ బూర్వమే చాణక్యుఁ డచటికిఁ బోయి పరిశీలించి చూచెను. ఒక గోడ బొరకలోనుండి చీమలబారు మెదుకు చిదపలను తెచ్చుచుండుట యాతని కంటఁబడెను. "పడకటింటి గోడలో మెతుకు లెక్కడివి? లోపల నెవరో దాఁగి యుందు" రని యాతఁడు గ్రహించెను. వెంటనే యాతఁ డా యింటిని గాల్పించి వేసెను. పొగలు మంటలు క్రమ్ముకొనఁగా గోడలలోనివారు గోడలలోనే కాలిపోయిరి. ఇట్లు రాక్షసుని యత్నములు వమ్మయ్యెను. చంద్రగుప్తుఁడు సురక్షితుఁ డయ్యెను.

ఒకనాఁడు మలయకేతువు తన యాభరణమును తీసి రాక్షసునకు బహుమానముగా నంపెను. కంచుకి దానిని తీసికొనివచ్చి రాక్షసున కలంకరించి పోయెను. పిమ్మట విరాధగుప్తుఁ డను చారుఁడు పాములవాని వేషముతోఁ బాటలీపుత్రమునందలి సంగతులను దెలిసికొని రాక్షసుని యొద్దకు వచ్చి యాతని ప్రయ

త్నము లన్నియును విఫలములైన విధమును, జీవసిద్ధి బహిష్కారమును, శకటదాసుని శూలారోపణమును, చందనదాసుని నిర్బంధమును తెలిపెను. వారిరువురు నా విషయములను గూర్చి చింతించుచుండఁగా శకటదాసుఁడు సిద్ధార్థకునితోఁ గూడ నచ్చటికి వచ్చి తాను తప్పించుకొన్న విధమును తెలిపెను. "సిద్ధార్థకుఁడు శకటదాసును తప్పించినందులకు సంతోషించి రాక్షసుఁడు తనకు మలయకేతువు పంపఁగా ధరించియున్న యాభరణము నాతనికి బహుమానముగా నిచ్చెను. సిద్ధార్థకుఁడును దానిని గ్రహించి యొక పెట్టెలోఁ బెట్టి తనయొద్ద నున్న రాక్షసుని యుంగరముతో దానిపై ముద్రవైచి "దీనిని తమయొద్దనే దాఁచి యుంచుఁడు; అవసర మైనపుడు తీసికొందు" నని ప్రార్థింపఁగా రాక్షసుఁ డందుల కంగీకరించెను. పెట్టెపై ముద్రవేసిన యుంగరము రాక్షసునిదే యని శకటదాసు చెప్పఁగా నది తనకు చందనదాసుని యింటియొద్ద దొరకిన దని చెప్పి సిద్ధార్థకుఁ డాతని కోరికపై దానిని రాక్షసునకే యిచ్చెను. రాక్షసుఁడును ఆయుంగరము నధికార చిహ్నముగా నుంచుకొను మని శకటదాసుని కిచ్చెను. సిద్ధార్థుని కోరికపై రాక్షసుఁ డాతనిని తన కొలువులోఁ జేర్చుకొనెను.

తరువాత శకటదాస సిద్ధార్థకులను విశ్రమింపుఁ డని పంపి రాక్షసుఁడు విరాధగుప్తునకు కర్తవ్యము నుపదేశించెను. చాణక్య చంద్రగుప్తులకు లోలోపల సరిపోవుట లేదనియు, చాణక్యుఁడు చంద్రగుప్తుని యాజ్ఞలను తిరస్కరించుచున్నాఁడనియు విరాధగుప్తుఁడు చెప్పెను. అందుపై రాక్షసుఁడు "సమయము చూచుకొని చాణక్యునిపై కోపముఁ దెప్పించునట్లు చంద్రగుప్తుని పొగడవలసిన" దని స్తవకలశుఁ డనువైతాళికునకు విరాధగుప్తునితోఁ జెప్పి పంపెను. అతఁడు పోయిన తరువాత కార్యాలయమునుండి శకటదాసుఁడు "ఇవిగో మూఁడాభరణము లమ్మకమునకు వచ్చినవి; కొనుమందురా ?' అని ప్రశ్నించుచు వానిని సేవకునిచే నిచ్చిపంపఁగా రాక్షసుఁడు చూచి వానిని కొను మని చెప్పి పంపెను. ఆ సొమ్ములు పర్వతకునివి; చాణక్యుఁడు తనవారిచే చంద్రగుప్తునినుండి దానము పట్టించినవి. అవియు నిట్లు రాక్షసునికడఁ జేరెను. చాణక్యుని పన్నుగడ యిట్లు యథాసంకల్పముగా సాగఁ జొచ్చెను. కాని యది రాక్షసున కెట్లు తెలియును ? పాపము.అతఁ డింకను తన నీతి ప్రయోగముచే చాణక్య చంద్రగుప్తులకు భేదము కలుగుననియు,చాణక్యుఁడు తొలఁగినచో చంద్రగుప్తుని జయించుట సుకరముగు ననియుఁ దలంచుచుండెను.

రాక్షసుని తంత్రములను గ్రహించుచునేయున్న చాణక్యుఁడు తాను చంద్రగుప్తునితో విరోధించినట్లు నటించి, యా సాధనముననే రాక్షస మలయకేతువులకు భేదమును కలిగించుటకు నిశ్చయించెను. "కొంతకాలము నీవు నాతో జగడమాడినట్లు

నటించి స్వతంత్రముగా వ్యవహరింపవలసిన" దని యాతఁడు చంద్రగుప్తునకుఁ జెప్పి యొప్పించెను. ఆ సమయమున చంద్రగుప్తుఁడు పట్టణమునఁ గౌముదీమహోత్సవము జరుపుఁడని యాజ్ఞాపింపఁగాఁ జాణక్యుఁడు దానిని నిషేధించెను. ఆ సందర్భమున చాణక్యుఁడు చంద్రగుప్తునితో కలహమాడినట్లు నటించి తన యమాత్యచిహ్నమగు శస్త్రమును వదలిపోయెను. దానిపై చంద్రగుప్తుఁడు స్వాతంత్ర్యమును బ్రకటించెను.

నందులను జయించుటలో చంద్రగుప్తునకు సహాయులగు భద్రభటుఁడు మొదలగు ప్రధానపురుషులను గొందఱను చాణక్యుఁ డేవేవో కారణములను గల్పించి యుద్యోగములనుండి తొలఁగించెను. వా రందఱును, చంద్రగుప్తునిపై నపరక్తులైనట్లును, రాక్షసుని తంత్రమునకు లోఁబడినట్లును నటించి మలయకేతువునొద్దఁ జేరిరి. అట్లు చేరునప్పుడు వారు "మేము అమాత్యరాక్షసులను పురస్కరించుకొని తమ కొలువులోఁ జేరుటలేదు; మఱి యేమనఁగా తమ సేనాపతి శిఖరసేనులను పురస్కరించుకొని చేరుచున్నా" మని మలయకేతువునకు విన్నపమంపిరి. "దాని భావమేమా?" యని మలయకేతువు సందేహించుచుండఁగా ప్రక్కనేయున్న భాగురాయణుఁడు "రాక్షసునకు చాణక్యునిమీఁదనే పగ గాని చంద్రగుప్తునిమీఁదఁ గాదు, ఒకవేళ చంద్రగుప్తుఁ డెన్నఁడైన చాణక్యుని వదలినచో రాక్షసుఁ డప్పు డాతనికడఁ జేరవచ్చును. భద్రభటాదులు రాక్షసుని పురస్కరించుకొని యిచటఁ జేరినచో నప్పుడు తాము వారినిగూడ విశ్వసింపరుగదా? అందుకై వా రట్లు చెప్పియుండవచ్చును." అని వివరించి మలయకేతువునకు రాక్షసునిపై ననుమానము గలిగించెను. పిమ్మట మలయకేతువు భాగురాయణునితోఁ గూడ రాక్షసునియొద్దకు వచ్చెను. లోపల కరభకుఁడను వాఁడు కుసుమపురమునుండి వచ్చి రాక్షసునితో చాణక్య చంద్రగుప్తుల కలహమునుగూర్చియు, చంద్రగుప్తుఁడు చాణక్యుని మంత్రిపదవినుండి తొలఁగించుటను గూర్చియు తెలుపుచుండఁగా వెలుపలనుండి మలయకేతువు వినెను. ఆతనికి రాక్షసునిపైఁ గల యనుమానము దృఢమయ్యెను. తరువాత నాతఁడు లోపలికిఁబోయి యమాత్యునితో యుద్ధప్రయత్నములనుగూర్చి మాటలాడి వెడలిపోయెను.

దండయాత్ర సాగెను. పాటలీపుత్రము దాఁపుదాఁపునకు వచ్చెను. మలయకేతువు కటకమునుండి యెవరు గాని భాగురాయణుఁడు చేసియిచ్చు ముద్రాచిహ్నము లేనిది వెలుపలికిఁ బోవుట గాని, లోపలికి వచ్చుట గాని నిషేధింపఁబడెను. సిద్ధార్థకుఁడు తనకు చాణక్యుఁ డుపదేశించిన కపటనాటకమునకుఁ బ్రారంభము చేసెను. పూర్వము చాణక్యుఁడు సిద్ధముచేసి తనచేతి కిచ్చియుండిన యుత్తరమును, తాను

రాక్షసునుండి బహుమానముగాఁ బొందిన సొమ్మును తీసికొని యాతఁడు భాగురాయణుని ముద్ర లేఖుండఁగనే పాటలీపుత్రమునకుఁ బ్రయాణమయ్యెను. ఇఁక జీవసిద్ధియును తనవంతు నాటకమును తానును ఆడుటకు సమకట్టెను. అతఁడు ముద్రకొఱకని భాగురాయణునియొద్ద కేగి ప్రసంగవశమునకలె "పర్వతకుని జంపించినది చాణక్యుఁడు గా" దనియు, "రాక్షసుఁడే తనమూలమున విషకన్య నంపి పర్వతకుని జంపించె" ననియు, "దానికి ఫలముగా తనకు పాటలీపుత్రమునుండి బహిష్కారము జరిగె" ననియు వగచి, "రాక్షసుఁ డిప్పుడుగూడ మరల నేదో దుష్కృత్యమునకుఁ బూనినాఁడు; కావున నే నాతనిని వదలిపోవుచున్నా" నని తెలిపి పోయెను. ఈ మాటలను వెలుపలనుండి విన్న మలయకేతువు నివ్వెఱపోయెను. రాక్షసునిపై నాతనికి వచ్చినకోపమునకును, ఏవగింపునకును అంతులేదు. కాని భాగురాయణుఁడు "రాక్షసుని ప్రాణములను గాపాడవలసిన" దను చాణక్యుని యుపదేశము ననుసరించి మలయకేతునితో "రాక్షసుని నిప్పుడు నిగ్రహించినచో ప్రకృతిక్షోభము కలుగును; అట్లైన మనకు జయము సంశయాస్పద మగును; చంద్రగుప్తుని జయించిన తరువాత తమ యిష్టముప్రకారము చేయవచ్చును." అని బోధించి అతనిని శాంతిపఱచెను.

ఇంతలో ముద్రలేఖుండఁగనే కటకమునుండి వెలుపలికిఁ బోవుచున్న సిద్ధార్థకుని రాజభటులు పట్టుకొనివచ్చి మలయకేతు భాగురాయణుల కప్పగించిరి. భాగురాయణుఁడు సిద్ధార్థకుని విచారించెను. సిద్ధార్థకుఁడు మొదట చెప్పుటకు సంకోచించినట్లును, చివరకు రాజభటులతో తన్నులు తినలేక చెప్పినట్లును నటించుచు తాను రాక్షసుని సేవకుఁడ ననియును, రాక్షసుని ముద్రతోనున్న లేఖను పేటికను తీసికొని చంద్రగుప్తునియొద్దకుఁ బోవుచున్నాఁడ ననియు వెల్లడించెను. మలయకేతువు లేఖను దీసి చదివెను. అందు రాక్షసుఁడును, చిత్రవర్మాదులును చంద్రగుప్తునితో సంధచేసికొని తనకు ద్రోహముచేయ సిద్ధపడినట్లును, దానికిఁ బ్రతిఫలముగా చంద్రగుప్తుఁడు వారి కేవేవో యిచ్చునట్లు ఒప్పందము చేసికొనినట్లును నుండెను. చంద్రగుప్తుఁడు రాక్షసునకుఁ గానుకగా కొన్ని యాభరణముల నంపినట్లును, దానికి బదులుగా రాక్షసుఁడుగూడ నాతనికి నొక యాభరణమును కానుకగాఁ బంపుచున్నట్లును గూడ వెల్లడియయ్యెను. లేఖవెంట నున్న పెట్టెలో పూర్వము తాను రాక్షసునకు బహుమానముగాఁ బంపియున్న యాభరణ ముండెను. రాక్షసుఁడు ద్రోహియని మలయకేతువు నిశ్చయించెను. వెంటనే యాతఁడు రాక్షసుని బిలిపించి యన్నివిషయములను నడిగెను. రాక్షసుఁ డది శత్రువులు కల్పించిన కపటలేఖ యని తెలిపెను. ఉత్తరము శకటదాసుఁడు వ్రాసినదని సిద్ధార్థకుఁడు చెప్పెను. అది నిజమైనచో నుత్తరము నాదే

యని రాక్షసుఁ డనెను. అంతట శకటదాసుఁడు వ్రాసిన మఱియొక వ్రాఁతను దెప్పించి పోలికను చూడఁగా నక్షరములు సరిపోయెను. రాక్షసుఁడు నిరుత్తరుఁ డయ్యెను. మఱియొక సంఘటనము దీనికిఁ దోడుపడెను. రాక్షసుఁడు తాను గొన్న సొమ్ములలోనుండి యొకదానిని ధరించి వచ్చియుండెను. అవి పర్వతకుని సొమ్ములు గదా ! మలయకేతువు గుర్తించెను. చంద్రగుప్తుఁడు వానిని రాక్షసునకుఁ బంపి యుండునని దృఢముగా నమ్మెను. "మా తండ్రిని జంపినదిగూడ నీవే" యని రాక్షసుని నిందించి యాతనిని ద్రోహిగాఁ బ్రకటించెను. ఇట్లు పగతుని నీతిప్రయోగమునకుఁ జిక్కి విధివిధానమునకు నిర్విణ్ణుఁడై యున్న రాక్షసుని వెడలఁగొట్టి, చిత్రవర్మాదులను జిత్రవధ గావించున ట్లాజ్ఞాపించి మలయకేతువు దండయాత్రా ప్రయత్నములను సాగింపఁబోయెను. అంతట రాక్షసుఁడు నిరాశ్రయుఁడై చేయునదిలేక యింక చందనదాసుని విడిపించుటకైనను బ్రయత్నింతును గాక" యని గత్యంతరము లేక తిరిగి పాటలీపుత్రమునకుఁ బోయెను.

ఇది యంతయును చాణక్యుఁడు చారులవలనఁ దెలిసికొనెను. బలప్రయోగమునకు దిగకుండ రాక్షసుని నిరాయుధుని జేసినఁగాని కార్యము కుదుర దని చాణక్యుఁడు మఱియొక పన్నుగడను బన్నెను. రాక్షసుఁడు పాటలీపుత్రమునకు సమీపమున నున్న జీర్ణోద్యానములోఁ బ్రవేశింపనున్నాఁ డని తెలిసికొని, తాను ముందుగానే యొక రాజపురుషునిఁ జెప్పవలసిన మాటలను జెప్పి పంపెను. వాఁ డొకయురిత్రాటిని దీసికొని జీర్ణోద్యానమునకుఁ బోయి రాక్షసున కగపడునట్లుగా నాత్మహత్యకై యురివేసికొనువానివలె నటించెను. దయార్ద్రచిత్తుఁడగు రాక్షసుఁడు దానిని జూచి, వానియొద్దకుఁ బోయి యూఱడించి, కారణ మడుగఁగా, వాఁడు తనకు జిష్ణుదాసుఁ డను నొక మిత్రుఁ డున్నాఁ డనియు, అతఁడు ఒకానొక యాపద కారణముగా నగ్నిలోఁ బడి చచ్చుటకు సిద్ధపడుచున్నాఁ డనియు, నాతనిపై స్నేహమువలన నాతని కీడువార్త వినకముందే ప్రాణములను వదలుటకుఁ దా నీ యత్నముఁ జేయుచుంటి ననియుఁ దెలిపెను. జిష్ణుదాసుని యాపదనుగూర్చి యడుగఁగా, నతనికిఁ జందనదాసుఁ డను మిత్రుఁడు కలఁ డనియు, అతఁడు రాక్షసులవారి కుటుంబమును దాఁచి కాపాడుటవలన రాజదండనమునకు గుఱియై వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడుచున్నాఁ డనియు, ఆ మిత్రవ్యసనమునకు దుఃఖితుఁడై జిష్ణుదాసుఁడు అగ్నిప్రవేశము చేయనున్నాఁ డనియుఁ జెప్పెను. ఇట్లు మిక్కిలి యాప్తునివలె నగపడి తనకు చందనదాసుని వార్తను దెలిపిన యా పురుషునకు రాక్షసుఁడు తన్నెఱింగించుకొనెను. "తాను ఖడ్గ

సహాయుఁడనై చందనదాసును విడిపింతు'' ననియు, ''ఈవార్తను జిష్ణుదాసునకుఁ దెలిపి యాతనిని గాపాడు'' మనియు రాక్షసుఁ డాతనికిఁ జెప్పెను. అందుల కా పురుషుఁడు రాక్షసునితో ''సిద్ధార్థకుఁడు శకటదాసుని దప్పించినప్పటినుండియు రాజభటులు జాగరూకులై యున్నా''రనియు, ''శస్త్రపాణి యగు నూతనుఁ డెవఁడేని యగపించినచో వారు వధ్యుఁడగు వానిని నడిత్రోవలో నైనను చంపివేయుదు'' రనియుఁ దెలిపి, అందువలన రాక్షసుఁడు శస్త్రపాణియై పోయినచో చందనదాసుని గాపాడుట యసంభవ మని చెప్పి, తా నీవార్తను జిష్ణుదాసునకుఁ జెప్పుమిషతో వెడలిపోయెను. ఈ సంఘటనముచే నింకను మతి చెదరిపోయిన రాక్షసుఁడు చేతనున్న కత్తినిగూడ వదలి, తన ప్రాణముల నడ్డుపెట్టియైనను చందనదాసును గాపాడవలయు నను నిశ్చయముతో వధ్యస్థానమునకుఁ బోయెను.

సిద్ధార్థకుఁడును, నతని మిత్రుఁ డగు సమిద్ధార్థకుఁ డను మఱియొక రాజపురుషుఁడును జాణక్యుని యాజ్ఞచేఁ జండాలుర వేషములను ధరించి చందనదాసును వధ్యస్థానమునకుఁ జేర్చిరి. వారు చందనదాసును శూలము నెక్కింపఁబోవు సమయమునకు సరిగా రాక్షసుఁ డచటికి వచ్చెను. ఉదాత్తహృదయుఁ డగు నాతఁడు వారితో ''బుద్ధదేవునివంటి మహనీయుని చందనదాసును ఎవనికోసమై కొఱత వేయుచున్నారో ఆ రాక్షసుఁడను నేనే'' యని తెలిపి, చందనదాసుని వదలి యాతని యా మరణదండనమును తనపై నెరవేర్పవలసినదిగా వారిని కోరెను. రాజభటులలో నొకఁడు చందనదాసునకుఁ గాపుగా రెండవవాని నచట నే యుంచి తాను రాక్షసుని బిలుచుకొనిపోయి యీ వార్తను చాణక్యునకు నివేదించెను. చాణక్య రాక్షసు లొకరి నొకరు కలిసికొనిరి. చాణక్యుఁడు రాక్షసునకు నమస్కరించి యాతని గుణగణములను పొగడి, గతమునకు వగవ వలదనియు, ఎట్లేని యాతని తోడ్పాటును బొంది సామ్రాజ్యమును స్థిరీకరించుటయే తన యాశయ మనియు, అందులకే తా నింత శ్రమపడితి ననియుఁ దెలిపి తన పన్నాగముల నెల్ల వివరించెను'

అంతలో చంద్రగుప్తుఁడును వచ్చెను. చాణక్యరాక్షసుల నిరువురను సమముగా గురుభావముతో నమస్కరించి యాతఁ డాదరించెను. రాక్షసుఁడుగూడ చంద్రగుప్తుని సుగుణములను జూచి ముగ్ధుఁ డయ్యెను. ఈతనివలన చాణక్యుఁడు కీర్తిమంతుఁ డగుట యుచితమే యని మనసులో ప్రశంసించెను. ఈ స్థితిలో చాణక్యుఁడు ''చంద్రగుప్తునియెడ విరోధము వదలి యనుగ్రహించి యాతనికడ మంత్రిత్వమును వహింపు'' మని రాక్షసుని ప్రార్థించెను. అందుల కంగీకరింపనిచో

చందనదాసుని మరణమునుండి తప్పించుట యసంభవ మని నిర్బంధించెను. నిరాశ్రయుఁడును, గుణప్రియుఁడును, మిత్ర పక్షపాతియు నగు రాక్షసుఁడు చందన దాసును రక్షించుటకు మార్గాంతరములేక చంద్రగుప్తుని మంత్రిత్వమున కంగీకరించెను. చాణక్యుని యత్నము ఫలించెను.

రాక్షసుఁడు తొలఁగుటవలనను, చిత్రవర్మాదుల ఘోరదండనమువలనను మలయకేతుని బలములు ఛిన్నభిన్నము లయ్యెను. ఇట్లు నిస్సహాయుఁడైన యా మూర్ఖుని భద్రభటాదులగు సైనికోద్యోగులు బంధించుకొని చంద్రగుప్తునికడకుఁ దెచ్చిరి. రాక్షసప్రార్థితుఁడై చంద్రగుప్తుఁడు మలయకేతుని రక్షించి యాతని తండ్రిరాజ్యమున నాతని బట్టాభిషిక్తుని గావించి రండని భద్రభటాదుల కాజ్ఞాపించెను. రాక్షసునకుఁ బ్రియముసేయుటకై చందనదాసును దండనమునుండి తప్పించి సకలరాజ్యమునందును శ్రేష్ఠిముఖ్యుని గావించెను.

చాణక్యుఁ డిట్లు తీర్ణప్రతిజ్ఞుఁడై రాక్షస చంద్రగుప్తులకు మైత్రిని సాధించి, మౌర్యసామ్రాజ్యమును సుస్థిరముగావించి కృతార్థుఁ డయ్యెను.

---

# సవరణపట్టిక.

—: ० :—

| పుట. | పంక్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 6 | 28 | మూర్యునెద | మూర్యునెడ |
| 16 | 2 | సింహనాథుండు | సింహనాదుండు |
| 26 | 10 | ఇది ప్రథమాంకము | ఇది ముద్రాలాభ మను ప్రథమాంకము |
| 27 | 14 | పాములోళ్లు | సాములోళ్లు |
| ,, | 26 | చూపిస్తాను | నూపిస్తాను |
| 69 | 9 | ప్రెభువువారగు | ప్రైభువులవారగు |
| 89 | 3 | పాటలీపురంలో | పాటలీపుత్రంలో |
| 102 | 15 | హితాత్మకుఁడే | హితాత్మజుఁడే |
| 106 | 22 | కుమ్మినటై | కుమ్మినట్లై |
| 124 | 17 | గ్రుంకిన | గ్రుంగిన |
| 125 | 16 | ఇది గూడ | (తనలో) ఇది గూడ |
| 130 | 17 | దుర్గపాలుఁడను | దుర్గపాలుఁడగు |

——

# ఈ నాటకమున వచ్చుపాత్రలు.

—: o :—

1. చంద్రగుప్తుఁడు — మగధదేశపురాజు.
2. చాణక్యుఁడు — చంద్రగుప్తుని గురువును, మంత్రియును.
3. జీవసిద్ధి (ఇందుశర్మ) — బౌద్ధ సన్న్యాసివేషమున నున్న చాణక్యుని మిత్రుఁడు. ప్రణిధి.
4. భాగురాయణుఁడు — చాణక్యుని ప్రణిధి.
5. సిద్ధార్థకుఁడు — చాణక్యుని ప్రణిధి.
6. సమిద్ధార్థకుఁడు — సిద్ధార్థకుని మిత్రుఁడు; రాజపురుషుఁడు.
7. నిపుణకుఁడు — చాణక్యుని గూఢచారుఁడు.
8. శార్ఙ్గరవుఁడు — చాణక్యుని శిష్యుఁడు.
9. వైహీనరి — చంద్రగుప్తుని కంచుకి.
10. శోణోత్తర — చంద్రగుప్తుని ప్రతీహారి (స్త్రీ)
11. మలయకేతువు — పర్వతదేశపు రాజు.
12. రాక్షసుఁడు — ప్రకృతము మలయకేతువుకడఁ జేరిన నందుల మంత్రి.
13. చందనదాసుఁడు — రాక్షసుని మిత్రుఁడగు రత్నాలవర్తకుఁడు.
14. శకటదాసుఁడు — రాక్షసుని మిత్రుఁడు; కాయస్థుఁడు.
15. జీర్ణవిషుఁడు — పాములవాని వేషమున నున్న విరాధగుప్తుఁడు; రాక్షసుని మిత్రుఁడు; ప్రణిధి.
16. కరభకుఁడు — రాక్షసుని చారుఁడు.
17. ప్రియంవదకుఁడు — రాక్షసుని సేవకుఁడు.
18. జాజలి — మలయకేతుని కంచుకి.
19. విజయ — మలయకేతుని ప్రతీహారి (స్త్రీ)
20. భాసురకుఁడు — భాగురాయణుని సేవకుఁడు.

ఇతరులు :—చందనదాసుని భార్య, కుమారుఁడు, ఉరిత్రాటితోడి మనుష్యుఁడు మొదలగువారు.

——

శ్రీ

# ముద్రారాక్షసము

—:o:—

(నాంది)

ఉ. 'శ్రీ మెఱయించు నే సుకృతి శీర్షముపై నిటు?'-'చంద్రరేఖ'-'పే
'రే మొకొ?' - 'ఔ, నెఱింగి మఱి పేటికిఁ?'-ప్రశ్న మొనర్తుఁ జంద్రుఁ గా
దీ మెలఁతన్' - 'వచించు జయయే శశిఁ గాదన' - నందు దేవికిన్
జామను గంగ డాఁచు విభుశాఠ్యము మీ కిడుఁగాక భద్రముల్.

మ. ధర క్రుంగంబడు నంచు స్వైరపదపాతక్రీడనుం గొంచి, రూ
పఱు లోకంబు లటంచు బాహువులు సాఁపంబోక కుంచించి, చి
చ్ఛుఱచూడ్కిన్ జెడు నంచు లక్ష్యములఁ బెల్చ న్నిల్ప కాధారసం
భరణాయాసి పురారి గొన్న నటనప్రారంభ మోమున్ మిమున్

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర:—అతివిస్తర మెందులకు? సామాజికు లీనాఁడు సామంతవటేశ్వరదత్తుని పౌత్త్రుఁడు, మహారాజపదము నందిన భాస్కరదత్తుని పుత్త్రుఁడు, మహాకవి విశాఖదత్తుఁడు రచించిన ముద్రారాక్షస మను నాటకమునకు నఖిలగుణోదాత్త మగు నాంధ్రానువాదము నభినయింపవలసినదిగా నా కాజ్ఞాపించినారు. అనువాదమున కేమి గాని యది యఖిలగుణోదాత్త మగుటయే కష్టము. ఏల యన?

తే. వలఁతినుడికార మున్న భావంబు సున్న;
భావపుంబుష్టి యున్న నల్పంబు శయ్య;
రెండునుం గూడ మూలానుసృతి దొలంగుఁ;
గత్తిపై సాము లనువాదకావ్యరచన.

కావున నట్టిది యేది కలదా? యని యాలోచించుచున్నాఁడను. (యోజన నభినయించి సంతోషముతో) ఆఁ, స్ఫురణకు వచ్చినది.

విద్వచ్ఛిరోమణులు బ్రహ్మశ్రీ అవధానము చంద్రశేఖర శర్మగారు కొలఁదికాలముక్రిందటనే యీ నాటకమునకుఁ గావించిన యనువాదము మిక్కిలి హృదయంగమమైనది కలదుగదా. అది సామాజికుల కోరిక కనురూపముగా నుండును. దాని నభినయించి నేఁడు సామాజికుల నలరించెదఁ గాక. కావ్య విశేషముల నెల్ల నెఱింగిన యిట్టి సామాజికుల యెదుట నాటక మాడుట యనఁగా నాకును నిక్కముగా నెంతయో సంతస మగుచున్నది. ఏల యన ?

తే. ఎంత మూర్ఖుని కృషియైన నెదిగి పండు
నుత్తమక్షేత్రమునఁ బడియుండునేని ;
వరి యెదిగి పండుటకు నాటువానిగుణము
వలయునే యెందు ? మేలైన పొలము గాక.

ఇంక నింటికిఁ బోయి గృహజనముతోఁ గలసి సంగీతకమునకుఁ బ్రారంభము చేయుదును. (ముందుకు నడచి చూచి) ఓహో! యేమి యిది? మాయింట నేదో మహోత్సవము జరుగుచున్నట్లున్నది! పరిజను లందఱును ముందుకంటె నెక్కువగాఁ దమ తమ పనులలో మునిఁగియున్నారు. ఇదిగో !

క. జల మీమె తెచ్చు; గంధం
బులఁ జాఁదె నీమె; చిత్రముగ నీ చెలి పు
వ్వులు గట్టు; నీమె పోటునఁ
గలుపుఁ గోఁకటికిఁ దోడు కలహుంకృతులన్.

అగుఁగాక; ఇల్లాలిని బిలిచి యడిగెదను. (తెరవైపునకుఁ జూచి)

తే. రావె గుణవతి! చతురుపాయావసథమ !
రావె స్థితిహేతుకా ! త్రివర్గప్రదాత్రి!
నిండి నాయింట వెలసిన నీతివిద్య ! .
రాఁగదవె యార్య ! కార్యగౌరవముఁ దీర్ప.

నటి :—(ప్రవేశించి) ఆర్యపుత్త్రా! యిదుగో వచ్చినాను. పని యేమో ఆజ్ఞాపించి అనుగ్రహించండి.

సూత్ర :—ఆర్యా! ఆజ్ఞాపించుమాట య ట్లుండనీ గాని, యీ నాఁడు నీ వేమైనఁ బూజనీయులగు బ్రాహ్మణులను భోజనము నకుఁ బిలిచి మన కుటుంబము ననుగ్రహించితివా? లేక కావలసినవా రెవరైనను మనయింటికి నతిథులుగా వచ్చిరా? యేల యిట్లు విశేషము లగు వంటకములను సాగించు చున్నారు?

నటి :—ఆర్యపుత్రా, పూజనీయులగు బ్రాహ్మణులను నేనే భోజనా నికి పిలిచినాను.

సూత్ర :—మంచిది; కాని యెందుకోఆ కని?

నటి :—చంద్రునికి గ్రహణం కలుగుతుంది గదా అని.

సూత్ర :—ఎవరు చెప్పిరి?

నటి :— వూళ్లో వాళ్లందరూ యీ విధంగానే అనుకుంటున్నారు.

సూత్ర :—ఆర్యా, జ్యోతిశ్శాస్త్రమునందుఁ గల యఱువదినాలు గంగములలోను పరిశ్రమముఁ గావించితిని. పూజనీయులగు బ్రాహ్మణులకోఆక్కై చేయుచున్న వంటలు సాగనీగాని చంద్రగ్రహణము విషయమున మాత్రము నీవు మోసపోయి తివి. చూడుము.

తే. పూర్ణమండలుఁ డగు చంద్రుఁ బొదువఁ జూచు
నల్ల కేతువు క్రూరగ్రహాగ్రసరుఁడు
బలిమి నియ్యెడ;

(తెరలో) ఆఁ, ఎవఁడురా వీఁడు? నే నుండఁగనే...!

సూత్ర :—

అద్దానిఁ గలుగనీక
కాచు నితని బుధునియోగంబుకలిమి.

నటి :—ఆర్యా, ఎవ రీయన? నేలమీద వుండి గ్రహణం కలగ నీయకుండా చంద్రుణ్ణి కాపాడ వలుస్తున్నాడు!

సూత్ర :—ఆర్యా, నాకును నిక్కముగా గుఱుతుపడ లేదు. కానిమ్ము. మరల నడిగించుకొని కంఠస్వరమును కనిపట్టెదను.

('పూర్ణ మండలుఁడగు' ఇత్యాది పద్యమును మరలఁ జదువును.)

(తెరలో) ఆఁ, ఎవఁడురా వీఁడు నే నుండఁగనే చంద్రగుప్తుని బలాత్కారముగ నాక్రమింపఁ దలఁచువాఁడు?

సూత్ర :—(విని) ఆఁ, తెలిసినది.

తే. ఇతఁడు కౌటిల్యుఁడు;

(నటి భయమును నటించును.)

రుషాగ్ని నెవఁడు నంద
కులము నొక్కటఁ గాల్చె నా కుటిలబుద్ధి;
చంద్రుఁ గ్రహణం బనఁగ మౌర్యచంద్రుఁ బగతు
రలము టని వచ్చు నామతుల్యత భ్రమించి.

కావున మనము పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---

# ప్రథమాంకము

(అంతట సిగను దడవుకొనుచుఁ జాణక్యుఁడు ప్రవేశించును.)

చాణ :—ఆఁ, ఎవఁడురా వీఁడు? నే నుండఁగనే చంద్రగుప్తుని బలాత్కారముగ నాక్రమింపఁదలఁచువాఁడు?

ఉ. కుంజరయూథశోణితముఁ గ్రోలుటఁ గెంపులువాఱి సాంధ్యరు
గ్రంజితచంద్రరేఖ యనఁగాఁ బరిజృంభిత విస్తృతాస్యమౌ
కుంజరవైరినోట మెఱుఁగుల్ దులకించెడు కోఱపైఁ జెక
ల్పం జెయి సాఁప నెంచెడు నెవండు తృణీకృత తత్ప్రభావుఁడై.

తే. అఖిల నందాన్వవాయ కాలాహి, నస్మ
దుగ్రకోపానల వినీల ధూమరేఖ
నాదుసిగ ముడివైవ నీనాఁడు సైత
మెల్లకుండెడు నట్టివధ్యుం డెవండు?

ఉ. చండతరార్చి నందకులసత్రము బుగ్గియొనర్చి మింటికిన్
మండు మదుగ్రకోపదహనంబు ప్రతాపము నెన్నఁబోక వీ
తండితనంబు నూని యెదిరిం దను గానని దుర్వినీతుఁ డె
వ్వం డిటు లంగవించి శలభంబుక్రియ న్నశియించు నొక్కటన్?

శార్ఙ్గరవా! శార్ఙ్గరవా!

శిష్యుఁడు :—(ప్రవేశించి) ఆచార్యా! యేమి యాజ్ఞ?

చాణ :—వత్సా! కూర్చుండఁ గోరెదను.

శిష్య :—ఆచార్యా! యివిగో మొగసాల వేత్రాసనములు సిద్ధముగనే యున్నవి. ఉపాధ్యాయులవారు కూర్చుందురుగాక.

చాణ :—వత్సా! రాజకార్యమును గూర్చిన తీవ్రాలోచనము మమ్మిట్లు కలవరపెట్టుచున్నది. అంతియేగాని సహజముగా నుపాధ్యాయు లందఱును శిష్యులమీఁదఁ జెలాయించు నట్టి దౌర్జన్యము గాదు.

(శిష్యుఁడు నిష్క్రమించును.)

చాణ :—(కూర్చుండి తనలో) ఏమీ! మేము నందకులమును నాశముచేసితి మన్న కోపముతో నున్న రాక్షసుఁడు, పితృవధామర్షితుఁ డగు పర్వతకపుత్త్రుఁడు మలయకేతువునొద్దఁ జేరి నందరాజ్య మంతయును నీకొసఁగెద నని మాటయిచ్చి, ప్రోత్సహించి యాతనితో సంధిచేసికొనె ననియు, నాతఁడు గుమిగూర్చిన యపారము లగు మ్లేచ్ఛరాజబలములను తోడు చేసికొని వృషలునిపైకి దాడివెడల నున్నాఁ డనియు నీ విషయమంతయును పౌరుల కందఱకును వెల్లడియై పోయినది! (ఆలోచించి) అగుఁగాక. నందవంశమును నాశముచేయుదు నని ప్రపంచమున కంతకును దెలియునట్లు ప్రతిజ్ఞ పట్టి మహానదివలె దాఁటరాని యంతటి ప్రతిజ్ఞ నే గడచితి నఁట! అట్టి నాకు ఇప్పుడు వెల్లడి యగుచున్నంతమాత్రమున దీనిని అణఁచివేయుట యొక లెక్కలోనిది గాదు. ఏల యన?

సీ. ఎడతెంపులేక రేఁగెడు శోకధూమంబు లరివనితాదిశాస్యములఁ గ్రమ్మి
కళ లెడలించి కాఱ్కొలుపఁ, బ్రస్ఫుటనీతివాతోద్ధతితము మోహభస్మ మడరి
సచివవృక్షంబు లాచ్ఛాదింప, విభ్రాంత పౌరద్విజాళి దుర్వారభీతిఁ
గలఁగి, పోనాడ, దిక్కులఁబాఱ నందవంశప్రరోహముల భస్మం బొనర్చి.
తే. యెందు నరవాయిగొనక పెల్లేఁచి సుడిసి మామక క్రోధవహ్ని శ్రమంబు గనదు
కాల్పఁ దగునది వేఱొండు గానరామి నరయ నీనాఁటి కింత చల్లారెఁగాక.

అదిగాక,

శా. నన్నుగ్రాసనపాతితున్ వివశు వంతన్ మోములన్ వ్రాల్చి ముక్
గన్నా రెవ్వరు రాజభీతి ధృతధిక్ఛద్దాస్యులై, వారె వెం
డి న్నందున్ సతనూజుఁ గన్గొనిరి పీఠిన్ బాపి హర్యక్షు మ
ద్రి న్నాగేంద్రుని బాపి యీడ్చుగతి ధాత్రిం గూల నే నీడ్వఁగన్.

అట్టి నేను ఇప్పుడు నా ప్రతిజ్ఞాభారమంతయును తీఱిపోయినను వృషలునికొఱకై శస్త్రమును ధరించి యున్నాఁడను. నేను గదా,

మ. ధర హృచ్ఛల్యముల ట్లగల్చి నవనందశ్రేణిఁ బోకార్చి, పెన్
సరసిన్ బద్మినిఁబోలె మౌర్యునెడ రాజ్యశ్రీఁ బ్రతిష్ఠించి, దు

ర్భరసంధాద్భుతిఁ గ్రోధ మోదముల కర్హం బైన తత్తత్ఫలం
బరి మిత్రుల్ సరిపెట్టునం గొనఁగఁ జేయం గంటి నుద్యన్మతిన్.

ఊఁహూఁ, అది గాదు; రాక్షసుని లోఁబఱచుకొన నంతవఱకును ఏమి నందవంశోన్మూలనము? ఏమి చంద్రగుప్తలక్ష్మీస్థిరీకరణము?

(ఆలోచించి) ఔరా, రాక్షసునకు నందవంశమునందుఁ గల నిరతిశయ మగు భక్తి గుణము! నందవంశమున నెవ్వఁడు మొలక బ్రదికి యున్నను అతనిని వృషలునియొద్ద మంత్రిత్వమున కొప్పించుటకుఁగాని, నందవంశమును గూర్చిన ప్రయత్నముచేయకుండ నివారించుటకుఁ గాని యెన్నఁటికిని శక్యముగాదు. ఈ యభిప్రాయము చేతనే-పాపము! – నందవంశీయుఁ డగు సర్వార్థసిద్ధిని-తపోవనమునం దున్నను-జంపించితిని. ఇప్పటికిఁ గూడ నీతఁడు మలయకేతువును చేతఁబట్టుకొని మమ్ము నుచ్ఛేదించుటకై యెంతయేని ప్రయత్నమును జూపుచునే యున్నాఁడు. (కంటి యెదుటివానిని జూచునట్లు, ఆకాశమువైపు చూపు సారించి) మేలు! అమాత్యరాక్షసా, మేలు!; మేలు! మంత్రిబృహస్పతీ! మేలు!

మ. కలిమిం బాయని భూపతిం గొలుచు లోకం బెల్ల నర్థాశ; నో
వ్వుల నే నాతని వీడ కేగెడు జనంబున్ దత్ప్రతిష్ఠాశ; నీ
వలెఁ దన్నాశమునన్ బురోపకృతముల్ భావించి తత్కార్య మి
ట్టుల నిస్సంగపు భక్తిఁ దాలుచు ఘనుండున్ గల్గునే భూమిపై?

ఇట్టివాఁడవుగావుననే "యీతఁడు మంత్రిపదమును గ్రహించి వృషలుని ననుగ్రహించుట యెట్లా?" యని నిన్ను లోఁబఱచుకొనుటకై నేమి ప్రయత్నము చేయుట. ఏల యన?

మ. అనురక్తుం డయినన్ ఫలంబుగలదే యప్రాజ్ఞుఁడుం గాతరుం
డును నైనన్? మతి విక్రమంబులఁ దగున్ బో భక్తి లేదేని యొం
దుసకాఁ? బ్రజ్ఞయు, భక్తి, విక్రమముఁ దోడ్తోఁ బెంపువాటించు న
య్యనఘుల్ భృత్యులు ఱేనికిన్; బరులు జాయల్ కష్టసౌఖ్యంబులన్.

అందువలన నేనును నీ విషయమునఁ గన్నుమూసియుండుట లేదు. అతనిని లోఁబఱచుకొనుటకై చేతనయినంతవఱకును బ్రయత్నము చేయుచున్నాఁడను. ఎట్లన, వృషల పర్వతకులలో నెవరిని జంపినను చాణక్యున కపకారము చేసిన ట్లగునని రాక్షసుఁడు, మాకు నత్యంతోపకారమును జేసిన మిత్రుని – పాపము – పర్వతేశ్వరుని విషకన్యను బ్రయోగించి చంపించినాఁ డని చక్కఁగా జనాపవాదమును బ్రచారముచేయించితిని. ప్రజలకు నమ్మకము కలుగున ట్లీ విషయ మింకను విస్పష్టమగుఁ గాక యనియే పర్వతక పుత్త్రుఁడగు మలయకేతునకు 'నీ తండ్రిని చాణక్యుఁడు చంపించినాఁ' డని భాగురాయణునిచేత నేకాంతమునఁ జెప్పించి భయపెట్టి యాతఁడు పలాయితుఁ డగునట్లు చేయించితిని. రాక్షసమతిపరిగృహీతుఁడై యిప్పుడు దండెత్తి వచ్చుచున్నను వీనిని బ్రజ్ఞాబలముచే నివారించుట యశక్యము గాదు; కాని వీనిని నిగ్రహించినచో మేమే పర్వతకుని జంపితిమను నపకీర్తి బట్టబయలై తుడువరానిది యగును. ఇందులకే వానిని పలాయనముచేయించుట.

స్వపక్ష పరపక్షములలో మాయెడల ననురక్తు లెవరో అపరక్తు లెవరో తెలిసికొనుటకు వివిధములగు దేశభాషలను, వేషములను, ఆచారములను నేర్చిన గూఢచారులను పెక్కు మాఱురూపములతోఁ బంపితిని. వారును కుసుమపురములో నున్న నందామాత్యమిత్రుల నడవడులయందలి ప్రత్యంశమును మిక్కిలి నేర్పుతోఁ గనుపెట్టుచున్నారు.

చంద్రగుప్తుని యుద్యమసహచరులగు భద్రభటాదు లగు ప్రధానోద్యోగులను ఆయాకారణములను గల్పించి, యుద్యోగములనుండి తొలఁగించి, మాయెడ నపరక్తులనుగాఁ బ్రఖ్యాపించితిని. శత్రుప్రయుక్తులగు మర్మఘాతుకులు రసప్రయోక్తలు మొదలగు వారికిఁ బ్రతిక్రియ గావించుటకై భ్రమప్రమాదముల నెఱుఁగని యాప్తపురుషులను – ముందుగా వారిభక్తిని బరీక్షించి యాపిమ్మట – రాజసమీపమున సంగరక్షకులనుగా నియమించితిని.

మఱి మా సహాధ్యాయియు మిత్రుఁడునగు నిందుశర్మయను బ్రాహ్మణుఁడు గలఁడే, ఆయన శుక్రాచార్యుని దండనీతియందును, అఱువదినాలు గంగముల జ్యోతిశ్శాస్త్రమునందును మిక్కిలి నేర్పు గలవాఁడు. నేను నందకుల వినాశమునకుఁ బ్రతిజ్ఞగొన్న వెను వెంటనే యాతనిని క్షపణకవేషముతో కుసుమపురమునకు రప్పించి నందామాత్యు లందఱితోడను చెలిమిచేయించితిని. ప్రత్యేకముగ రాక్షసున కాతనిపై నెంతయో నమ్మకము కలిగినది. ఆతనివలన నిప్పుడు గొప్పప్రయోజనము నెఱవేర్పవలసి యున్నది.

ఇట్లు మేము చేయవలసిన పనులలో నొక్క విషయము నందును లోపములేదు; కాని ప్రధానప్రకృతి యగు వృషలుఁడే రాజ్యతంత్రభారము నంతయును మామీఁదనే వైచి తా నెప్పుడును నుదాసీనతను దాల్చియున్నాఁడు. అదికాదు; నిజ మాలోచించి నచో రాజకార్యములను స్వయముగా విచారించుకొనుటలోఁ గల యసాధారణదుఃఖములు తనకు సోఁకని యప్పుడే రాజ్యము రాజు నకు సుఖమును గలిగించుట. ఏల యన,

తే. సహజ బలసంపదల నెంత చాలియున్న,
నను భవింపంగఁ దమకుఁ దామయి కడంగి
తెచ్చికొనఁగా వలయు నేని నిచ్చ గుంది
గజపతులు భూమిపతులును గాసిగొనరె?

(అంతట యమపటముతోఁగూడ చారుఁడు ప్రవేశించును.)

చారుఁడు :— (గేయము)

యము ధర్మరాజుకు సెయ్యండి దండాలు
కను యింతలేక తొయ్యండి గండాలు ॥ యమ ॥

చిల్లర దేవుళ్ల కొలిస్తే నండీ
అల్లాడె జీవుణ్ణి కొల్లాడే నండీ ॥ యమ ॥

కత్తులబోనైన గడపొచ్చునండీ
బత్తితో సేవిస్తే బతకొచ్చునండీ ॥ యమ ॥

అందరిప్రాణాల హతమార్చి వాని
ముందరనే గొల్చి మందాముగాని ॥ యమ ॥

యీయింట్లోకి బొయ్యి యమపటాన్ని చూపించి పాటల్ను పాడ్తాను.

(పరిక్రమించును)

శిష్యు :—(చూచి) ఎవరయ్యా! లోపలికిఁ బోఁగూడదు.

చారు :—స్వామీ! యెవరిది యీయిల్లు?

శిష్యు :—మా గురువులు సుగృహీత నామధేయులు చాణక్యుల వారిది.

చారు :—(నవ్వి) అట్లనా స్వామీ? అయితే యిది నాకు ధర్మంలో సొంతం తోడబుట్టినవానియిల్లే అవుతుంది. పోనియ్యండి స్వామీ లోపలికి; మీ పంతులవారికి ధర్మాన్ని గురించి చెపుతాను.

శిష్యు :—(కోపముతో) ఏమీ! నీవు మా గురువులవారి కంటెను గూడఁ బెద్ద ధర్మవేత్తవా?

చారు :—అట్లనవాకండి స్వామీ; అందరికీ అన్నీ తెలిసివుండవు. మీ పంతులవారికి వొకటి తెలిసివుంటుంది; మావంటి వాండ్లకు యింకొకటి తెలిసివుంటుంది.

శిష్యు :—(కోపముతో) మూర్ఖుఁడా? మా గురువులవారి సర్వజ్ఞత్వ మును నీవు లాగుకొనఁ జూచుచున్నావా?

చారు :—అయితే స్వామీ, మీగురువులవారే అన్నీ తెలిసిన వాళ్లైతే చంద్రునిమీద అయిష్టం యెక్కడవుందో చూస్తాం గాని తెలుసుకోమనండి.

శిష్యు :—ఇది తెలిసినచో నేమి ప్రయోజనము?

చారు :—స్వామీ, దీన్ని తెలుసుకోవడంవల్ల ప్రయోజనం యేమో మీ పంతులుగారికే తెలుస్తుంది. నీకు దెలిసేది చంద్రుని మీద అయిష్టం తామరపూల దగ్గెర వుంటుందనే సంగతే. ఇదుగో చూడు!

(గేయము)

తళ తళా లాడేటి తామరాపూలలో
తలచి చూచితె గుణము సున్నా.
కళ నిండు చందురుని కాంతి వోరువలేక
కమిలి కమిలీపోవు రన్నా.

చాణ :—(విని తనలో) ఓహో! చంద్రగుప్తునిపై సపరక్తులగు జనుల నెఱింగితి నని యీతఁడు సూచించుచున్నాఁడు.

శిష్యు :—ఏమి యిది? సంబంధము లేనిమాటలను పలుకుచున్నావు?

చారు :—తెలుసుకునేవా డెవడైనా వినేదానికి దొరికితే నామాటలకు సంబంధం బాగానే వుంటుంది స్వామీ!

చాణ .—భద్రా! లోపలికి రమ్ము; వినువాఁడు లభించును.

చారు :—ఇదుగో వస్తున్నాను. (లోపలికివచ్చి సమీపించి) జయం జయం అయ్యగారికి.

చాణ ·—(చూచి తనలో) ఓహో! యితఁడు నిపుణుఁడు; ప్రకృతిజనుల చిత్తవృత్తులను గనిపట్టి తెలిసికొనుటకై మేము పంపినవాఁడు. (ప్రకాశము) భద్రా! కుశలమా? రమ్ము; కూర్చుండుము.

చారు —చిత్తం, చిత్తం; అట్లనే చేస్తాను. (నేలమీఁదఁ గూర్చుండును.)

చాణ :—భద్రా! యింక నీవు పోయివచ్చిన విషయమును గూర్చి వివరింపుము. ప్రకృతు లందఱును వృషలునియెడల ననురాగముతో నున్నారు గద?

చారు ·—సందేహ మేముంది? యిష్టం లేకుండా పోనడానికి వుండే కారణాలన్నిట్నీ, అయ్యగారు తొలిగించినారిక, నోటారా చెప్పుకోదగ్గ మహారాజు చంద్రగుప్తులుంగారి మీఁద వూళ్లో జనమంతా మాంచి అనురాగంతో వున్నారు కాని యీ పట్నం మొత్తంమీదా పూర్వం అమాత్యరాక్షసునితో

గూడా స్నేహంచేసి ఆయనమీద అభిమానంగావుండే ముగ్గురు మాత్రం మహారాజులుంగారి వైభవాన్ని వోర్చడం లేదు.

చాణ :—(కోపముతోఁ దనలో) తమ జీవితమునే యోర్చుట లేదన వలసియున్నది. (ప్రకాశము) పేరులేమో తెలియునా?

చారు :—పేర్లను తెలుసుకోకుండానే అయ్యగారి దగ్గర విన్నపం చేస్తానా?

చాణ :—అట్లయినచో వినఁగోరెదను.

చారు :—అయ్యగారు వినండి. పగవాళ్ల పక్క మిక్కిలీ పక్ష పాతంతో వుండేవాళ్లల్లో మొదటివాడు క్షపణకుడు.

చాణ :—(తనలో) క్షపణకుఁడు; మా శత్రువులపై మిక్కిలి పక్ష పాతము గలవాఁడు!

చారు :—జీవసిద్ధి అనేవాడు ఎవరంటే, అమాత్యరాక్షసుడు పంపు చేసిన ఆ విషప్పిల్లను పరవత మహారాజులుంగారికి అంటించి నాడే, ఆయన.

చాణ :—(తనలో) జీవసిద్ధి! ఇతఁడు మాప్రణిధియే. (ప్రకాశము) మఱి యింకొకఁడు?

చారు :—యింకొకాయిన అమాత్యరాక్షసునికి యెంతో ముఖ్య మైన స్నేహితుడు; లెక్కలు రాస్తుంటాడే ఆయన; శకట దాసు.

చాణ :—(తనలో) కాయస్థుఁ డెంతలే; ఒక లెక్కగాదు; అయి నను ఎంతసామాన్యుని గూడ పగవానిని ఉపేక్షించుట యుక్తముగాదు. కపటస్నేహముచేయించి సిద్ధార్థకుని వాని యొద్దనుంచియే యున్నాఁడను. (ప్రకాశము) భద్రా! మూఁడవ వానినిగూడ వినఁగోరెదను.

చారు :—మూడో ఆయిన అమాత్యరాక్షసునికి రెండోమనస్సు; పూలచౌకులో వుండే రత్నాలసెట్టి చందనదాసు అనేవాడు.

ఆయన యింట్లోనే అమాత్యరాక్షసుడు తనపెండ్లాన్ని వుంచి యీ వూర్నుంచీ పరారి అయినాడు.

చాణ :—(తనలో) నిశ్చయముగా నీతఁడు సుహృత్తముఁడై యుండును. తనకుఁ బ్రాణసమానుఁడు కానిచో రాక్షసుఁ డీతనియింటఁ దన కళత్రమును దాఁచిపోయి యుండఁడు. (ప్రకాశము) భద్రా! చందనదాసుని యింటిలో రాక్షసుఁడు తన యిల్లాలిని దాఁచియుంచినాఁ డని నీవెట్లు తెలిసికొంటివి?

చారు :—యిదుగో యీ మొహరుంగరం; యిదే అయ్యగారికి అంతా తెలుపుతుంది. (అని ముద్రిక నిచ్చును.)

చాణ :—(ఉంగరమును చూచి తీసికొని దానిపైనున్న రాక్షసుని పేరును చదివి సంతోషముతో తనలో) రాక్షసుఁడే నాచేతికి చిక్కినాఁ డన వలసియున్నది. (ప్రకాశము) భద్రా! యీ యుంగరము దొరకిన విషయమును సవిస్తరముగా వినఁగోరెదను.

చారు :—అయ్యగారు వినండి. వూళ్లోవాళ్ల నడవణ్ణి కనిపెట్టమని అయ్యగారు నాకు వుత్తరువు చేసినారుగదా. ఆతరువాత పరాయిండ్లల్లోకి పోవడంలో యెవరికీ యేమీ అనుమానం కలిగించకుండా వుండే యీ యమపటాన్ని తీసుకొని వూరంతా తిరుగుతూ తిరుగుతూ యివ్వాళ రత్నాలసెట్టి చందనదాసు యింటికి పోయి యమపటాన్ని పరిచి పాటలు పాడడానికి మొదలు పెట్టినాను.

చాణ :—తరువాత?

చారు :—తర్వాత వొక గదిలోనించి దాదాపు అయిదేండ్ల వయసులో వుండే వొక పిల్లవాడు – చూడడానికి అందంగా వున్నాడు – పిల్లతనానికి సాజంగావుండే వుత్సాహంతో కండ్లు యింతగా చేసుకొని బయటికి రాబోయినాడు. అంతట్లో అదే గదిలోనించీ 'అయ్యో బయిటికి పోయినాడు; అయ్యయ్యో బయిటికి పోయినాడు' అని యెంతో భయాన్ని తెలుపుతూ

ఆడవాళ్లు అరిచిన శబ్దం వినపడింది. ఆమీాద వొకామె వాకిట్లోకి కొంచెంగా అవుపడేటట్టు మొగాన్ని పెట్టి, యివతలికి వచ్చే వచ్చే ఆ పిల్లవాణ్ణి బెదిరించి, నవనవలాడుతూవుండే తనచేత్తో పట్టుకునింది. యిట్లా పిల్లవాణ్ణి పట్టుకునే తొందర్లో వేళ్లు వణుకుతూ వుండే ఆమె చేతులోనించీ మొగవాడివేలి కొలతలోవుండే యీా మొహరుంగరం జారి గడపమీాద బడి దొల్లుకుంటూ నా కాళ్ల దగ్గెరికివచ్చి కదలకుండా నిలిచింది. దీనిమీాద అమాత్యరాక్షసుని పేరు వుండడంవల్ల నేనూ దీన్ని అయ్యగారి పాదాలదగ్గెరికి చేర్చినాను. యిదీ యీా వుంగరం దొరికిన సమాచారం.

చాణ :—భద్రా! వింటిమి. ఇఁక నీవు పోవచ్చును. నీవు పడిన యీా ప్రయాసమునకు కొలఁదికాలములోనే తగిన బహుమానమును పొందుదువు.

చారు :—చిత్తం, సెలవు తీసుకుంటాను.

(నిష్క్రమించును.)

చాణ :—శార్ఙ్గరవా,

శిష్యుఁడు :—(ప్రవేశించి) ఆచార్యా, యేమి యాజ్ఞ ?

చాణ :—మసిబుడ్డిని పత్రమును తీసికొని రమ్ము.

శిష్య :—చిత్తము. (పోయి మరల లోనికివచ్చి) ఆచార్యా, యివిగో మసిబుడ్డియును, పత్రమును.

చాణ :—(తీసికొని తనలో) ఈ లేఖయం దేమి వ్రాయుదును ? దీని వలననే రాక్షసుని జయింపవలసియున్నది.

ప్రతీహారి :—(ప్రవేశించి) జయం జయం ఆర్యులవారికి.

చాణ :—(సంతోషముతోఁ దనలో) గ్రహించితిని జయశబ్దమును. (ప్రకాశము) శోణోత్తరా, యేమిపనికై వచ్చితివి ?

ప్రతీ :—ఆర్యా, మహారాజు చంద్రగుప్తులుంగారు తామరమొగ్గ మాదిరి జోడించిన చేతులను తలమీాద పెట్టుకొని ఆర్యుల

వారికి యిట్లు విన్నపం చేస్తూవున్నారు. యేమంటే, 'ఆర్యులవారి వుత్తరువు తీసుకొని పర్వతమహారాజుగారికి పరలోక క్రియలను చెయ్యడానికి తలుస్తూవున్నాను. ఆయన గారు పెట్టుకున్న సొమ్ములను గూడా బ్రాహ్మలకు దానం చేస్తాను!' అని.

చాణ:—(సంతోషముతోఁ దనలో) భళి! వృషలా, భళి!! నా హృదయముతోఁ గలిసి మాటలాడినట్లే చెప్పిపంపితివి. (ప్రకాశము) శోణోత్తరా! మా మాటగా వృషలునితో నిట్లు చెప్పుము. 'మేలు! వృషలా, మేలు! లోకవ్యవహారములను జక్కఁగా గ్రహించితివి. నీ యభిప్రాయము ప్రకారమే యాచరింపుము. ఒక్కమాట మాత్రము చెప్పెదను. పూర్వము పర్వతేశ్వరుఁడు ధరించిన యాభరణములు ఉత్తమము లైనవి. వానిని ఉత్తములగు వారికే దానముచేయుట యుక్తము. కాఁబట్టి నేనే స్వయముగాఁ బరీక్షించి యుత్తమ గుణములు గల బ్రాహ్మణులను బంపుదును' అని.

ప్రతీ:—చిత్తము. (నిష్క్రమించును.)

చాణ:—శార్ఙ్గరవా, విశ్వావసువు మొదలగు సోదరులు మువ్వురితోను మా మాటగా 'మీరు వృషలునియొద్ద నాభరణములను దానము తీసికొని తరువాత నన్నుఁ జూడవలసినది' అని చెప్పుము.

శిష్య:—చిత్తము; అట్లే చేయుదును. (నిష్క్రమించును.)

చాణ:—(తనలో) ఇది యీ యుత్తరమునకుఁ జివరి భాగము. మఱి మొదటిభాగము ఎట్లుండవలయును? (ఆలోచించి) ఔను; జ్ఞప్తికి వచ్చినది, ఆ మ్లేచ్ఛరాజు బలములలో మిక్కిలి ప్రధానులగు రాజు లైదుగురు కడుంగడు మైత్రితో రాక్షసుని ననువర్తించుచుందు రని గూఢచారులు తెలిపియుండిరి.

సీ. అల కులూతేశ్వరుం డగు చిత్రవర్మ, సింహపరాక్రముఁడు మలయాధినేత
సింహనాథుండు; కాశ్మీరాధిపుఁ డుదగ్ర భుజబలోద్దాముండు పుష్కరాక్షుఁ
డతులవిక్రమ పరాహత శాత్రవబలుండు సింధుభూపాలుండు సింధుషేణుఁ
డగణిత తురగబలాఢ్యుండు పారశీకాధినాథుఁడు మేఘుఁ డనఁగఁ బరగు

తే. వీర లేవురు రిపుసేనఁ జేరువడిన, వారు రాక్షసునకుఁ గూర్చువారు నంట
వ్రాసెదను వీరిపేరు లవశ్య మిపుడు, చిత్రగుప్తుండు తుడిచివైచెడును గాక.

(ఆలోచించి) కాదు; నేను వ్రాయకుందును. అంతయును నిగూఢముగనే యుండును గాక. (ప్రకాశము) శార్ఙరవా,

శిష్యు :—(ప్రవేశించి) ఆచార్యా, యేమి యాజ్ఞ?

చాణ :—'వత్సా, యెంత ప్రయత్నించి వ్రాసినను శ్రోత్రియాక్షరములు సుస్పష్టముగా నుండవు. అందువలన నీవు పోయి సిద్ధార్థకునితో (చెవిలో ఏమో చెప్పి) ఈ యక్షరములతో ఎవరో యొకరు పంపఁగా నెవరికో యొకనికి నేదో విషయమును గూర్చి తానై చెప్పవలసియున్న దని చెప్పి యొక లేఖను చిరునామా లేకుండ శకటదాసునిచేత వ్రాయించుకొని మా యొద్దకు రావలసినది. దీనిని వ్రాయించునది చాణక్యుఁ డని శకటదాసునకుఁ దెలియనీయరాదు' అని మా మాటగాఁ జెప్పుము.

శిష్యు :—చిత్తము. అట్లే చేయుదును. (నిష్క్రమించును.)

చాణ :—అబ్బా! గెలిచితిని మలయకేతువును.

సిద్ధార్థకుఁడు :—(చేతిలో జాబు పట్టుకొని ప్రవేశించి) జయం జయం ఆర్యులవారికి, ఇదుగో శకటదాసు స్వహస్తంతో వ్రాసిన ఆ వుత్తరం.

చాణ :—(చూచి) బలే! అక్షరము లెంత యందముగా నున్నవి! (చదువుకొని) భద్రా! యీ యుంగరముతో దీనిపై ముద్ర వేయుము.

సిద్ధా :—చిత్తం. అట్లనే చేస్తాను. (అని ముద్రవేయుచుండును.)

చాణ :—శార్ఙ్గరవా!

శిష్యు :—(ప్రవేశించి) ఆచార్యా! యేమి యాజ్ఞ?

చాణ :—నగర రక్షకాధికారి యగు కాలపాశికునితో మా మాటగా నిట్లు చెప్పుము. 'జీవసిద్ధి యని క్షపణకుఁడు గలఁడే! వీఁడు రాక్షసుని ప్రేరణచేత విషకన్య నంటించి పర్వతేశ్వరుని జంపినాఁడు. వీనిని ఈ దోషమునే బహిరంగముగాఁ జాటి యవమానపూర్వకముగా నగరమునుండి బహిష్కరింప వలసిన దని వృషలుని యాజ్ఞ' అని.

శిష్యు :—చిత్తము; అట్లే చేయుదును. (పరిక్రమించును.)

చాణ :—వత్సా! ఆఁగుము; మఱియొక మాటగూడఁ జెప్పుము. 'శకటదాసుఁ డను కాయస్థుఁడు మఱియొకఁడు గలఁడే. వాఁడు రాక్షస ప్రేరితుఁడై యెప్పుడును మా శరీరమునకు ద్రోహము చేయుటకై ప్రయత్నించుచున్నాఁడు. ఇదే యపరాధమును బహిరంగముగాఁ జేసి వానిని కొఱత వేయ వలసినది; వాని కుటుంబమును కారాగృహమున బంధింప వలసినది' అని.

శిష్యు :—చిత్తము. అట్లే చేయుదును. (నిష్క్రమించును.)

సిద్ధా :—ఆర్యా! యిదుగో యీ వుత్తరంమీద మొహరు వేసినాను. యింకా యేమి చెయ్యవాల్నో ఆజ్ఞాపించండి.

చాణ :—భద్రా! మిక్కిలి యాప్తజనము కావింపవలసిన యొక కార్యమును నీకు అప్పగింపఁ దలఁచితిమి.

సిద్ధా :—అంతా ఆర్యులవారి అనుగ్రహం; యీ దాసుణ్ణివల్ల ఆర్యులవారికి యేమి పని కావాల్నో ఆజ్ఞాపించండి.

చాణ :—భద్రా! నీవు మొట్టమొదట వధ్యస్థానమునకుఁ బోయి కత్తిని జళిపించుచు కోపమును జూపించి యచట నున్న ఘాతుకులు బెదరిపోవునట్లు సంజ్ఞ చేయుము. వారును ఆ

సంకేతమును గ్రహించి బెదరినట్లు నలువైపులను బరువెత్తిపోయిన వెంటనే నీవు శకటదాసును వధ్యస్థానమునుండి తొలఁగఁదీసికొనిపోయి రాక్షసుని యొద్దకుఁ జేర్పుము. తన మిత్రుని ప్రాణమును గాపాడినందులకు సంతోషించి రాక్షసుఁ డిచ్చు బహుమానమును గ్రహింపుము. పిమ్మటఁ గొంత కాల మాతనియొద్దనే కొలువుసేయుము. తరువాతఁ బగతురు మనకు దాపుదాపునకు వచ్చిన వెంటనే నీవు ఈ ప్రయోజనమును నెఱవేర్పుము. (చెవిలో చెప్పును.)

సిద్ధా :—చిత్తం. ఆర్యులవారి వుత్తరువు.

చాణ :—(ఆలోచనమును నటించుచుఁ దనలో) ఆ దురాత్ముఁడు రాక్షసుఁడు మాకుఁ జిక్కువడునా ?

సిద్ధా :—తప్పకుండా.

చాణ :—(సంతోషముతోఁ దనలో) అబ్బ! తప్పకుండ రాక్షసుఁడు మాకుఁ జిక్కువడునఁట! (ప్రకాశము) భద్రా.! యే మది ?

సిద్ధా :—ఆర్యా! తప్పకుండా ఆర్యులవారి వుత్తరువును నెరవేరుస్తాను. యింక నాకు సెలవు దయచెయ్యండి.

చాణ :—(ఉంగరముతోఁ గూడ నుత్తరము నిచ్చి) భద్రా! పోయి రమ్ము. నీకుఁ గార్యసిద్ధి యగుఁగాక.

సిద్ధా :—చిత్తం. (నిష్క్రమించును.)

శిష్య :—(ప్రవేశించి) ఆచార్యా! నగర రక్షకాధికారియగు కాలపాశికుఁడు 'ఇదిగో మహారాజు చంద్రగుప్తులవారి యాజ్ఞను నిప్పుడే, నెఱవేర్చెద' నని తమతో మనవిచేయుచున్నాఁడు.

చాణ :—మంచిది; వత్సా! మణికారశ్రేష్ఠి యగు చందనదాసుని మే మిప్పుడు చూడవలసి యున్నది.

శిష్య :—ఆచార్యులయాజ్ఞ. (అని పోయి చందనదాసునితోఁ గూడ మరలఁ బ్రవేశించి) సెట్టిగారూ! యిటు, ఇటు.

చందనదాసుఁడు :—(తనలో)

తే. కరుణలేని చాణక్యుఁ డాకస్మికముగఁ
బూని పిలిపింప నేర మింతైన లేని
వానికేనియు గుండెలు వగులు; నింకఁ
ద ప్పొనర్చిన నామాట చెప్ప నేల?

అందువలననే మా వీథిలో నున్న ధనసేనాదు లగు వర్తకులు మువ్వురతోడను 'దురాత్ముఁ డగు చాణక్యుఁ డేనాఁడైనను మాయింటిని వెదకించును; కాఁబట్టి మీరు జాగరూకులై మన యజమానులగు నమాత్య రాక్షసులవారి కుటుంబమును అటనుండి తొలఁగింపుఁడు. నాకా? యేమి కావలసియున్నదో యది యగుఁగాక.' అని చెప్పి వచ్చితిని.

శిష్యు :—సెట్టిగారూ! ఇటు, ఇటు.

చందన : —ఇదిగో, వచ్చుచున్నాఁడను.

(ఇరువురును ముందునకు నడతురు.)

శిష్యు :—ఆచార్యా! యీతఁడే మణికారశ్రేష్ఠి చందనదాసుఁడు వచ్చియున్నాఁడు.

చందన:—(సమీపించి) జయము జయ మార్యులవారికి.

చాణ :—(చూచుట నభినయించి) సెట్టిగారూ! క్షేమమా? రండు; ఇదిగో ఈ యాసనముపైఁ గూర్చుండుఁడు.

చందన:—(నమస్కరించి) ఆర్యా! అనుచితమగు నుపచార మాత్మజ్ఞుఁ డగువానికి నవమానమునకంటెను మిక్కిలి సంతాపమును గలిగించు ననుట తా మెఱుఁగనిది గాదుగదా! అందువలన నేను ఇచటనే నా యోగ్యతకుఁ దగిన నేలమీఁదఁ గూర్చుండెదను.

చాణ:—సెట్టిగారూ! అట్లుగాదు; మావంటివారిచేత నీ గౌరవము మీకు నుచితమైనదియే. కావున నాసనముమీఁదనే కూర్చుండుఁడు.

చందన :—(తనలో) ఈ దురాత్ముఁడు దేనినో సూచనగా నెత్తి విడుచుచున్నాఁడు.

(ప్రకాశము) చిత్తము ; తమ యాజ్ఞానుసారమే చేయుదును. (కూర్చుండును.)

చాణ:—సెట్టిగారూ! మీకు బేరసారములలో వడ్డీలును, లాభము లును సమృద్ధిగనే సాగుచున్నవా?

చందన:—(తనలో) అత్యాదరము శంకాస్పదము. (ప్రకాశము) చిత్తము ; ఆర్యుల యనుగ్రహమువలన మా వ్యాపారము లేలోటుంతయును లేకుండ సాగుచున్నవి.

చాణ:—సెట్టిగారూ! చంద్రగుప్తుని దోషము లెప్పుడైనను బౌరులకుఁ బూర్వపురాజుల గుణములను జ్ఞప్తికిఁ దెచ్చు చుండునా?

చందన:—(చెవులు మూసికొని) పాపము శమించుఁగాక. శరద్రాత్రి నుదయించిన పున్నమచంద్రునితో వలెఁ జంద్రగుప్త మహా రాజుగారితోఁ బౌరు లందఱును బరమానందము నందు చున్నారు.

చాణ:—సెట్టిగారూ! అట్లైనచో సంతోషించిన ప్రకృతులనుండి ప్రభువు లోకప్పుడు ప్రతిఫలమును గోరుదురు.

చందన:—ఆర్యులవా రాజ్ఞాపింపవలయును ; ఎంత మొత్తము ధన మీ జనునివలన రాఁగోరెదరో; సిద్ధముగా నున్నాఁడను.

చాణ:—సాహుకారీ! చంద్రగుప్తుని రాజ్యముగాని యిది నందుని రాజ్యము గాదు. ధనముమీఁది రుచిని మరగిన నందునకు ధనము నిచ్చిననే సంతోషము కలుగుచుండెడిది. మఱి చంద్రగుప్తున కన్ననో మీ కెట్టి పరిక్లేశమును గలుగ కుండుటయే చాలును.

చందన:—(సంతోషముతో) ఆర్యులవారి యనుగ్రహముచే ధన్యుఁడ నైతిని.

చాణ:—సాహుకారీ! ఆ విధముగా మీకు నెట్టి పరిక్లేశమును గలుగకుండుటకు మార్గ మేమో యడుగ రేమి?

చందన:—ఆర్యులవారు సెలవీయవలయును.

చాణ :—సంక్షేపముగాఁ జెప్పవలయు నన్నచోఁ దమ నడవడిలో రాజునెడల విరుద్ధము లగు పనులను మానుకొనవలయును.

చందన :—ఆర్యా! యెవఁ డా యభాగ్యుఁడు? రాజుతోఁ బగఁ బూనినట్లు తమకుఁ దెలియవచ్చినవాఁడు?

చాణ :—నీవే మొట్టమొదటివాఁడవు.

చందన :—(చెవులు మూసికొని) పాపము శమించుఁగాక. గడ్డిపోఁచలకుఁ గాఱుచిచ్చుతో విరోధ మెట్లుండును?

చాణ :—ఎట్లుండునా? ఇదిగో ఇట్లు; నీవు రాజద్రోహియగు రాక్షసుని గృహజనమును నీ యింటిలోఁ గాపాడుచున్నావు.

చందన :—ఆర్యా! అసత్య మిది; ఎవఁడో యనార్యుఁడు తమ కిట్లు నివేదించినాఁడు.

చాణ :—సాహుకారీ! భయపడకుము. పూర్వపురాజుల యుద్యోగులు భయపడి పాఱిపోవునప్పుడు ప్రజ లిష్టపడకపోయినను దమ కుటుంబములను వారి యిండ్లలో దిగవిడిచి పోవుదురు. దాని కేమిగాని యా కుటుంబములను దాఁచిపెట్టుట మాత్రము నేర మగును.

చందన :—ఇది నిజమే; ఆ కల్లోలములో నమాత్యరాక్షసుని కుటుంబము మా యింటిలో నుండినది.

చాణ :—మొదట 'అసత్యము' అంటివి; ఇప్పుడు 'ఉండినది' అనుచున్నావు; ఈ మాటలు రెండును పరస్పర విరుద్ధములుగా నున్నవి.

చందన :—ఆర్యా, నేను మఱియొక రీతిగాఁ దలఁచి పొరపడితిని.

చాణ :—సాహుకారీ! చంద్రగుప్తుఁడు రాజుగా నుండఁగా నిట్టి పొరపాటులకుఁ దావు లేదు. కావున నప్పగింపుము రాక్షసుని కుటుంబమును; నీకును పొరపాటు లేకుండును.

చందన :—ఆర్యా! విన్నవించుచున్నాను గదా 'ఆ కల్లోలములో అమాత్యరాక్షసుని కుటుంబము మా యింటిలో నుండినది' యని.

చాణ :—అయిన నిప్పు డెక్కడికిఁ బోయినది?

చందన :—నాకుఁ దెలియదు.

చాణ :—(చిఱునవ్వు నవ్వి) ఏమీ? నీకుఁ దెలియదు గదా? సాహుకారీ! భయము నెత్తిని, ప్రతికారము దూరమునను—ఉండనిమ్ము; మఱియొక మాట. నందుని విష్ణుగుప్తుఁడువలె (అని సగముమాటలో లజ్జను నటించి) చంద్రగుప్తుని గూడ నమాత్యరాక్షసుఁ డున్మూలింపఁగలఁ డని యెన్నఁటికిని దలంపకుము. ఇట్లు చూడుము:

సీ. విక్రమంబున నీతి విభవంబునను బార మూఁదిన వక్రనాసాదులైన
మంత్రీంద్రు లెల్ల, నెమ్మది సాన్వయంబుగా నందుండు మనియున్న నాఁడె, మాటి
మాటాడుచోఁ గుదురొందించి నిలుపంగ నోఁపని సిరి యిప్పు డుజ్జ్వలముగ
ననఁగి పెనఁగి వే ఱనరాక జగమెల్ల నానందమున నోల లార్చుచుండఁ

ఆ. జంద్రునుండి కాంతిచందాన నెవ్వాఁడు చంద్రగుప్తరాజచంద్రునుండి
ద్దాని వేఱుసేయఁగా నేర్చు? మఱి మూల ఫలము గలదె? యంత లలముఁగాక.

అదిగాక,

ఉ. కుంజర యూథశోణితముఁ గ్రోలుటఁ గెంపులువాఱి సాంధ్య రు
గ్రంజిత చంద్రరేఖ యనఁగాఁ బరిజృంభిత విస్తృతాస్యమా
కుంజరవైరినోట మెఱుగుల్ దులకించెడు కోఱపైఁ బెక
ల్పం జేయిసాఁప నెంచెడు నెవండు? తృణీకృత తత్ప్రభావుఁడై.

చందన :—(తనలో) ఫలము కలిసివచ్చుటచేత నీతని యాత్మస్తుతి తగియే యున్నది.

(తెరలోఁ గలకలము)

చాణ :—శార్ఙ్గరవా! యిదియేమో తెలిసికొనుము.

శిష్య :—చిత్తము; అట్లే చేయుదును. (పోయి తిరిగివచ్చి) ఆచార్యా! వీరుగో రాజపురుషులు రాజద్రోహి యగు క్షపణకుఁడు జీవసిద్ధిని మహారాజ చంద్రగుప్తుల యాజ్ఞచే నవమాన పూర్వకముగా నూరు వెడలఁ గొట్టుచున్నారు.

చాణ :—పాపము! క్షపణకుఁడా? సరియే. రాజునకు సరిపడని పని నొనరించిన దానికి ఫలము ననుభవించునుగాక. ఓయీ! సాహుకారీ! యిట్లు విద్రోహులను రాజు తీక్ష్ణముగ దండించుచున్నాఁడు. కావున నీకు క్షేమకర మగు నీ యాప్తుని వాక్యము నాచరింపుము; చిత్రవిచిత్రమగు రాజానుగ్రహమును జిరకాల మనుభవింపుము.

చందన :—ఆర్యా! యమాత్య రాక్షసుని కుటుంబము మాయింటిలో లేదు.

(తెరలో మఱలఁ గలకలము)

చాణ :—శార్ఙ్గరవా! మఱల నీ కలకల మేమో తెలిసికొనుము.

శిష్యు :—చిత్తము. (పోయి తిరిగివచ్చి) ఆచార్యా! యీతఁడును రాజద్రోహియే. శకటదాసుఁ డను కాయస్థుఁడు. వీనిని రాజభటులు కొఱత వేయుటకుఁ గొనిపోవుచున్నారు.

చాణ :—చేతులారఁ జేసిన దానికి ఫలము ననుభవించును గాక. ఓయీ! సాహుకారీ! రాజద్రోహుల నిట్లు తీక్ష్ణముగా దండించు నట్టిరాజు నీవు రాక్షసుని కుటుంబమును దాఁచి యుంచుటను సహింపఁడు. కావున నితరుని యిల్లాలి నప్పగించి నీ యిల్లాలిని, ప్రాణమును గూడఁ గాపాడుకొనుము.

చందన :—ఆర్యా! న న్నేమి భయపెట్టెదరా? నాయింట నుండి యున్నను నమాత్య రాక్షసుని కుటుంబమును మీ కప్పగింపనే, మఱి లేనిదాని నెట్లప్పగింతును?

చాణ :—ఇదియే నీ నిశ్చయమా?

చందన :—ముమ్మాటికి; ఇదియే నా దృఢనిశ్చయము.

చాణ :—(తనలో) బళీ! చందనదాసా! భళీ!

ఆ. పర సమర్పణమున బహు సులభంబులై
కొదవ లేని సిరులు గురియుచుండ
నిట్టి దుష్కరంబు నీనాఁడు సేయంగఁ
గలఁ డెవండు? శిబి యొకండు దక్క.

(ప్రకాశముగ కోపముతో) దురాత్ముఁడా! దుష్టవర్తకుఁడా! అనుభవింపు మట్టిన రాజాగ్రహమును.

చందన :—(రెండు చేతులను జాఁచి) సిద్ధముగా నున్నాఁడను. తమ యధికారమునకుఁ దగినంత పనిని జేయుఁడు.

చాణ :—శార్ఙ్గరవా! నగర రక్షకాధికారి యగు కాలపాశికునితో మా మాటగా నిట్లు చెప్పుము. 'తత్క్షణమే యీ పాడు కోమటివానిని—కాదు; ఆఁగుము: దుర్గపాలుఁ డగు విజయపాలునితోఁ జెప్పుము. 'వీని యింటఁ గల సర్వస్వమును గొల్ల గొట్టి యాలుబిడ్డలతోఁ గూడ వీనిని బంధించి కారాగృహమున నుంచుము. మే మీ విషయమును వృషలునకుఁ దెలుపువఱకును వీఁడు నిర్బంధములో నుండును గాక. వృషలుఁడే వీనికి మరణదండనము విధించును' అని.

శిష్యు :—చిత్తము; అట్లే చేయుదును. రా, సాహుకారీ! యిటు రా.

చందన :—(లేచి) అయ్యా! యిదిగో వచ్చుచున్నాఁడను. (తనలో) ఏమి నా యదృష్టము! నాకు మరణము పురుషదోషమునఁ గాక మిత్రకార్యమునఁ గలుగ నున్నది. (పరిక్రమించి శిష్యునితోఁ గూడ నిష్క్రమించును.)

చాణ :—(సంతోషముతో) అబ్బ! యిప్పుడు చిక్కినాఁడు రాక్షసుఁడు. ఏల యనఁగా,

తే. అతని కాపద గల్గిన యప్పు డీతఁ
డప్రియమువోలె నెటు ప్రాణ మాసగొనెఁడో
యట్టు లీతని కాపద యయ్యె నేని
యతనికిని బ్రాణములు హాలహలము గావె?

(తెరలోఁ గలకలము)

శిష్యు :—(ససంభ్రమముగాఁ బ్రవేశించి) ఆచార్యా! యిదిగో కొఱత వేయుటకుఁ దీసికొనిపోయిన శకటదాసును సిద్ధార్థకుఁడు వధ్యస్థానమునుండి తప్పించుకొని పాఱిపోయినాఁడు.

చాణ :—(తనలో) బళీ! సిద్ధార్థకా! బళి! చక్కఁగాఁ బని నారంభించితివి. (ప్రకాశము - కోపముతో) ఏమీ! పాఱిపోయినాఁడా? వత్సా! 'తత్క్షణమే వీని నెఱుఁగుకొని తగిన పనిని జేయవలసిన' దని మామాటగా భాగురాయణునితోఁ జెప్పుము.

శిష్యు :—(పోయి మరలివచ్చి) అయ్యయ్యో! భాగురాయణుఁడు గూడఁ బాఱిపోయినాఁడు.

చాణ :—(తనలో) పోనిమ్ము; కార్యమును సాధించునుగాక. (ప్రకాశము-కోపముతో) వత్సా! భద్రభట, పురుషదత్త, డింగురాత, బలగుప్త, రాజసేన విజయవర్మలతో 'వెనువెంటనే తఱుముకొనిపోయి వీరి నిద్దఱను బట్టుకొనుఁ' డని మామాటగాఁ జెప్పుము.

శిష్యు :—చిత్తము. (పోయి తిరిగి వచ్చి విషాదముతో) అయ్యయ్యో! యింకే మున్నది? రాజ్యాంగ మంతయును రాళ్లపాలై పోయినది! భద్రభటుఁడు మొదలగు వా రందఱును వీరి కన్న ముందే తెల్లవాఱకమునుపే పాఱిపోయినారు.

చాణ:—(తనలో) అందఱి మార్గములును శుభప్రదము లగుఁగాక. (ప్రకాశము) వత్సా! విషాదము నందకుము. ఇట్లు చూడుము:

ఉ. పోయినవార లేమొ తెలపోసి మదిన్, మును మున్న పోవనే
పోయిరి; యున్నవారలును బోవఁగ నిమ్ము యథేచ్ఛ: సైన్యముల్
వేయిటిపట్టు నంద కబళీకరణ స్ఫుట దృష్ట శక్తి నన్
బాయక నిల్చుఁ గాత మెదఁ బ్రజ్ఞ యొకం డఖిలార్థసిద్ధికన్.

(లేచి) ఇదే దురాత్ము లగు భద్ర భటాదులను బట్టి తెచ్చెదఁ గాక. (ప్రత్యక్షమునవలె నాకాశముపైఁ జూపు సారించి తనలో) దురాత్ముఁడా! రాక్షసుఁడా! యింక నెక్కడఁ బోయెదవు? ఇదిగో నేను గొలఁదికాలములోనే,

మ. సముదగ్రం బగు దానశక్తి యడరన్ స్వచ్ఛందవృత్తిన్ బలో
గ్రమదోత్సేకిత నొంటి నెయ్యెడఁ జొరంగాఁ బాలు నిన్నున్ వనే
భమునట్టుల్ నిపుణాస్మదీయమతి నిర్బంధించి స్వాధీనతన్
గమియింపన్ దమియించి మౌర్యునకుఁ గార్యంబుల న్నిల్పుదున్.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.

---

# ద్వితీయాంకము

(పాములవాఁడు ప్రవేశించును)

పాములవాఁడు :— (గేయము)

తంతరాలు నడిపించగా, తెలుసుకోని
మంతరాలనూ దాచగా
వుండాలిసినచోటులా తెలుసుకోని
మండలాలనూ నిలపగా
యేషూ త్తరము కొరత
యెరగాని తెలివుంటె
పామూల రాజుల
పనులల్లా నిలిచేరు ॥ ॥ తంతరాలు ॥

(ఆకాశము వైపు విని) ఆఁ యేంది సామీ; యేమంటారు, యెవురు నీవనా? పాములోణ్ణి సామీ, పాములోణ్ణి. నా పేరు జిన్న యిసు డంటారు. (మరల పైకి విని) నేంగూడా పాములో ఆడటానికి కోరుతానంటారా సామీ! అయితే పాములోళ్లు యేం కొలువులో వున్నారో (విని) యేందీ రాజులోళ్ల నగళ్లల్లో కొలువుండారూ, అయితే పాములోనే ఆడతా వుండారే సామీ! తమురు. యెందు కంటానంటె, మందులూ మంత్రాలూ తెలేని పాములోడూ, కైపుతో యేనిగ నెక్కే మావటోడూ, పట్టిన పనంతా నిరవేర డంతో పేరుపొందిన నగళ్లల్లో జీతగాడూ వీళ్లు ముగ్గురూ నాశినమై పొయ్యే వాండ్లే నని పెద్దోండ్లంటారు. అరే చూస్తూ వుండంగానే యీన దాటిపోయినాడే! (మరల పైకివిని) తమురేంది సామీ అనేదీ? ఆ పెట్టెల్లో యేముండాదనా? నాకు బతుకుదెరువు సూపిచ్చే పాములు సామీ. ఝేంద సూపిచ్చమంటారా! ఛమించాలె సామీ, ఛమించాలె. సూపిచ్చే దానికి తగినసోటుగాదు సామీ యిది. సూడాల్నని కోరిగ్గా వుంటే ఇదుగో యీ యింటికాడికి రాండి సామీ చూపిస్తాను. (విని) యిది అమాచ్చ రాచ్చసుల యిల్లు,

మావంటోళ్లు రావడానికి యీళ్లేదంటారా సామీ ; అయితే పోండి సామీ తమురు. నేనుమాత్తరం నా బతుకుదెరువు దయతో నిరబ్యెంతరంగా పోతాను. వోహో ! యీనగూడ దాటిపోయినాఁడు (దిక్కులుచూచి తనలో) ఆహా! యేమి యాశ్చర్యముగా నున్నది. చాణక్య మతి పరిగృహీతుఁడగు చంద్రగుప్తుని చూచినప్పుడు రాక్షసుఁడు చేయు ప్రయత్నమంతయు నిరర్థక మనిపించును. రాక్షస మతి పరిగృహీతుఁ డగు మలయకేతుని జూతును గదా చంద్రగుప్తునకు రాజ్య మూడిపోయె ననిపించును ;

మ. అల కౌటిల్యునిబుద్ధివైభవము త్రాడై చుట్టి బంధింప ని
శ్చల యయ్యెన్ సిరి మౌర్యుపాల ననుచున్ స్వాంతంబునం దోఁచు; నిం
దుల కేతేర నుపాయహస్తములఁ దోడ్తో రాక్షసామాత్యుఁ డీ
వలకున్ బిట్టుగ లాగినన్ గలఁగుభావంబున్ విలోకించెదన్.

అందుచే, గడుంగడు నీతిశాలులగు నీ యిరువురు మంత్రులకునూ గలిగిన యీ విరోధములో రాజ్యలక్ష్మి యెటు పోవుదునా యని సంశయపడుచున్న ట్లున్నది.

తే. ఉగ్రగతిఁ బోరు నీ సచివోత్తములకు
నడుమ సిరి రాకపోకల నలఁగుఁజూవె
బెదరి కుదురని మది వనమదగజముల
నడుమ నురియాడు నేనుంగుపిడియుఁబోలె.

ఇంక నే నమాత్య రాక్షసులను దర్శింతును గాక. (ముందునకు నడచి వాకిట నిలుచును)

(అంతటఁ దనయింట నాసనస్థుఁడై చింతతోనున్న రాక్షసుఁడును, వెంట నొక సేవకుఁడును ప్రవేశింతురు)

రాక్ష :—(కన్నీటితో) అక్కటా ! యెంతటి కష్టము !

మ. నయ విక్రాంతి గుణంబులన్ బగతురన్ మట్టాడు మాదేవు స
న్వయ మెల్లన్ యదువంశమ ట్లదయు దైవం బేఁచి కూలార్ప, నెం
తయు వంతన్ మదిఁ గంది రేఁబవలుఁ గంటన్ గూర్కులే కే నిటుల్
బ్రయతింతున్; దుదిఁ జిత్రకర్మ మది యెల్లన్ భిత్తిశూన్యం బగున్

అట్లనరాదు. ఏల యన ;

మ. మఱవన్ లే దెద భక్తి; భోగకలనన్ మత్తిల్ల లే దింతయున్;
వెఱవన్ లే దసునాశ మంచు; యశమేనిం గోరలే; దీక్రియన్
బరదాస్యంబునఁ గొగ్గి నీతిని మదిన్ బాటింతు నేర్పొప్పఁగా,
సుర లోకంబున నున్న శత్రుహతి నీకున్ గొల్తుఁగా కన్మతిన్.

(ఆకాశమువైపు చూచుచు) అమ్మా! సామ్రాజ్యలక్ష్మీ! నీ పరిజ్ఞానమును బొత్తిగాఁ గోలుపోయితివి. ఏల యన.

ఉ. నంద నృపాలచంద్రుఁడు మనంబునకున్ బ్రమదంబుఁ గూర్చినన్
డిందుగఁ ద్రోసి, మౌర్యుని గడిందిగఁ దద్రిపు నంటుకొంట కే
మందువు హేతువున్? జపలురాల! నశింప వదేల? మత్తనా
గేంద్రునితో నణంగి నశియించెడు నమ్మదధారపోలికన్.

అదిగాక, జాతిమాలినదానా!

చ. ధరణిఁ గులీనులైన వసుధావరు లెల్లను గాలిపోయిరే
మరగితి పాపినీ! కులము మాలినపాపు నెటుల్ మురాత్మజున్
వరునిఁగ; జెల్లుపూలతుదవంటిది నిల్కడ గాన దెన్నఁడున్
దరుణులబుద్ధి పూరుషగుణగ్రహణం బొనరింప నేర్చునే?

కానిమ్ము; దుర్వినీతురాలా! నేను నీ యాశ్రయమునే సమూలముగాఁ బెకలించి నీ కోరికను కూలార్చెదఁగాక. (యోచించి) నే నూరు వెడలునప్పుడు మా కుటుంబమును ప్రియమిత్రుఁడగు చందనదాసు నింట నుంచి వచ్చుటలో మిక్కిలి యుచితమగు పని చేసితిని. ఏల యన? నే నట్లు మా కుటుంబము నచటనే యుంచి వచ్చుటచేతఁ గుసుమపురముపై దండెత్తి వచ్చువిషయమున రాక్షసుఁ డౌదాసీన్యము వహింపఁ డని స్పష్టమగును. అందువలన నచటనుండి మాతోఁగూడ నేక కార్యాసక్తులగు స్వామి పాదోపజీవుల యుద్యోమము సడలుపోకుండును. చంద్రగుప్తుని రూపుమాపుటకొఱకు మేము పనిచిన ఘాతుకులును, విషప్రయోక్తలును మొదలగువారిని జేపట్టి యుండుటకును, శత్రుపక్షమున నపరక్తులగువారిని భేదించి

మా పక్షమునకు ఆకర్షించుటకును గొప్ప భాండారముతో శకట దాసుని నచటనే యుంచి యున్నాఁడను. ఎప్పటి కప్పుడు శత్రు వృత్తాంతములను సంగ్రహించుటకును, పగతురలో నైకమత్యమును పాడుచేయుటకును జీవసిద్ధి ప్రభృతులగు మిత్రులను బనిఁబూనునట్లు గావించితిని. వేయేల ?

చ. తనయు లటన్నఁ బ్రాణముపదంబుగఁ గూరిమి నూఁపు దేవుఁ డె
వ్వని బులిపిల్ల నాఁ బెనిచి వంశముతోడ నశించె, నట్టి పా
పునియెడఁ దీక్ష్ణబుద్ధి శరముం గొని యే నిదె వ్రయ్యలింతు, దు
ష్టనియతి యోర్మిమాలి కవచం బయి వ్రేల్మిడిఁ గావకుండినన్.

(అంతటఁ గంచుకి ప్రవేశించును)

కంచుకి :—

శా. నందున్ గూల్చి క్రమక్రమంబుగఁ బురిన్ మౌర్యుం బ్రతిష్ఠించు న
న్నందోన్మూలను నీతివోలె జరయున్ గామంబు మాయించి నా
యందున్ ధర్మువు నిల్పె; గాసిలుఁ దదుద్యత్ స్ఫూర్తి లోభంబు గ
ల్వం దా రాక్షసురీతి సందుగని సేవన్; జాల దొక్కెంతయున్.

(పరిక్రమించి) ఈతఁడే యమాత్య రాక్షసుఁడు.
(సమీపించి) అమాత్యునకు శుభమగుఁగాక.

రాక్ష :—ఆర్యా! నమస్కారములు. ప్రియంవదకా! వారికి పీఠము.

సేవకు :—అయ్యా! యిదిగో పీఠము; కూర్చొనండి.

కంచు :—(కూరుచుండి) అమాత్యా! కుమారుఁడు మలయకేతువు మీ కిట్లు విన్నవించు చున్నాఁడు. ఏమనఁగా, 'అమాత్యుల వారు చిరకాలమునుండియును సముచిత మగు శరీర సంస్కారమును వదలియుండుట నా హృదయమునకు మిక్కిలి సంతాపమును గలిగించుచున్నది. తమకు ఏలినవారి గుణములు మఱవరానివియే యైనను నా విన్నపమును గూడ మన్నింపవలసినది.' (ఆభరణమును జూపించి) అమాత్యా!

యీ మాటలతోఁ గుమారుఁ డీయాభరణమును దన శరీరముమీఁదినుండి తివిచి యిచ్చి పంపినాఁడు. తాము ధరింతురు గాక.

రాక్ష :—ఆర్యా! కుమారునితో మామాటగా నిట్లు విన్నవింపుము. 'మీ గుణములమీఁది పక్షపాతముచే మా యేలినవారి గుణములను మఱచియే పోయితిని; కాని

ఉ. వైరుల నెల్ల మాపి జయవంతుఁడవై తనరారు నీరు బం
గారపు సింహపీఠిక సుగాంగమునన్ నెలకొల్పుదాఁకఁ, దే
జోరహితంబులై పగఱు నూడిన దిక్కృతి గ్రమ్మి మేనికిన్
భారములైన యంగములపైఁగయి సేఁత ధరింప నింతయుఁగా.

కంచుకి :—అమాత్యుని నాయకత్వమునఁ గుమారున కిది యంతయును నవలీలగా లభించునదియే కాని వేఱు గాదు. కావునఁ గుమారుఁడు కోరిన యీ తొలికోరికను సమ్మానింతురుగాక.

రాక్ష :—ఆర్యా! కుమారుని మాటవలెనే మీ మాటయును జవదాఁటరానిది. కావున నిదిగో కుమారుని యానతి నొనరించెదను.

కంచు :—(అలంకరించి) శుభమగుగాఁక. నేను పోయివచ్చెదను.

రాక్ష :—ఆర్యా! నమస్కారము.

(కంచుకి నిష్క్రమించును)

రాక్ష :—ప్రియంవదకా! ఎవరైనను మమ్ముఁ జూచుటకై వచ్చి వాకిటియొద్ద నున్నారేమో తెలిసికొనుము.

ప్రియం :—చిత్తము (ముందునకు నడచి పాములవానిని జూచి) అయ్యా! యెవరు నీవు?

పాము :—నేనా అండి, నేను జిన్న యిసు డనే పాములవాణ్ణండీ. అమాచ్చ రాచ్చసులవారిదగ్గిర పాము ల్నాడిస్తా మని వచ్చినానండి.

ప్రియం :—యిక్కడనే వుండు. అమాత్యులవారికి విన్నవిస్తాను. (రాక్షసుని సమీపించి) ఆర్యా! యిక్కడ వొక పాములవాడు వచ్చివున్నాడు. అమాత్యులవారి ముందర పాముల నాడించ డానికి కోరుతూ వున్నాడు.

రాక్ష :—(ఎడమకన్నదరుటను సూచించి తనలో) ఏమీ! సర్పదర్శనమా? (ప్రకాశము) ప్రియంవదకా! మాకుఁ బాముల యాటమీఁదఁ గుతూహలము లేదు; అతని కేమైనను బారితోషిక మిచ్చి పంపివేయుము.

ప్రియం :—చిత్తము. అట్లనే చేస్తాను. (పాములవానిని సమీపించి) అయ్యా! అమాత్యులవారు నీకు దర్శనమైనానిక వచ్చే ఫలాన్ని మాత్రం దయచేసినారు; గాని దర్శనాన్ని దయ చెయ్యలేదు.

పాము :—అయ్యా! నేను పాము ల్నాడించుకొని బతికేవాణ్ణి మాత్రమే కాదు. మంచి గేయాల్ను రాసే కయీశ్వరుణ్ణి. కాబట్టి నాకు దరిశనం దయచేసేదానికి అంతగా యీల్లేక పోతే మంత్రులుంగారు యీ వుత్తరాన్నైనా దయవుంచి చదవాల్సిందని యిన్నపిస్తున్నాను. యీ నా యిన్నపాన్ని మంత్రులుంగారికి తెలపండి.

ప్రియం :—(పత్రమును గ్రహించి రాక్షసునొద్దకు వచ్చి) ఆర్యా! యీ పాములవాఁడు విన్నవిస్తున్నాఁడు గదా, నేను పాము ల్నాడించుకొని బతికేవాణ్ణి మాత్రమే కాదు. మంచి గేయాలు రాసే కవీశ్వరుణ్ణి. కాబట్టి నాకు దరిశనం దయ చేసేదానికి అంతగా వీల్లేకపోతే మంత్రులుంగారు దయవుంచి యీ పత్రాన్నైనా చదవాల్సింది అని (పత్రము నిచ్చును)

రాక్ష :—(పత్రమును తీసికొని చదువును)

(గేయము)

పూలలో తిరిగేవు తుమ్మెదా, నీవు
చాల నేరుపుతోను తుమ్మెదా ॥
సారమంతా నీవు తుమ్మెదా, తాగి
కోరి కెలిబుచ్చేవు తుమ్మెదా ॥
ఆ సుకము యెవరిదో తుమ్మెదా, పరుల
కోసమే నీ బతుకు తుమ్మెదా ॥

(ఆలోచించి తనలో) ఓహో! కుసుమపుర వృత్తాంతమును తెలిసికొని వచ్చిన మీ గూఢచారినే నని యీ గేయమునకు అర్థము. కార్యవశమున మనస్సు వ్యాకులమైయుండుటచేతను, చారులు మెండగుటచేతను, మఱచిపోయితిని. ఇప్పుడు గుర్తునకు వచ్చినది. తప్పక యీతఁడు పాములవాని వేషముతో నున్న విరాధగుప్తుఁడై యుండును. (ప్రకాశము) ప్రియంవదకా! యితనిని లోనికి రమ్మనుము. ఈతఁడు మంచి కవిగా నున్నాఁడు. ఇతని సుభాషితములను విందుముగాక.

ప్రియం :—చిత్తము (పాములవానియొద్దకు వచ్చి) అయ్యా ! లోపలికి రండి.

పాము :—(సమీపించుట నభినయించి చూచి తనలో) వీరుగో అమాత్య రాక్షసులవారు

ఉ. డాపలి కేలు జాఱఁగ మెడన్ గదియింపుచు వెన్క చూపులన్
మూఁపున బల్మి నొందుకరమున్ గదియించిన జాతి మాటి కం
కాపతితంబుగా, సిరి మహామతి నీతిని నెంచి, చన్గవన్
మోఁపదు దక్షిణంపుమొన మ్రొగ్గఁగ మార్య నెడంద నేఁటికిన్.

(ప్రకాశము) జయం, జయం, అమాచ్చులవారికి.

రాక్ష :—(చూచి) ఓహో ! విరాధ...(అని సగముమాటలో జ్ఞప్తికి వచ్చి) ప్రియంవదకా! మే మిప్పుడు పాములయాటతో వినోదింతుము. పరిజనులు విశ్రమింతురుగాక. నీవును నీపనిని జూచుకొనుము.

3

ప్రియం :—చిత్తము. అట్లనే చేస్తాను. (పరిజనులతోఁగూడ నిష్క్రమించును).

రాక్ష :—మిత్రమా! విరాధగుప్తా! యిదిగో పీఠము. కూర్చుండుము.

విరాధ :—అమాత్యులవారి యాజ్ఞ (కూర్చుండును.)

రాక్ష :—(తేఱిపాఱఁజూచి కన్నీటితో) అక్కటా! యేలినవారి పాదములను గొలిచి బ్రతుకు జనమునకు ఎట్టి యవస్థ వచ్చినది?

విరాధ :—అమాత్యా! యేల శోకించెదరు? అత్యల్పమగు కాలములోనే యమాత్యులవారు మమ్మును మరల మా పూర్వ పరిస్థితికిఁ దీసికొనిరాఁగలరు.

రాక్ష :—మిత్రమా! కుసుమపుర వృత్తాంత మేమో వివరింపుము.

విరాధ :—అమాత్యా! కుసుమపుర వృత్తాంతము మిక్కిలి పెద్దది. మఱి యెచ్చటనుండి వివరింపు మందురు?

రాక్ష :—మిత్రమా! చంద్రగుప్తుని నందనభవన ప్రవేశము కడ నుండి మేము పనిచిన ఘాతకులు, విషప్రయోక్తలు మొదలగువా రేమేమి చేసిరో యది యెల్లను వినఁదలంతును.

విరాధ :—ఇదిగో చెప్పుచున్నాఁడను. చాణక్యుని బుద్ధిబలముతోడుగా శక యవన కిరాత కాంభోజ బాహ్లీక ప్రభృతులగు చంద్రగుప్త పర్వతేశ్వర బలములు ప్రళయకాలోచ్చలిత మహాసముద్రములట్లు కుసుమ పురమును నలువైపుల నుండియు ముట్టడించినవి.

రాక్ష :—(కత్తిని దూసి సంభ్రమముతో) ఆఁ! నే నుండఁగనే, యెవఁడు వాఁడు కుసుమ పురమును ముట్టడించునది? ప్రవీరకా! ప్రవీరకా! యిదే తత్క్షణమే పోయి,

శా. ప్రాకారంబును జుట్టుఁ డెల్లెడ ధనుర్ధారుల్ వసన్; నిల్వుఁడీ
వాకిండ్లన్ సమదప్రతిద్విరద విధ్వంసక్షమంబౌ గజా
నీకం; బేకమనస్కులై పగఱనీనిస్సత్త్వులన్ జెండ రం
డో కీర్తిప్రియు లాత్మమృత్యుభయముల్ బోనాడి నాతోడుతన్

విరాధ :—అమాత్యా! ఆవేగము నందకుఁడు. నే నిప్పుడు వర్ణించు నది గడచిపోయిన వృత్తాంతము.

రాక్ష :—(నిట్టూర్పు పుచ్చి) ఏమీ ? కడచిపోయిన వృత్తాంతమా యిది ? నే ననుకొంటినిగదా ఆ సమయమే యిప్పుడు నడచు చున్న దని. (కత్తిని వదలి కన్నీటితో) హా! మహారాజా! నంద! తమ యనుగ్రహము లన్నియు రాక్షసునకుఁ దలఁపునకు వచ్చుచున్నవి. ఈ యుద్ధకాలములో

సీ. కాఱుమబ్బులువోలెఁ గవియు నచ్చోట భద్రేభయూథంబు; లం దేగుఁగాక
రాక్షసుం; డివియె తురంగమశ్రేణు లుద్యద్రయాంభఃప్లుతి నలము నందు
సమయించుఁగాక రాక్షసుఁ డేగి యవ్వాని; నవె క్రమ్ముకొనెడుఁ బదాతిబలము
లిట నసంఖ్యంబు లియ్యెడ కేగి కూలార్పఁ జూడుఁగావుత రాక్షసుం డటంచు
తే. నాజ్ఞపై నాజ్ఞలను బంపునట్టివేళ, మదిఁ దలంతువు నిండారు మమతఁ జేసి
రాక్షసులు వేలకొలఁదిఁ బురంబులోన, నున్నయట్లు; భవత్కృప నెన్నఁదరమె?

విరాధ :—అమాత్యా! అవధరింపుము. అట్టి కుసుమ పురమును జూచి, చిరకాలపు ముట్టడివలన నానాఁటికి పౌరులపై నావ రించు నామహోపద్రవమును సహింపనేరక మహారాజు సర్వార్థసిద్ధి యట్టి దశలో పురజనుల క్షేమమే ప్రధానముగాఁ దలఁచి సొరంగపు మార్గమునఁ దపోవనమునకై తొలఁగి పోవుటయు, అధినాథుఁడు లేమిచేఁ దమ బలములు శిథిలీకృత ప్రయత్నము లగుటయు, చంద్రగుప్తుని జయఘోషణమునకు విఘాతము గలిగించుట మొదలగు సాహసకృత్యము లొనరించుటచేఁ బురవాసులకు నందులపైఁ గల యనురాగము నూహించి మరల నందరాజ్యము ప్రతిష్ఠించు నుద్దేశముతో తాము సురంగా మార్గమునఁ బురమునుండి తొలఁగి బయటికి వచ్చుటయు, చంద్రగుప్తుని రూపుమాపుటకై తాము నియోగించిన విషకన్యచేఁ బాప! మా పర్వతేశ్వరుఁడు చంపింపఁబడుటయు—

రాక్ష :—మిత్రమా ! ఎంతటి యాశ్చర్యమో చూడుము.

ఉ. ఒక్కనిఁ జంపుశక్తి విజయుం గడపన్ రవిజుండువోలె నే
నొక్కని మౌర్యుఁ గూల్పఁ జిర ముంచితి నవ్విషకన్య; దానిచే
నక్కటఁ బర్వతేశుఁడు ఘటోత్కచున; ట్లలశౌరివోలె నా
టక్కరి చావఁడే ప్రియపడన్ నిజవధ్యవినాశసిద్ధికిన్.

విరా :—అమాత్యా ! యిది విధివిలసితము. మీరేమి చేయఁగలరు ?

రాక్ష :—తరువాత.

విరాధ :—అంతటఁ దండ్రిచావునకు బెదరి కుమార మలయకేతువు పలాయన మగుటయు, జరిగిన తరువాతఁ జాణక్యుఁడు పర్వతేశ్వరుని సోదరుఁడగు వైరోచకునకు విశ్వాసము కలిగించి నిలిపి చంద్రగుప్తుఁడు నందభవనమునఁ బ్రవేశించు నని ప్రకటించెను. పిమ్మట నా కుసుమ పురమున నున్న సూత్రధారుల నందఱను బిలిపించి 'మహామూర్తికుల యాదేశము ననుసరించి యీ దినముననే చంద్రగుప్తుఁడు నంద భవనమునఁ బ్రవేశింపవలసి యున్నది. అందువలనఁ బూర్వద్వారము మొదలుకొని రాజభవనము నంతయును జక్కఁగా నలంకరింపుఁ' డని యాజ్ఞాపించెను. అందులకు సూత్రధారులు 'ఆర్యా! దారువర్మ యను శిల్పి చంద్రగుప్త మహారాజులుంగారు నందభవనమును ప్రవేశించు సంగతి నెఱింగి యింతకుముందే రాజభవనము మొదటి వాకిటిని బంగారపుఁ దోరణము నమర్చియు నింకను నసాధారణములగు పెక్కలంకారములను గావించియు, నలంకరించి యున్నాఁడు. ఇంక మేము లోపలిభాగము మాత్రమే యలంకరింపవలసి యున్నది' అని పలికిరి. అంతటఁ జాణక్య వటుఁడు తాము చెప్పకయే దారువర్మ రాజభవనద్వారము నలంకరించె నని చాల సంతోషించి, చాలసే పాతని తెలివితేటలను బొగడి యతనితో 'దారువర్మా! యచిరకాలముననే యీ నీ

సామర్థ్యమునకుఁ దగిన ఫలము నందుదువుగాక ' యని పలికెను.

రాక్ష :—(ఉత్తలపాటుతో) చాణక్యవటు వంత సంతోషించెనా? ఏల? దారువర్మని ప్రయత్నము అఫలమో, లేక, యనిష్ట ఫలమో యై యుండు నని తలంతును. ఏల యన? నీతఁడు, మతి దప్పియో లేక రాజభక్తి మెండుకొనియో గాని, తనకుఁ జెప్పినంతవఱకును వేచియుండకపోవుటచే చాణక్యవటునకు మనస్సులో గొప్ప యనుమానము గలిగించినాఁడు. తరువాత?

విరాధ :—అంతట దురాత్ముఁడగు చాణక్యుఁడు ముహూర్త మను కూలముగా నుండుటచే నర్ధరాత్ర సమయమునఁ జంద్రగుప్తుని నందభవన ప్రవేశము జరుగు నని శిల్పులకును, పౌరులకును గూడ వెల్లడి గావించి యా నిముసమునందే పర్వతేశ్వరుని సోదరుఁడగు వైరోచకుని చంద్రగుప్తునితోఁగూడ నేకాసనముసఁ గూర్చుండఁబెట్టి పృథివీరాజ్యమున నెల్లఁ జెరిసగముగాఁ బంచివేసినాఁడు.

రాక్ష :—ఏమీ! మొట్టమొదటఁ జెప్పిన మాట ప్రకారముగా నర్ధరాజ్యమును పర్వతేశ్వరుని సోదరుఁడగు వైరోచకునకుఁ బంచి యిచ్చెనా?

విరాధ :—అవును; పంచిపెట్టినాఁడు.

రాక్ష :—(తనలో) తప్పక పరమ ధూర్తుఁడగు నాతఁడా యభాగ్యుని గూడ రహస్యముగా ముగింప సిద్ధపడి పర్వతేశ్వరుని చావువలనఁ దనకుఁ గలిగిన యపకీర్తిని దుడిచివైచికొనుటకై యిట్లు లోకప్రసిద్ధిని గల్పించినాఁడు. (ప్రకాశము) తరువాత?

విరాధ :—ఇట్లు పట్టాభిషేకము జరిగినతరువాత వైరోచకునకు అలంకారము కావించిరి. ఆణిముత్యముల జాలరులతో

నిండారిన పట్టు పుట్టపుఁ బ్రావరణమును శరీరము నిండ దిగువాఱఁ గప్పిరి. సిగకట్టిన యూఁదలపై మణిమయమగు కిరీటము నుంచిరి. విశాలమగు వక్షస్థ్సలముపై పరిమళ బహుళమగు కుసుమ వైకక్షికమాలిక నమరించిరి. ఈ యలంకారములతో నాతఁ డతిపరిచితులగువారికిఁ గూడ గుర్తుపట్టరాని యాకారముతో నుండెను. దురాత్ముఁడగు చాణక్యుని యాదేశము ననుసరించి యాతఁడు చంద్రగుప్తుఁ డెక్కెడు చంద్రలేఖ యను పిడియేనుఁగు నెక్కెను. చంద్ర గుప్తుని ననుసరించు రాజలోక మంతయును నాతని ననుస రించెను. ఇట్టివైభవముతో వైరోచకుఁడు మహారాజ నందుల రాజభవనమును ప్రవేశింపసాగెను. అతనిని జూచి మీరు నియోగించిన సూత్రధారుఁడగు దారువర్మ యితఁడే చంద్రగుప్తుఁ డని తలఁచి అతనిమీఁదఁ బడఁద్రోయుటకు యంత్రతోరణము నాయత్తపఱచెను. ఇంతలో చంద్రగుప్తాను యాయులగు రాజులు వాకిలి వెలుపలనే తమ తమ వాహన ములను బిగఁబట్టి నిలిపిరి. వా రట్లు నిలిపిరో లేదో వెంటనే మీరు నియోగించిన వాఁడే యగు బర్బరకుఁ డను చంద్ర గుప్తుని మావటివాఁడు తాను దాఁచిన చుఱకత్తిని దూయుటకై బంగారపుగొలుసున వ్రేలుచున్న కనక దండమును చేతితో నందుకొనెను.

రాక్ష :—ఇరువురును ఆస్థానమునఁ బ్రయత్నించినారు. తరువాత?

విరాధ :—అంతట నా పిడియేనుఁగు, మావటివాఁడు తనను ముని తొడదగ్గర కొట్టునేమో యను నూహతో తటాలున తన నడకను మార్చెను. అందుచేత దారువర్మ యేనుఁగు తొలి నడక ననుసరించి గురి చూచి పడఁద్రోసిన యంత్రతోరణము గురి తప్పి, దూసినకత్తిని చేతిలో నమర్చుకొనుచున్న బర్బరకునిపైఁ బడఁగా పాప మా యభాగ్యుఁడు 'ఇతఁడే చంద్రగుప్తుఁ'డను తలఁపున వైరోచకుని జేరకముందే

నిహతుఁ డయ్యెను. తరువాత మొట్టమొదటనే తలవాకిలి పై భాగమున నత్తగుచోటికి నెక్కియున్న దారువర్మ యంత్రతోరణమును బడఁద్రోసినందులకుఁ దన కెట్లును జావు దప్పదని తలఁచి, యంత్రమును నొక్కుటకై యమర్చిన యినుపమేకును బెఱికికొని, దానితో పాప మా వైరోచకుని యేనుఁగు మీఁదివానిని ఏనుఁగుమీఁదనే చంపివైచెను.

రాక్ష :—అక్కటా! ఒక్కపెట్టున రెండనర్థములు పైఁబడినవి. చంద్రగుప్తుఁడు నిహతుఁడు గాలేదు. వైరోచక బర్బరకులు దైవవశమునఁ గూలినారు. మఱి సూత్రధారుఁడు దారువర్మనికథ యేమి?

విరాధ :—వైరోచకునిముందు నడచు కాలుబలములవారు అతనిని మట్టిపెళ్ళలతోఁ గొట్టి చంపినారు.

రాక్ష :—(కన్నీటితో) అక్కటా! ప్రియమిత్రుఁడు దారువర్మ మనలను వదలిపోయినాఁడు. మఱి యా వైద్యుఁ డభయదత్తుఁ డేమైనను జేసెనా?

విరాధ :—సర్వమును జేసినాఁడు.

రాక్ష :—(సంతోషముతో) ఏమీ! చంద్రగుప్తుఁడు సమసెనా?

విరా :—లేదు; దైవవశమునఁ జావలేదు.

రాక్ష :—(విషాదముతో) అట్లయిన 'సర్వమునుఁ జేసినాఁ' డని చెప్పితి వేల?

విరాధ :—అతఁడు రహస్యపుఁ జావును గలిగించు చూర్ణమును గలిపిన యౌషధమును చంద్రగుప్తునికై సిద్ధముచేసినాఁడు; కాని, పాపాత్ముఁడగు చాణక్యుఁడు దానిని బంగారపు గిన్నెలో నుంచి పరీక్షించి రంగుమారుటను గనిపట్టి చూపి చంద్రగుప్తునితో 'వృషల! యీ యౌషధమునందు విషము గలిసియున్నది. దీనిని త్రాగవలదు' అని చెప్పెను.

రాక్ష :—శఠుఁడు సుమా యా బ్రహ్మచారి. మఱి యా వైద్యుని సంగతి!

విరాధ :—ఆ మందునే త్రావింపఁగా అ స్తమించినాఁడు.

రాక్ష :—(శోకముతో) అయ్యయ్యో! గొప్ప విజ్ఞానరాశి యస్త మించినాఁడు! మఱి శయనాధికారియగు ప్రమోదకుఁడు గలఁడే యాతనివిషయ మేమైనది?

విరాధ :—అందఱ కేమైనదో అదియే.

రాక్ష :—(ఉద్వేగముతో) ఎట్లది?

విరాధ :—ఆ మతిమాలినవాఁడు మీ రిచ్చిన యీ యపారధనము నతివ్యయముగా ననుభవింప నారంభించినాఁడు. దానిని తెలిసికొని 'నీ కింత గొప్ప మొత్తము ధన మెక్కడనుండి వచ్చిన?' దని ప్రశ్నింపఁగా నెప్పు డాతఁడు బదులు సరిగాఁ జెప్పక యనేకవిధములుగాఁ జెప్పినాఁడో, అప్పుడే చాణక్యుఁడు వానిని చిత్రవధ చేయించినాఁడు.

రాక్ష :—(ఉద్వేగముతో) ఏమీ? యిందును దైవము మమ్మే వ్యతిరేకించెనా? మఱి శయనించియున్నప్పుడు చంద్రగుప్తుని దెగటార్పుఁ డని మేము పనుపఁగా సొరంగపుమార్గమునఁ బోయి రాజుగారి పడకటింటి గోడలలోపల దాఁగియుండిరే భీభత్సకాదులు, వారి వృత్తాంత మెట్టిది?

విరాధ :—మహాదారుణ మైనది.

రాక్ష :—(ఆవేగముతో) వా రక్కడ నున్నసంగతి బయలుపడలేదు గద?

విరాధ :—బయలు పడ కేమున్నది? చంద్రగుప్తుఁడు ప్రవేశించుటకు ముందుగా దురాత్ముఁడగు చాణక్యుఁడు పడకటింటికి వచ్చినాఁడు. వచ్చి అడుగుపెట్టినతోడనే అతఁ డా యిల్లంతయుఁ జక్కఁగా పరిశీలించుచుండఁగా నొకగోడ బొఱకలో నుండి మెదుకుచీదపలను దీసికొని, వెలుపలికి వచ్చుచున్న చీమలబా రాతనికంటఁ బడెను. అంతట ఇందు మనుష్యులు దాఁగియున్నా రనువిషయము గ్రహించి యాతఁ డా పడక

టింటిని తగులఁబెట్టించెను. ఇట్లామందిరము గాల్పఁబడఁగా భీభత్సకాదు లందఱును కన్నులకుఁ బాగ చుట్టుకొనుటచే మొదటఁ దాము మూసిపోయిన ద్వారమును గమనింపఁ జాలక పెనుమంటలపాలైరి.

రాక్ష :—(కన్నీటితో) మిత్రమా! దురాత్ముఁడగు చంద్రగుప్తుని దైవబల మేమో చూడుము.

చ. అతని వధింప గూఢగతి నంపు విషాంగనచేతఁ జచ్చెఁ బ
ర్వతుఁడు తదీయరాజ్యమునఁ బాల్గొనువాఁడు; రసాళి, శస్త్రసం
తతులను మేము పంచిన జనంబులె ప్రమందిరి; నాదు నీతు లి
ట్లతి శుభదంబులై ఫలము లక్కట మౌర్యునకే ఫలించెడున్.

రాధ :—అమాత్యా! ఇది నిక్కమే! అయినను నిటు చూడుము. ప్రారంభించిన పనిని వదలిపెట్టుట యెంతమాత్రమును యుక్తము గాదు.

ఆ. విఘ్నభీతి మొదలుపెట్టరు నీచులు;
తొడరి, విఘ్ననిహతి విడుచువారు
మధ్యములు; తొడంగి మానరుత్తములు వే
మారు విఘ్నతతులఁ మలఁపునేని.

అదియునుఁగాక.

శా. లేదే శేషునకున్ భరం? బవనిఁ దాల్చేన్ గాని పోఁద్రోసెనే?
లేదే భానునకున్ శ్రమంబు? దివి నల్లే పోక చాలించెనే?
యేదేనిం గొని హీనుఁ డట్లు విడ, నెంతే సిగ్గులున్ మేటి; మ
ర్యాదావంతులకున్ గులవ్రతము వో ప్రారంభనిర్వాహముల్.

రాక్ష :—అవును; ప్రారంభించిన పనిని వదలిపెట్టుట యెంత మాత్రమును యుక్తముగాదు. ఈ విషయము నీకును ప్రత్యక్షమే; కానిమ్ము తరువాతి వృత్తాంతమును జెప్పుము.

విరాధ :—అప్పటినుండియును జాణక్యహతకుఁడు చంద్రగుప్తుని శరీర విషయమున వేయింతలు జాగరూకుఁడై 'వీరినుండి యిట్టి

యాపదలు గలుగు' నని వెదకి వెదకి కుసుమ పురమున నున్న మీ యాప్తజనుల నందఱను నిగ్రహించినాఁడు.

రాక్ష :—(ఆవేగముతో) ఎవ రెవరిని నిగ్రహించినాఁడేమి?

విరాధ :—మొట్టమొదట బౌద్ధసన్న్యాసి జీవసిద్ధిని అవమానపూర్వకముగ నూరినుండి వెళ్లఁగొట్టించినాఁడు.

రాక్ష :—(తనలో) ఇంత మాత్రము భరింపవచ్చును. ఏ జంజాటమును లేనివానికి స్థానభ్రంశము బాధకరము గాదు. (ప్రకాశము) మిత్రమా! యేమి తప్పుచేసినాఁ డని యాతనిని వెళ్లఁ గొట్టించినాఁడు?

విరాధ :—'రాక్షసుని పనుపున నీతఁడు విషకన్యతోఁ బర్వతేశ్వరుని జంపినాఁడు' అని.

రాక్ష :—(తనలో) సెబాసు; కౌటిల్యుఁడా! సెబాసు.

తే. నీపయినిఁ బడు నపకీర్తిఁ బాపికొంటి;
మాపయినిఁద్రోసి; తర్ధరాజ్యాపహారుని
జంపితివి; నీదు నీతిబీజం బొకండ
యయ్యు నీరీతి బహుఫలంబయి తనర్చు.

(ప్రకాశము) తరువాత?

విరాధ :—ఆ తరువాత 'చంద్రగుప్తుని శరీరమునకు హానిచేయుటకై యీతఁడు దారువర్మ మొదలగు వారిని నియోగించినాఁ' డని పట్టణమునఁ జాటింపించి శకటదాసునిఁ గొఱత వేయించినాఁడు.

రాక్ష :—(కన్నీటితో) హా! మిత్రమా! శకటదాసా! యీ మరణము నీకు రాఁదగినది కాదు. అయినను ఏలినవాని కొఱకై ప్రాణము లర్పించిన నిన్నుఁగూర్చి శోకింపవలసిన పని లేదు; కాని నందవంశ మంతయును నాశనమై పోయినను, ఇంకను బ్రదుకఁ దలఁచియున్న మమ్ముఁగూర్చియే శోకింపవలసి యున్నది.

విరాధ:—అట్లుగాదు. అమాత్యా! తమ యత్నముగూడ స్వామ్యర్థమును సాధించుటకొఱకే గదా!

రాక్ష:—మిత్రమా!

ఆ. బ్రదుకుమీఁది యాశ ప్రబలించి గా కేత
దర్థసాధనమున కయియె? మేము
దివికిఁ జన్న రాజదేవేంద్రు వెనువెంటఁ
దరల కుండెదము కృతఘ్నవృత్తి.

విరాధ:—అమాత్యా! ఇది యిట్లు కాదు.

ఆ. బ్రదుకుమీఁది యాశ ప్రబలించి గా కేత
దర్థసాధనమున కయియె మీరు
దివికిఁ జన్న రాజదేవేంద్రు వెనువెంటఁ
దరలకుండెదరు కృతజ్ఞవృత్తి.

రాక్ష:—చెప్పుము మిత్రమా! మరియొక సుహృద్వ్యసనమును గూడ; వినుటకు సిద్ధముగా నున్నాఁడను.

విరాధ:—ఈ సంగతిని తెలిసికొని చందనదాసుఁడు అమాత్యుని కుటుంబమును తన యింటినుండి మార్చి భద్రము గావించి నాఁడు.

రాక్ష:—క్రూరాత్ముఁడగు చాణక్య వటువునకు విరుద్ధముగా నాతఁడు చేసినది యుక్తముగా లేదు.

విరాధ:—అమాత్యా! మిత్రద్రోహం మంతకంటెను యుక్తము గాదు గదా?

రాక్ష:—తరువాత?

విరాధ:—పిమ్మట పిలిపించి యెంతగా నడిగినను చందనదాసుఁ డమాత్యుల కుటుంబము నప్పగింపక పోఁగా, వానిపైఁ జాణక్యవటుఁడు మండిపడి,

రాక్ష:—(ఆవేగముతో) చంపింప లేదు గదా?

విరాధ :—లేదు; అమాత్యా! చంపింపలేదు; కాని సర్వస్వమును కొల్లఁగొట్టి యాలుబిడ్డలతోఁగూడ నాతని బంధించి చెఱఁ బెట్టించినాఁడు.

రాక్ష:—మఱి రాక్షస కళత్రము వేఱొకచో భద్రముగా నుంపఁబడిన దని సంతోషముగాఁ జెప్పెద వెందులకు? ఇప్పుడు సపుత్ర కళత్రముగా రాక్షసుఁడు చెఱఁబెట్టఁబడె నని చెప్పవలసి యున్నది.

(తెరను తొలఁగఁద్రోసికొని సేవకుఁడు ప్రవేశించి) జయం, జయం, మంత్రులవారికి ; యీాన యెవరో శకటదాసుఁడట ముంగిట్లో వున్నాఁడు.

రాక్ష :—ఏమిా? నిజమా?

సేవ :—అమాత్యులవారి పాదాల్ని సేవించేవాళ్ళకు అబద్ధా లాడడం తెలేని సంగతి.

రాక్ష :—మిత్రమా! విరాధగుప్తా! యెట్లుది?

విరాధ :—అమాత్యా! అదృష్టవంతునిని ఆతని యదృష్టమే కాపాడును.

రాక్ష:—ప్రియంవదకా! యిట్లైన నింకను నాలస్య మెందులకు? శీఘ్రముగా నాతనిఁ బ్రవేశపెట్టి నాకు ఊఱట కలిగింపుము.

ప్రియం :—చిత్తము (నిష్క్రమించును.)

(అంతట సిద్ధార్థకుఁడు వెంటనుండఁగా శకటదాసుఁడు ప్రవేశించును.)

శకట :—(తనలో)

సీ. క్షితితలంబునఁ బ్రతిష్ఠితమైన పదమునఁ దనరార మూర్యుని గనినకరణి
శూలంబుఁ గని తెల్వి దూలి సొమ్మలు వోవ వధ్యస్రజంబు నవ్వాని రాచ
సిరివోలె నాఁదల ధరియించి యతిదారుణంబులై దుర్విషహంబులైన
యాఘాత సమయ సమాహత వివిధ తూర్యధ్వానములఁ బతిప్రళయవేళఁ

తే. బోలె నాలించి ప్రయ్యలై ప్రీలకుండ నుల్లమది చక్కనై నిల్చియుంటఁ జూడఁ
బ్రథమఘాతానుభవము చేపడుటకతనఁ గనియెఁ గాఠిన్య మనుచు నిక్కముగఁ
దోఁచు.

(చూచి సంతోషముతో) వీరే యమాత్యరాక్షసులవారు; ఇటనే యున్నారు.

తే. నందుఁడు నశించినను నాశ మొందఁబోని
భక్తినితఁడు స్వామ్యర్థభరముఁ దాల్చి
ధరణిఁ గలస్వామిభక్తాగ్రసరుల కెల్ల
రాణమై నిల్చుఁ బరమప్రమాణపదవి.

(సమీపించి) అమాత్యులవారికి జయ మగుఁగాక.

రాక్ష :—(చూచి సంతోషముతో) మిత్రమా! శకటదాసా! యేమి నా భాగ్యము. కౌటిల్యు బారిని బడినవానిని గూడ నిన్నుఁ జూడఁగలిగితిని. రమ్ము నన్నుఁ గౌఁగిలించుకొనుము.

(శకటదాసుఁ డట్లు చేయును.)

రాక్ష :—(చాలసేపు కౌఁగిలించుకొని) ఇదిగో పీఠము. కూర్చుండుము.

శకట :—అమాత్యుల యాజ్ఞ (అని కూర్చుండును).

రాక్ష :—మిత్రమా! శకటదాసా! మాకుఁ గలిగిన యీ హృదయానందమునకుఁ గారణ మెవరు?

శకట:—(సిద్ధార్థకుని చూపించి) ప్రియ మిత్రుఁడగు నీ సిద్ధార్థకుఁడు. తలవరులను తఱుమఁగొట్టి నన్ను వధ్యస్థానమునుండి తొలఁగఁదీసినాఁడు.

రాక్ష :—(సంతోషముతో) భద్రా! సిద్ధార్థకా! నీవు చేసిన ప్రియమున కిది యేమాత్రమును జాలిన బహుమానము కాదు. అయినను దీనిని పరిగ్రహింతువుగాక (అని తనమీఁదనున్న యలంకరణము దీసి యిచ్చును.)

సిద్ధా :—(తీసికొని రాక్షసుని పాదములపైఁబడి స్వగతము) ఇదేగదా యార్యులవారి వుపదేశం; దాని ప్రకారమే చేస్తాను. (ప్రకాశము) అమాత్యులవారు అనుగ్రహించాలె. ఇదే మొదటిసారిగా యిక్కడికి వచ్చిన నాకు అమాత్యులవారిచ్చిన యీ బహుమానాన్ని నమ్మకంగా దాచిపెట్టుకొన

డానికి పరిచయమైనవా ళ్లెవరూ లేరు. కాబట్టి యీ వుంగరంతో మొహరు వేశి దీన్ని అమాత్యులవారి భాండాగారం లోనే వుండనియ్యవాలిసిం దని ప్రార్థిస్తూ వున్నాను. నాకు కావలసినప్పుడు తీసుకొంటాను.

రాక్ష :—అట్లే కానిమ్ము. దోష మేమి? శకటదాసా! యితఁడు కోరినట్లు కావింపుము.

శకట :—(ముద్రికను పరిశీలించి జనాంతికము) అమాత్యా! యీ ముద్రికపైఁ దమనామధేయ మున్నది.

రాక్ష :—(చూచి తనలో) నిజమే. నేను నగరమును విడిచి వచ్చునప్పుడు, ఉత్కంఠా వినోదమునకై యిల్లాలు దీనిని నాచేతి నుండి తీసికొనినది. ఇతనిచేతి కెట్లు వచ్చినది? (ప్రకాశము) భద్రా! సిద్ధార్థకా! ఇది నీ కెట్లు చిక్కినది?

సిద్ధా :—అమాత్యా! కుసుమపురంలో చందనదాసుఁడనే రత్నాల సెట్టి వున్నాడే, ఆయన యింటివాకిలి దగ్గిర పడియుండి యిది నాకు దొరికింది.

రాక్ష :—యుక్తముగా నున్నది.

సిద్ధా :—అమాత్యా! యేమి యిక్కడ యుక్తంగా వుంది?

రాక్ష :—భద్రా! ఇట్టి వస్తువు మిక్కిలి ధనికులగువారి యింటి యొద్దఁ బడియుండుటయు, నీకు లభించుటయును యుక్తము గానే యున్నది.

శకట :—మిత్రమా! సిద్ధార్థకా! యిది యమాత్యులవారి పేరు చెక్కిన యుంగరము. కావున అమాత్యులు నీకు దీని వెల కంటెను మరింతధనమును బహుమానముగా నిత్తురు. దీనిని వారి కిచ్చి వేయుము.

సిద్ధా :—అయ్యా! అమాత్యులవారే, స్వయంగా యీ వుంగరాన్ని తీసుకొంటారంటే యిది నిజంగా నాకు మహానుగ్రహం. (ముద్రిక నిచ్చును),

రాక్ష :—మిత్రమా ! శకటదాసా ! ఈ ముద్రికతోడనే నీవు నీ యధికారమున వ్యవహరింపుము.

శకట :—చిత్తము. తమయాజ్ఞానుసారము కావింతును.

సిద్ధా :—అమాత్యా ! నే నొక్క-సంగతి తమతో విన్నపం చేసు కొంటాను.

రాక్ష :—భద్రా ! నిస్సంకోచముగఁ జెప్పుము.

సిద్ధా :—దురాత్ముఁడు చాణక్యునికి అపకారం చేసినతర్వాత నాకు పాటలీపుత్రంలో మళ్లీ అడుగుపెట్టడానిగ్గూడా వీల్లేదనే సంగతి అమాత్యులవారిగ్గూడా తెలిసినవిషయమే. కాబట్టి నే నిక్క-డ్డే అమాత్యులవారి పాదాల్నే సేవిస్తూ వుండ దలుస్తున్నాను.

రాక్ష :—భద్రా! మిక్కి-లి సంతోషము. నీ యభిప్రాయము తెలియక పోవుటచేత మేమే ముందుగా కోరఁజాలకపోయితిమి. అట్లే చేయుదువుగాక.

సిద్ధా :—అమాత్యులవారి యనుగ్రహంతో ధన్యుణ్ణైనాను.

రాక్ష :—మిత్రమా! శకటదాసా! సిద్ధార్థకుని విశ్రమింపఁజేయుము.

శకట :—చిత్తము, అట్లే చేయుదును (సిద్ధార్థకునితో నిష్క్రమింతురు.)

రాక్ష :—మిత్రమా! విరాధగుప్తా! యింకఁ జెప్పుము, కుసుమపుర వృత్తాంత శేషమును. మనము చేయు భేదోపాయములకు అచట నున్న ప్రకృతు లనుకూలురుగనే యున్నారా ?

విరాధ :—నిస్సందేహముగ ; అనుకూలురుగానే యున్నారు. స్పష్టముగా వెల్లడియగుచున్నది గూడ.

రాక్ష :—మిత్రమా ! యేమి వెల్లడియగుచున్నది?

విరాధ :—ఏమనగా, మలయకేతువు తప్పించుకొని పోయినప్పటి నుండి చంద్రగుప్తుఁడు చాణక్యునిమీఁదఁ గోపముతో నున్నాఁ డనియు, చాణక్యుఁడుగూడఁ బ్రతిజ్ఞావిజయ గర్వితుఁడై తఱచుగా నాజ్ఞాభంగములను గావించుచుఁ

జంద్రగుప్తునిమనస్సునకుఁ గష్టము గలిగించుచున్నాఁడనియు స్పష్టముగా వెల్లడి యగుచున్నది. ఇది నేనును ననుభవ పూర్వకముగాఁ దెలిసికొంటిని.

రాక్ష :—(సంతోషముతో) మిత్రమా! విరాధగుప్తా! నీ వీ పాముల వానివేషముతోడనే మరలఁ గుసుమపురమునకుఁ బొమ్ము. అచ్చట నా మిత్రుఁడు స్తవకలశుఁ డనువాఁడు వైతాళికుని వేషముతో నున్నాఁడు. అతనితో 'చాణక్యుఁ డాజ్ఞాభంగము చేసిన ప్రతిసమయమునందును నీవు చంద్రగుప్తుని పౌరుషమును రెచ్చఁగొట్టు పద్యములతో స్తోత్రముచేయు' మనియు ఫలితమును అతిరహస్యముగా కరభకునితోఁ జెప్పి పంపు మనియు మామాటగాఁ జెప్పుము.

విరాధ:—చిత్తము. అమాత్యులవారి యాజ్ఞానుసారమే కావింతును. (నిష్క్రమించును.)

పురుషుడు :—(ప్రవేశించి) జయం, జయం, అమాత్యులవారికి. శకటదాసు విన్నవిస్తున్నాఁడు. 'అసాధారణాలైన యీ మూడు సొమ్ములూ అమ్మకానికి వచ్చినాయి. కాబట్టి వీనిని అమాత్యులవారు స్వయంగా చూడవాల్సింది' అని (చూపును).

రాక్ష :—( పరిశీలించి తనలో ) మిక్కిలి విలువగల సొమ్ములు : (ప్రకాశము) భద్రా! 'విక్రయించువానిని సంతృప్తిపఱచి వీనిని కొనవలసిన దని శకటదాసునకుఁ జెప్పుము.

పురు :—చిత్తము ; అట్లనే చేస్తాను.

రాక్ష :—నేనును కరభకుని కుసుమపురమునకు పంపెదను. (లేచి) దురాత్ముఁడగు చాణక్యునినుండి చంద్రగుప్తుఁడు వేఱు పడునా? సందేహ మేల? మా కోరిక నెఱవేఱె ననియే తలంతును. ఏల యన?

శా. తేజంబుం గను మౌర్యుఁ డానతధరిత్రీపాలుఁడై ; 'యీతడున్
రా జయ్యెన్ నను నాశ్రయించి' యని చాణక్యుండు గర్వించు; నీ
యోజన్ బ్రాభవలబ్ధి ధన్యుఁ డొకఁ, డొం డుత్తీర్ణ సంధార్ణవుం;
డీ జంటన్ బెడఁబాపు ధన్యతరుఁ సం దింతైనచోఁ జెల్మికిన్.

(నిష్క్రమించును.)

ఇది రాక్షస విచార మను
ద్వితీయాంకము.



# తృతీయాంకము

(అంతటఁ గంచుకి ప్రవేశించును)

కంచుకి:— (నిర్వేదముతో)

మ. మును నీ కొయ్యన రూప మాది విషయంబుల్ దెల్పి, యాత్మప్రతి
ష్ఠను జేకూర్చిన చక్షురాదులనుగూడన్ స్వార్థబోధం బడం
గ; నిజాజ్ఞం బొనరించు నంగములఁ గ్రుంగెన్ బాటవం; బేచి పె
ల్చన నీసె త్తిన కాలిడెన్ ముదిమి; యాశా! ప్రుక్కు దిం కేటికిన్?

(పరిక్రమించి యాకాశము వైపు చూచుచు) ఓహో! సుగాంగ ప్రాసాదాధికృతులారా! సుగృహీతనామధేయుఁ డగు చంద్రగుప్త మహారాజులవారు మీ కిట్లాజ్ఞాపించుచున్నారు. 'కౌముదీమహోత్సవము జరుగుచుండఁగాఁ గుసుమపురమును మేము చూడఁదలఁచుచున్నాము; కావున సుగాంగ ప్రాసాద ప్రదేశముల నలంకరింపుఁడు' అని. (ఆకాశమువైపు విని) ఏమనుచున్నారు? 'ఆర్యా! కౌముదీ మహోత్సవము నిషేధింపఁబడిన విషయము మహారాజుగారికిఁ దెలియనే లేదా?' అనియా? నిర్భాగ్యులారా! ప్రాణముల మీఁదికిఁ దెచ్చు నీ ప్రస్తావముతో మీ కేమి పని? ఆలస్యము చేయకుఁడు. ఇప్పుడే,

మ. విరిదండల్ గయిసేసి క్రొంబొగలతావిన్ మీఱు స్తంభాళికిన్
బరిరంభం బిడుఁగాత సీవిరులు శోభాధూతచంద్రాంశు; లు
ర్వర సింహాసనధారణాధిగతమూర్ఛన్ దేర్చుఁగాతన్ సుమో
త్కర సమ్మిశ్రిత చందన ద్రవ సుధాధారాభిషేకక్రియల్.

(పైకి విని) ఏమి? 'ఆర్యా! ఇదిగో మహారాజుగారి శాసనము నిప్పుడే నెఱవేర్తు' మనుచున్నారా? అయ్యలారా! త్వరపడుఁడు. వీరుగో చంద్రగుప్త మహారాజులవారు రానే వచ్చినారు. ఈయన,

మ. బరువైనన్, బొరలేని యంగబల మొప్పన్ దుర్గమాధ్వంబులన్
దిరుఁడై తండ్రి భరించె ధుర్యగతి దేనిం బెద్దకాలంబు, న
ద్ధరణీభారమ కోడెప్రాయముననే తా నూనుచో సత్త్వని
ర్భరుఁడై జాఱఁడుగాని నెమ్మదిఁ బరిశ్రాంతిం గొనున్ దమ్యతన్,

(తెరలో) మహారాజా! ఇటు, ఇటు.

(అంతట రాజును ప్రతీహారియును ప్రవేశింతురు.)

రాజు :—(స్వగతము) రాజ్య మనునది రాజధర్మానువర్తనపరుఁడగు రాజునకు నిక్కముగా మిక్కిలి యప్రీతిస్థానము. ఏల యనఁగా,

మ. క్షితిపాలుండు పరార్థనిర్వహణసక్తిం బొల్చినన్ స్వార్థసం
గతి శూన్యం బగు; స్వార్థమే వదలినన్ క్ష్మాపాలనామం బన
ర్థతఁ బ్రాపించుఁ; బరార్థమే మది నిజార్థప్రాప్తికన్నన్ సుస
మ్మతమైనం బరతంత్రుఁ; డట్టిఁ డెటు లాత్మం గాంచు నానందమున్?

అదియునుగాక యెంతటి యాత్మసంపన్నులగు రాజులకైనను రాజ్యలక్ష్మి నారాధించుట యన మిక్కిలి యసాధ్యము. ఏల యన,

ఉ. దారుణచిత్తుఁ డోయు; మృదుతత్త్వుఁ బరాభవభీతి వీడు; వి
ద్యారహితుం బగన్ గనుఁ; బ్రియంబునఁ జూడదు పండితాగ్రణిన్;
భీరు హసించు; శూరు నెడ భీతిఁ గనున్; సిరి, చేయి మించున
వ్వారవధూటి వో; కొలువ వచ్చునె తన్మతి నెంతవానికిన్?

అది యట్లుండఁగా 'నాతో జగడ మాడినట్లు నటించి కొలఁదికాలము నీవు స్వతంత్రుఁడవై వ్యవహరింపవలసిన'దని యార్యులవారి యుపదేశము. దానిని పాతకము నంగీకరించినట్లు లెట్టకేలకు నంగీకరించితిని. కాని కొలఁదికాలము స్వతంత్రుఁడనై వ్యవహరించుట యేమి? ఆర్యులు మాటిమాటికిని దమ యుపదేశములచే మా బుద్ధికి వన్నె వెట్టుచుందురుగాని మే మెప్పుడును స్వతంత్రులమే. ఏల యన,

ఉ. ఎన్నఁడు మంచికిం దొడరు నేనియు శిష్యుని మాన్పఁ డొజ్జ; మో
హోన్నతి నూని కానితెరు వొందిన నంకుశ మూనుగాని; దా
న న్నిరతస్వతంత్రత యణంగదువో వినయాత్ములందు; నా
కెన్నఁడు నింపు గూర్పు పెద్ద నింతకు మించుస్వతంత్రవర్తనల్.

(ప్రకాశము) ఆర్యా! వైహీనరీ! సుగాంగ ప్రాసాదమునకుఁ ద్రోవను జూపుము.

కంచుకి :—మహారాజుగా రిటు ; ఇటు.

రాజు :—(ముందునకు నడచును.)

కంచుకి :—(పరిక్రమించి) దేవా! యిదియే సుగాంగప్రాసాదము. మెల్లగా నధిరోహింతురుగాక.

రాజు :— (ఎక్కుట నభినయించి దిక్కులు కలయఁ జూచి) అహో! శరత్కాల శోభాసనాథములై దిక్కులెల్ల నెంత రమణీయములుగా నున్నవి!

మ. పులినచ్ఛాయల వెల్లనై యలఁతి మ్రబ్బుల్ నిండ, నల్వంకలన్
కలరావంబులు సారసావళులు మూఁగన్, దారకల్ దెల్ల గ
ల్వ లనన్ విచ్చి విచిత్రవైఖరులఁ గ్రాలన్, వాహినుల్ వ్రాలె ది
క్కులు జాల్వాఱి నభంబునుండి నిసి సాగున్ దీర్ఘదీర్ఘంబులై.

మఱియును,

ఉ. హద్దుఁ దొలంగువారిఁ దగవౌ నిజమార్గమునం జరింపఁగా
దిద్ది, ఫలాభివృద్ధి వినతిం గొన శాలుల నిల్పి, నెమ్ములన్
దద్దయు మించు దుస్సహామదంబుఁ దొలంచి శరత్సమాగమం
బద్దిర! తీర్చి దిద్ది వినయంబున నిల్పెఁగ నెల్లలోకమున్.

అదియును గాక

చ. పతి బహువల్లభుం డను నెపంబున నట్లు గలంగి కార్శ్యసం
గతయగు గంగఁ గొండొక రకంబుగఁ ద్రోవకుఁ దెచ్చి, సుప్రస
న్నతఁ గొన నెల్లభంగుల నొనర్చి నదీశు రతిప్రసంగవా
క్చతురిమ నొప్పు దూతి యన శారదలక్ష్మి గదించు నేర్పునన్.

(నలువైపులను జూచి) ఆఁ! ఏమిది? కుసుమపురమునఁ గౌముదీ మహోత్సవము జరుగునట్లే లేదు! ఆర్యా! వైహీనరీ! కుసుమపురమునఁ గౌముదీమహోత్సవమును జరుపవలసిన దను మా యాజ్ఞ ప్రకటింపఁబడెనా?

కంచుకి :—చిత్తము ; స్పష్టముగాఁ బ్రకటింపఁబడినది.

రాజు :—అయిన, పౌరులు మా మాటను బాటింపలేదా ?

కంచుకి :—(చెవులు మూసికొని) పాపము శమించుఁగాక. ప్రపంచములో నెందును దప్పని దేవరవారి శాసనము పురజనులలో నెట్లు తప్పును ?

రాజు :—అయిన, కుసుమపురమునఁ గౌముదీమహోత్సవ మిప్పటికిఁ గూడ సాగనేలేదే ?

మ. తమవెంటన్ సరసంబు లాడుచును ధూర్తవ్రాత మేతేర మా
ర్గములన్ బండు వొనర్పరేల ? కటిభారప్రస్ఖల న్మందయా
నములన్ వేశ్యలు; పౌరు లాండ్రొరులకన్నన్ మించుభోగంబులన్
బ్రమదల్ దాము నిదేల? పర్వవిధి సల్పం బో రశంకక్రియన్.

కంచుకి :—అవును మహారాజా ! యిది యిట్లే.

రాజు :—ఏమి యిది ?

కంచుకి :—మహారాజా ! ఇది......

రాజు :—విస్పష్టముగాఁ జెప్పుము.

కంచుకి :—కౌముదీమహోత్సవము నిషేధించినారు.

రాజు :—(కోపముతో) ఆఁ ! ఎవరు ?

కంచుకి :—మహారాజా ! ఇంతకు మించి తెలుపుటకు మాకు శక్తి లేదు.

రాజు :—చూపరుల కెల్ల నేత్రానందకరమగు నీ యతిరమణీయ దృశ్యమును నిషేధించినది యార్య చాణుక్యులు గాదుగద?

కంచుకి:—మహారాజా! వారుతప్ప బ్రదుకుపై నాశగలవా డెవ్వఁడు దేవరవారిశాసనము నతిక్రమింపఁగలఁడు ?

రాజు :—శోణోత్తరా! కూర్చుండ నెంతును.

ప్రతీ :—ప్రభూ ! ఇదుగో సింహాసనము. మహారాజులుంగారు కూర్చొనండి.

రాజు :—(కూర్చుండి) ఆర్యా! వైహీనరీ! చాణుక్యులవారిని మేము చూడఁగోరెదము.

కంచుకి :—చిత్తము. (నిష్క్రమించును.)

(అంతట చాణుక్యుఁడు తనయింట నాసనస్థుఁడై కోపానుగతమగు నాలోచనము నభినయించుచుఁ బ్రవేశించును.)

చాణ :—ఏమీ! దురాత్ముఁడగు రాక్షసుఁడు నాతోఁగూడఁ బోటీపడుచున్నాఁడు!

మ. అపకారం బొనరించినన్ గినిసి, పామట్టుల్ పగం బూని, వీ
డి పురిన్, నందుని రూపుమాపి మును కౌటిల్యుండు దా మౌర్యునిన్
నృపతిం జేసినభంగి మౌర్యునిసిరిన్ నిర్జింతు నే నంచు నా
నపడున్ మత్ప్రతిభాప్రభావమును మించంగోరి యాతం డెదన్.

(ప్రత్యక్షమునందువలె నాకాశమున దృష్టిని సారించి)

రాక్షసా! చాలించుకొను మీ దుష్ప్రయత్నమునుండి. ఏల యన,

తే. పనికిమాలిన మంత్రులు పనులు చూడ
గర్వితుం డగు నందుండు గాఁడు, మౌర్యుఁ
డితఁడు; చాణక్యుఁడవును గా వీవు; లేని
పగ యొకఁడె సాటి ననుఁ బోలుపట్ల నీకు.

(ఆలోచించి) అయినను నీవిషయమున నే నంతగా మనస్సును గష్టపెట్ట నవసరము లేదు.

ఉ. అంతటఁ దామఱియు పొదువన్నెరల పర్వతపుత్రుఁ గూడ ల
బ్ధాంతరులై మదీయభటు; లయ్యయి కృత్యములన్ నియుక్తులై
మింతురు చారు; లింక విషమించి నెపం బిడి మౌర్యుతోడ, భే
దింతు విభేదనైపుణి నిదే రిపుతో రిపుఁ జేసి రాక్షసున్.

కంచుకి :—(ప్రవేశించి) సేవ యన నెంతకష్టమైనది?

మ. పతికిన్, మంత్రికి, రాజవల్లభునకున్, బాటించి యుంటన్ ధరా
పతి మన్నించువిటాళికిన్ బెదరి శోభాహానిఁ బిండార్థమై
ఖలతమున్ మో మెగఁ జాచి యాడనగు తుచ్ఛం బాటచేఁ గాదె నీ
చతఁ జేకూర్చు శ్వవృత్తి సేవ యనుచున్ జాటింత్రు ప్రాజ్ఞాగ్రణుల్

(ముందునకు నడచిచూచి) ఇదే యార్య చాణక్యులగృహము. లోనికిఁ బోవుదును. (ప్రవేశించి నలువైపులఁ జూచి) ఔరా! ఏమి రాజాధిరాజ మంత్రుల యీ గృహసంపద!

ఉ. గోమయపిండముల్ పగులఁగొట్టు శిలాశకలం బిటన్; వటు
స్తోమము దెచ్చి వైచిన దిదో పెను దర్భలమోపు; సెండనౌ
హోమసమిచ్చయంబుల నహో! దిగజారి యణంగు చూరులన్
గీ మిది కూల సిద్ధముగ నిల్చినగోడలఁ గానవచ్చెడిన్.

ఇట్లుండుటచేతనే సుమా యీయన మహారాజచంద్రగుప్తులవారిని సైతము వృషలశబ్దముచేఁ బిలువఁగలిగియున్నాఁడు. ఏల యన?

ఉ. లేనిగుణంబు లెల్లఁ దగిలించి నృపున్ గృపణప్రవృత్తి నెం
దేని యసత్యమున్ బలుకనేరనివారును నోరు నొవ్వ కా
పోనితెఱంగునన్ బొగడువూనిక యెల్ల దురాశపెంపునన్
గాని, మహీశుఁడున్ దృణము గాఁడొకొ? యాశఁ దొఱంగువానికిన్.

(ముందునకుఁ జూచి భయముతో) వీరే యార్యచాణక్యులు; ఇచటనే యున్నారు.

తే. ఒకట నతిలోకవృత్తి నస్తోదయముల
నంద - మౌర్యేశ్వరుల కిడి, నగు నితండు
వరుసగ హిమోష్ణములఁ గొంతవసుధ కొసఁగఁ
జాలు వేవెల్గు నైజతేజంబుపేర్మి.

(నేలపై మోఁకరిల్లఁబడి) జయము జయ మార్యులవారికి.

చాణ :—(చూచుట నభినయించి) వైహీనరీ! ఏమి పనిమీఁద వచ్చితివి?

కంచుకి :—ఆర్యా! ప్రణతి సంభ్రమ చలిత రాజన్య మకుటీమణి ద్యుతుల జాజువాఱు పాదపద్మముల నలరు సుగృహీత నామధేయులు మహారాజ చంద్రగుప్తులవారు మోఁదలవ్రాల్చి 'యార్యులవారి పనుల కభ్యంతరము గలుగనిచో నొకసారి చూడఁగోరెద' నని విన్నవించుచున్నారు.

చాణ :—వృషలుఁడు నన్నుఁ జూడఁదలఁచుచున్నాఁడా? హైహీంనరీ! నేను జేసిన కౌముదీమహోత్సవప్రతిషేధము వృషలుని చెవికి రా లేదుగద?

కంచుకి :—ఆర్యా! తెలిసినది.

చాణ :—(కోపముతో) ఆఁ? ఎవఁడు చెప్పినాఁడు?

కంచుకి :—(భయముతో) మన్నింపవలయును; ఆర్యా! మహారాజుగారే స్వయముగా సుగాంగప్రాసాదమునుండి నగరములోఁ గౌముదీమహోత్సవము జరుగకుండుటను జూచినారు.

చాణ :—ఓహో! తెలిసినది. అంతట మీరందఱును నేను లేని సందు చూచుకొని వృషలునికిఁ బురియెక్కించి కోపముఁ దెప్పించినారు. వే తేముండును?

కంచుకి :—(భయమును నటించుచు మొగమును వ్రాల్చి యూరకుండును.)

చాణ :—ఔరా! రాజపరిజనమునకుఁ జాణక్యునిమీఁద నెంత యక్కసము! మంచిది; వృషలుఁ డెక్కడ నున్నాఁడు?

కంచుకి :—ఆర్యా! సుగాంగప్రాసాదమునుండి మహారాజుగారు నన్నుఁ దమపాదసన్నిధికిఁ బంపినారు.

చాణ :—(లేచి) సుగాంగమునకుఁ ద్రోవఁ జూపుము.

కంచుకి :—ఆర్యులవారు ఇటు; ఇటు.

(ఇరువురును బరిక్రమింతురు)

కంచుకి :—ఇదియే సుగాంగప్రాసాదము. ఆర్యులవారు మెల్లగా నధిరోహింతురు గాక.

చాణ :—(ఎక్కుట నభినయించి చూచి) ఆహా! వృషలుఁడు సింహాసనముమీఁద నున్నాఁడు! బళి బళి!

చ. పలుకులతనంబునన్ నృపులపాడిఁ దొలంగు మదాంధులైన నం
దులు దొలఁగన్, నృపాలగుణధుర్యుఁడు మా వృషలుండు సమ్మదం
బలర వసింప, నిట్లు సద్భూశాధిపసంగతి సింహపీఠ ము
జ్జ్వలత వహించె; ముమ్మడి సెసంగ ముదంబు శుభత్రయంబునన్.

సమీపించి) వృషలా! జయ మగుఁగాక.

రాజు :—(సింహాసనమునుండి లేచి) ఆర్యా! చంద్రగుప్తుఁడు నమస్కరించుచున్నాఁడు. (పాదములపైఁ బడును)

చాణ :—(చేతితోఁ బట్టుకొని) లెమ్ము, వత్సా! లెమ్ము.

శా. గంగాంభఃపరిపూత శీతల నగాగ్రం బాది గోచిశ్చటా
రంగద్రత్నము దక్షిణాంబునిధితీరం బెల్లగా మూఁగి, రా
సింగంబుల్ గలఁతిర్ గుములుములుగా శీర్షాగ్రరత్నావళిన్
సింగారించుతఁ ద్వత్పదాంగుళిదళోత్సిక్తాంతరాళాంతముల్.

రాజు :—ఆర్యుల యనుగ్రహమువలన నిది యంతయు ననుభవించుచునే యున్నాఁడను. ఆర్యులవారు కూరుచుందురుగాక.

(ఇరువురును యథార్హముగాఁ గూరుచుందురు.)

చాణ :—వృషలా! మమ్ము నెందులకై పిలువనంపితివి?

రాజు :—ఆర్యా! తమదర్శనముచేఁ గృతార్థుఁడ నగుటకు.

చాణ :—(చిఱునగవుతో) వృషలా! యీ వినయము నట్లుండనిమ్ము. ప్రయోజనము లేనిదే ప్రభువు లధికారములో నున్నవారిని బిలువనంపరుగదా?

రాజు :—ఆర్యా? కౌముదీమహోత్సవము నిషేధించుటలో నేమి ఫల ముండు? నని తాము తలంచితిరి.

చాణ :—(చిఱునవ్వు నవ్వి) మమ్ముఁ బిలువనంపినది యాక్షేపించుటకన్నమాట.

రాజు :—కాదు, కాదు; విన్నవించుటకు.

చాణ :—మంచిది; అట్లైనచో విన్నప మందవలసిన గురువుల యభిరుచులను శిష్యుఁడు తప్పక శిరసావహింపవలసియున్నది.

రాజు :—అవును; నిశ్చయమే; సందేహ మే మున్నది? అయినను ఆర్యు లెన్నఁడుగూడఁ బ్రయోజనము లేనిదే యేపని సైసను గావింపరు.—

చాణ :—వృషలా ! చక్కఁగా గ్రహించితివి. ప్రయోజనము లేనిదే చాణక్యుఁడు కలలోనైనను గదలఁడు.

రాజు:—కావున నా ప్రయోజనమే ముందునో వినవలయు నను కోరిక న న్నిట్లు ప్రశ్నింపఁజేయుచున్నది.

చాణ :—వృషలా ! యర్థశాస్త్రకారులు కార్యసిద్ధి రాజాయత్తము, సచివాయత్తము, నుభయాయత్తము నని మూఁడువిధముల నుండు నని చెప్పుదురు. అందు నీ కార్యసిద్ధి సచివాయత్తమై యున్నది. అట్టిచో నీ ప్రయోజనాన్వేషణముతో నీ కేమి పని ? అందులకై మేమే పనిఁ బూనియుందుము.

(రాజు కోపముతో పెడమొగము పెట్టును. నేపథ్యమునుండి వైతాళికులు చదువుదురు.)

మొదటివాఁడు :—

సీ. కాశప్రసూన ప్రకాశ భస్మచ్ఛవి వియదంగణమునకు వెల్లవైచి,
జలధర మలినేభ చర్మ కౌశేయంబు శీతాంశునంశులఁ జికిలిసేసి
సలలిత జ్యోత్స్నా విసార కాపాల మాలిక నపూర్వమనోజ్ఞలీలఁ దాల్చి
రాజ హంసావళీ రమణీయహాసంబు నాననాంబుజమున నలవరించి
తే. నవశరత్కాలలక్ష్మిచందంబు నూని
వింత కాంతులఁ జిమ్ము శ్రీవిశ్వనాథు
తనువు క్లేశాపహం బయి తనరుఁగాత
మెల్లవేళలఁ దమకు రాజేంద్రచంద్ర !

సీ. తొలితెప్పవిప్పులఁ దోఁతెంచు పెనుమంపు గవియంగఁబడ నింత కలఁకనూని
రతనంపు దీపాల రవరవలకు సెగంబడనీక నిముసంబు పెడము పెట్టి
తనపనియైన దర్శన కృత్య మొనరింపఁ గడఁగుచో బరువెక్కి జడను వూని
మైవిఱుపులతోడ మలసిడు నావులింతల నశ్రుకణములఁ దొలకరించి
తే. స్వాపవిచ్ఛేదమునఁ గెంపుచాయ నలరి
ప్రోచుఁ గావుత మిము ఫణాభోగవలయ
విలస దుపధాన నాగేంద్ర తలిమతలము
విడుచు శౌరి యాకేకరవీక్షణంబు.

రెండవవాఁడు :—

మ. విధి యేదేని విశిష్టకారణమునన్ వీరోజ్జ్వలత్సారసే
వధులుం గా సృజియింప నున్మదగజవ్రాతేశులన్ వచ్చి మా
న ధనాగ్రేసరులై మృగేంద్రములు దంష్ట్రాభంగమ ట్లోర్వ రు
గ్రధృతుల్ త్వాదృశసార్వభౌములు నిజాజ్ఞాభంగమున్ భూవరా!

తే. భూషణాదిక విషయోపభోగకలనఁ
బ్రభుఁడు ప్రభుఁ డెన్నఁటికిఁ గాఁడు; పరులచేత
నపరిభూతాత్మశాసనుం డయ్యెనేని
ప్రభుఁ డగు నతండె నిన్నునుంబలె నృపాల!

చాణ :—(విని తనలో) మొదటిది విశిష్టదేవతాస్తుతిరూపమై ప్రకృత మగు శరత్కాలమును అప్రధానముగా ప్రఖ్యాపించుచున్నది. అది సరియే; గాని, యీ రెండవది యేమో నిర్ణయింపలేకున్నాఁడను. (ఆలోచించి) ఓహో! తెలిసినది. ఇది రాక్షసుని ప్రయోగము. దుర్మార్గుఁడా! రాక్షసుఁడా! అగపడుచున్నావు. కౌటిల్యుఁడు మేలుకొనియే యున్నాఁడు

రాజు :—ఆర్యా! వైహీనరీ! యీ వైతాళికుల కిరువురకును వేయి సువర్ణములను బారితోషికముగా నిప్పింపుము.

కంచుకి :—మహారాజులవారి యాజ్ఞ (ముందునకు నడచును)

చాణ :—వైహీనరీ! ఆఁగు మాఁగుము; పోవలదు. (కంచుకి భయముతో రాజువంకఁ జూచును.)

చాణ :—వృషలా! యేమి యిది? పనికిమాలినవిషయమున నింత పెద్ద మొత్తమును పాడుచేయుటయా?

రాజు :—ఆర్యు లిట్లన్ని విషయములందును నడ్డుపెట్టుచుండఁగా నా కీరాజ్యము • బంధనమువలె నున్నది గాని రాజ్యమువలె లేదు.

చాణ :—స్వాతంత్రముగాఁ దమకార్యములను విచారించుకొనలేని రాజులకుఁ దఱచుగా నిట్టిదోషములు కలుగుచుండును. నీవు

వానిని సహింపలేకున్న చో స్వతంత్రముగా నీవే నీ పనులను జూచుకొనవచ్చును.

రాజు :—ఇదిగో. మా పనులను మేమే చూచుకొనుటకు సిద్ధముగా నున్నారము.

చాణ :—మంచిది. మాకును బరమసంతోషము.

రాజు :—కానిండు ; ఇంకఁ గౌముదీమహోత్సవమును నిషేధించు టకుఁ బ్రయోజన మేమో విన నెంతుము.

చాణ :—వృషలా ! కౌముదీమహోత్సవము ననుష్ఠించుటకుఁ బ్రయోజన మేమో నేనును వినఁగోరుదును.

రాజు :—మాయాజ్ఞ యప్రతిహతముగా నెఱవేఱుట ప్రథమ ప్రయోజనము.

చాణ :—వృషలా! నాకును నీయాజ్ఞకు విఘాతముగావించుటయే కౌముదీమహోత్సవప్రతిషేధమునకుఁ బ్రథమప్రయోజనము. ఏల యన ?

సీ. లలిత తమాల పల్లవ మేచక ప్రభాచ్ఛురిత వేలావనాంతరము లగుచుఁ
జటుల విక్షేపణోద్భట తిమివ్రాత జర్ఝరితాంతరంభోభరంబు లగుచుఁ
దనరు చతుస్సముద్రములకుఁ బైపొలిమేరలదాఁకనొప్పారు నృపతు
లమ్లాన కుసుమ మాల్యంబువోలెను శిరసావహించెడు భవచ్ఛాసనంబు

తే. వృషల! నాప్రోలఁ గుంఠిత వృత్తియైన
ననుప మాజ్ఞః ప్రపూర్ణమై యలరు నీదు
రాచతీక మెంత వినయవిరాజితంబొ
ధరణిఁ జాటించు ననదృశాదర్శలీల.

ఇదిగాక మఱియొకప్రయోజనమును వినఁదలఁతువేని దానిని గూడఁ జెప్పెదను.

రాజు :—కానిండు ; వినెదము.

చాణ :—శోణోత్తరా! నీవు కాయస్థుఁడగు నచలునకు మా యుత్తరవును దెల్పి, యిచటనుండి యపరక్తులై తొలఁగి

పోయి మలయకేతువు నాశ్రయించిన భద్రభటాదులను గూర్చిన పట్టికను దీసికొనిరమ్ము.

ప్రతీహారి :—ఆర్యులవారి వుత్తరువుప్రకారమే చేస్తాను. (పోయి తిరిగివచ్చి) ఆర్యా! యిదుగో తమరు తీసుకొనిరమ్మని చెప్పిన ఆ పట్టిక.

చాణ :—(తీసికొని) వృషలా! వినుము.

రాజు :—సావధానుఁడనై యున్నాఁడను.

చాణ :—(చదువును) సుగృహీత నామధేయులగు మహారాజ చంద్రగుప్తులవారి సంగ్రామ సహచరులుగానుండి యపరక్తులై యిచటినుండి తొలఁగిపోయి వధ్యుఁడగు మలయకేతువు నాశ్రయించిన భద్రభటాదులగు ప్రధానోద్యోగుల పట్టిక. గజాధ్యక్షుఁడగు భద్రభటుఁడు, అశ్వాధ్యక్షుఁడగు పురుదత్తుఁడు, ద్వారపాలాధికారియగు చంద్రభానునకు మేనల్లుఁడగు డింగురాతుఁడు, రాజబంధువులలోనివాఁడగు మహారాజు బలగుప్తుఁడు, మహారాజులవారి బాల్యసేవకుఁడగు రాజసేనుఁడు, సేనాపతి సింహబలుని తమ్ముఁడగు భాగురాయణుఁడు, మాళవరాజు కుమారుఁడగు రోహితాక్షుఁడు, క్షత్రియబలమునకుఁ బ్రధానాధికారియగు విజయవర్మ.

రాజు :—మంచిది; వీరు మాయెడ నపరక్తులగుటకుఁ గారణము లేవో వినఁగోరెదను.

చాణ :—వృషలా! వినుము. వీరిలో గజాధ్యక్షుఁడగు భద్రభటుఁడును, అశ్వాధ్యక్షుఁడగు పురుదత్తుఁడు ననువారు స్త్రీలోలు రయ్యును, తప్పఁద్రావియు, వేఁటలకు మరగియు నేనుఁగులను గుఱ్ఱములను జక్కఁగాఁ బరామర్శింపక పోవుటచే నేను వారిని పదవులనుండి తొలఁగించి వారి జీవనమునకు మాత్ర మిచ్చున ట్లేర్పాటు గావించితిని. అందువలన వా రపరక్తులై యిచటినుండి తొలఁగిపోయి నిజాధికారములను బొందు నేర్పాటుతో మలయకేతువు నాశ్రయించిరి,

డింగురాతుఁడును, బలగుప్తుఁడుననువా రిరువురును దురాశా పీడితులై నీ విచ్చునట్టి జీవనమునకు సంతృప్తి నొందక యింత కంటె నచట నెక్కువ చిక్కు నని పోయి మలయకేతువు నాశ్రయించిరి. మీ బాల్యసేవకుఁడు గలఁడే రాజసేనుఁడు, అతఁడు మీ యనుగ్రహమువలనఁ గొలఁదికాలములోనే యత్యధికమగు ధనముతో గజాశ్వ సంపన్నమగు మహైశ్వర్యమును బొందినవాఁ డగుటచే దాని నెప్పుడు మరల లాగి కొందురో యను భయమువలన నిక్కడనుండి తొలఁగిపోయి మలయకేతువునొద్దఁ జేరినాఁడు. మఱి యింకొకడు, సేనాధిపతియగు సింహబలుని తమ్ముఁడు గలఁడే భాగురాయణుఁ డనువాఁడు; అతఁడు పర్వతకునితో మిక్కిలి స్నేహము చేసి యుండినవాఁడు గావున నాతని మీఁది ప్రేమచేత మలయకేతువునకు 'నీ తండ్రిని చాణక్యుఁడు చంపించినాఁ' డని రహస్యముగాఁ జెప్పి భయపెట్టి యాతని నిక్కడనుండి తొలఁగించినవాఁడు. ఆ తరువాత నీకుఁ గీడుచేయువారగు చందనదాసుఁడు మొదలగు వారిని మనము పట్టి దండించుచుండఁగాఁ దన తప్పునకు నేమగునో యని భయపడి యిక్కడనుండి పాఱిపోయి మలయకేతువు నాశ్రయించినాఁడు. తన ప్రాణములు గాపాడినవాఁ డనుకృతజ్ఞతచేత మలయకేతువు నాతనికిఁ దన తరువాతఁ దనంతవాఁడుగాఁ బ్రధానామాత్య పదవి ననుగ్రహించినాఁడు. ఇంక మిగిలియున్న రోహితాక్ష విజయవర్మ లనువారును మిక్కిలి దురభిమానులై నీవు మీ దాయాదుల కొసఁగు సమ్మానమునకు నోర్వలేకపోయి మలయకేతువునొద్దఁ జేరిరి. ఇవి వీ రపరక్తు లౌటకుఁ గల కారణములు.

రాజు :—ఈ విధముగా వీ రపరక్తు లగుటకుఁ గారణములు తెలిసిన వెంటనే యార్యులు ప్రతిక్రియ నేల గావింప లేదు?

చాణ:—వృషలా! ప్రతిక్రియ నొనరించుటకు వలనుపడక పోయినది.

రాజు:—ఏల? నేర్పు లేకయా? లేక యేదేని ప్రయోజన ముండియా?

చాణ:—నేర్పు లేకయేమి? ప్రయోజన ముండియే.

రాజు:—ఆ ప్రయోజన మేదో నేను వినఁగోరెదను.

చాణ:—ఇదిగో తెలిపెదను. విని చక్కఁగా గ్రహింపుము. ప్రకృతులపరక్తులైనప్పుడు వారియెడఁ గావింపవలసిన ప్రతివిధానము అనుగ్రహమును, నిగ్రహమును నని రెండువిధముల నుండును. వానిలో, ఉద్యోగములనుండి తివిచి వైచిన భద్రభట, పురుదత్తుల విషయమున ననుగ్రహ మనఁగా వారిని మరల నా పదవుల కెక్కించుటయే గదా? అట్టి వ్యసనదోషము లుండఁగా వారికే మరల నధికారము లిచ్చినచో నది సామ్రాజ్యమునకు మూలకందమగు కరి తురగ బలము నంతయు నాశము గావింపకపోదు. ఇంక డింగురాత బలగుప్తులతిలుబ్ధులు. రాజ్యము నంతయు నిచ్చినను వారికి సంతృప్తి గలుగదు. అట్టివారియెడ ననుగ్రహము సూపుట యెట్లు సాధ్యము? రాజసేనుఁడు ధనము పోవు ననియును, భాగురాయణుఁడు ప్రాణము పోవు ననియును దమకుఁ దామే భయపడినవారు. వారి విషయమున ననుగ్రహమున కవకాశమే లేదు గదా? రోహితాక్ష విజయవర్మలవిషయము గూడ నంతయే. వారు అతి దురభిమానులై మీరు దాయాదులయెడఁ జూపు బహుమానమును సహింపలేకపోయిరి. అట్టివారికి నేవిధమగు ననుగ్రహము ప్రీతిని గలిగించును? కావున నీ రందఱి విషయమునను మొదటి పక్షము పనికి రాకపోయినది. ఇంక రెండవ పక్షమగు నిగ్రహమును గూర్చి యొకమాట. మనము కొలఁదికాలముక్రిందటనే నందుల సామ్రాజ్యమునకు వచ్చితిమి. ఇట్టి మనము సంగ్రామ

సహచరులగు నందఱు ప్రధానోద్యోగులను దీవ్రదండనముచేఁ బీడించినచో నింకను నందులమీఁద ననురాగముతోనున్న ప్రకృతులకు మనయెడ విశ్వాసమే నశించిపోవును. అందువలన నా రెండవ పక్షమును పనికి రానిదే. ఈ విధముగా మనయెడ నపరక్తులై పోయినవారి నందఱను జేరఁ దీసికొని యతిశ్రద్ధతో రాక్షసుని యుపదేశముల ననుసరించుచు, మహాత్తరమగు మ్లేచ్ఛబలమును గూర్చుకొని, పితృవధామర్షితుఁడగు పర్వతకపుత్త్రుఁడు మలయకేతువు మనపై దాడివెడల నున్నాఁడు. అట్టి యీ సమయము మనకు వ్యాయామకాలముగాని, యుత్సవకాలము గాదు. అందువలన మన మిప్పుడు దుర్గసంస్కారమునకై పనిఁబూనవలసి యుండఁగాఁ గౌముదీమహోత్సవ మెందులకు?

రాజు :—ఆర్యా! తాము చెప్పినదానిలో నడుగవలసిన దెంతయేనియుఁ గలదు.

చాణ :—వృషలా! నిరభ్యంతరముగా నడుగుము. నేను చెప్పవలసినది గూడ నెంతయేనియుఁ గలదు.

రాజు :—మా యీ యనర్థమున కంతకును హేతువగు మలయకేతువు నిటనుండి పాఱిపోవుచుండఁగా నేల యుపేక్షించితిరి?

చాణ :—ఉపేక్షింపనిచో నాతనిని నిగ్రహించుటయో లేక ముందు చెప్పిన మాటప్రకారము సగము రాజ్యము నాతని కర్పించుటయో చేయవలసి యుండును. నిగ్రహించినచోఁ బర్వతకునిఁ జంపినది మనమే యని కృతఘ్నతను స్వయముగా నంగీకరించిన ట్లగును. సగము రాజ్యము నిచ్చినచోఁ బర్వతకునిఁ జంపించుటకుఁ గృతఘ్నత యొక్కటి దప్ప వేఱు ఫలము లేకపోవును. ఇట్లీ రెండు మార్గములును ననుచితములు కాఁగా నే నాతఁడు పాఱిపోవుచుండఁగా నుపేక్షించితిని,

రాజు :—మంచిది. ఈతని విషయమున నిట్లు చెప్పితిరి. కాని యీ నగరములోనేయున్న రాక్షసుని గూడ నుపేక్షించితిరే, దానికిఁ దా మేమి సమాధానము చెప్పెదరు?

చాణ :—రాక్షసుఁడు తన రాజుపైఁగల సుస్థిరమగు ననురాగముచేఁ జిరకాలమునుండియు నాతనితోఁగూడ నొక్కచోటనే నివసించి యాతని స్వభావమును జక్కఁగా గుర్తెఱిఁగిన నందానురక్తులగు ప్రకృతులకు మిక్కిలి విశ్వాసపాత్రుఁడు, ప్రజ్ఞాపౌరుషములు రెండును గూడినవాఁడు; అతనికి మిత్రబలము గలదు. అర్థబలమును సమగ్రముగా నున్నది. అట్టివాఁడు ఇచటనే పట్టణములో నున్నచోఁ దప్పక యెంతేనియు నంతఃకోపమును బుట్టించును. ఎట్లేని దూరపఱచినచో వెలుపల నేమేని పగను రెచ్చగొట్టినను నాతనిని సాధించుట యంత కష్టము గాదు. ఇందువలన నాతఁడు పాఱిపోవునప్పుడు గూడ నుపేక్షించితిని.

రాజు :—అగుఁగాక; అతఁ డిచ్చట నున్నప్పుడే యతనిపై సరియగు నుపాయములను నేల ప్రయోగింపలేదు?

చాణ :—ఏల ప్రయోగింపలేదు? ఉపాయములచేతనే గదా హృదయములోఁ గాఁడిన యలుగువలె నున్న యతనిని పెకలించి దూరము చేసితిని.

రాజు :—బలప్రయోగముచే నాతనిని బట్టియుంచవచ్చును గదా? అట్లేల గావింపలేదు?

చాణ :—వృషలా! రాక్షసుఁడుసుమా యతఁడు. బలప్రయోగమున గ్రహింపఁబూనినచోఁ దాను నశింపనైన నశించును; లేదా నీ బలములనైనను నాశనము చేయును. ఈ రెండింటిలో నేది జరిగినను మనకుఁ మేలు గాదు. ఇటు చూడుము,

మ. మనసైన్యంబులు గ్రమ్మి ముమ్మరముగా మార్కొన్న చోఁ దానె నా
శనముం బొందినఁ గోలుపోయెదవు ప్రజ్ఞాశాలి యౌనట్టి వా
ని; నతండే మనసైన్యముల్ జదిపె నేనిన్ దానునున్ గీడ; కా
వున లోఁగోఁదగు నాతనిన్ వనగజంబుం బోలె సోపాయతన్.

రాజు :—మేము మాటలలోఁ దమమాటలను మించఁజాలము; కాని యన్ని విధములనుగూడ నమాత్యరాక్షసుఁడే మిక్కిలి కొని యాడఁదగినవాఁడు.

చాణ :—నీవు కావని వాక్యశేషము. వృషలా! అతఁడు చేసిన దేమో కొంచెము చెప్పుము. వినెదము గాక.

రాజు :—చెప్పెదను వినుఁడు: ఆమహాత్ముఁడే గదా?

ఉ. కుత్తుకఁ గాలు వెట్టి మనకుం గయికోలగు పట్టణంబునన్
జిత్తము వచ్చినంతకు వసించెఁ; బయిన్ జయఘోషణాదులన్
మొత్తె బలంబులం గొనక; మోహమునం బడఁద్రోసె నీతి మా
చిత్తము నమ్మఁగాఁ దగిన స్వీయుల నేనియు నమ్మకుండఁగన్.

చాణ :—(పెద్దగా నవ్వి) ఓహో! ఇదియా రాక్షసుఁడు చేసినది? నే ననుకొంటిని గదా 'నేను నందుని బెకలించి నిన్ను భూమండలమున రాజాధిరాజపదమున కెక్కించి నట్లే యాతఁడును నిన్నుఁ బెకలించి మలయకేతువును భూమండలమున రాజాధిరాజపదమున కెక్కించెనేమో' యని.

రాజు :—దీని కంతకును గారణము వేఱు. ఇందుఁ దాము చేసిన దేమున్నది?

చాణ :—ఓరి మత్సరగ్రస్తుఁడా!

శా. చండక్రోధ విఘంచితాంగుళిశిఖా సమ్ముక్త చూడాత్త సం
ధుండై యెల్లరు జూడ శత్రుకుల మున్మూలింప దీక్షించి, యె
వ్వం డేకోన శతైకకోటి ధనగర్వగ్రంథులన్ నందులన్
జెండెన్ రాక్షసుఁ డారయన్ బలిపశుచ్ఛేదంబుగా నెల్లరన్?

రాజు :—ఎవఁడా? నందకుల ద్వేషియగు దైవము.

చాణ :—తెలివిలేనివారు దైవమును బ్రమాణ మొనరింతురు.

రాజు :—తెలివికలవారు ఆత్మస్తుతికిఁ బాలుపడరు గూడ.

చాణ :—(కోపముతో) వృషలా! భృత్యునిమీఁదికి వచ్చినట్లు మామీఁదికిఁగూడ రాఁ జూచుచుంటివికా?

మ. పరువుల్ వాఱు నిబద్ధమైనశిఖ విప్పం గేలిదే కెండియున్;
మరలన్ జిందులు ద్రొక్కు నియ్యది ప్రతిజ్ఞన్ బూనఁ బాదంబు; ము
మ్మరు లా నందులు వంశనాశ మయినన్ జల్లారు మత్క్రోధదు
ర్భరదావం బెగ రేఁపఁ జొచ్చి తివ పాపా! కాలబద్ధుండవై.

రాజు :—(ఉద్వేగముతో తనలో) ఏమీ? ఆర్యులకు నిజముగానే కోపము వచ్చెనా?

మ. చలపక్ష్మక్షుర దచ్ఛ బాష్ప జలముల్ క్షాళింపఁగా డిందినన్
జ్వలియించున్ బలె కెండి లోచనపిశంగజ్యోతి భ్రూభంగధూ
మలమై; రుద్రుని రౌద్రతాండవ మెదన్ భావించుచున్ ధాత్రి య
గ్గలపుం భీతిఁ గలంగునంగములు గ్రుంగన్ దాల్చెఁ బాదాహతిన్

చాణ :—(కృతకకోపము నుపసంహరించి) వృషలా! యెందులకీయుత్తర ప్రత్యుత్తరములు? మాకంటె రాక్షసుఁడే మిన్నయని నీవు తలంచినచో నిదిగో, ఈ శస్త్రము నాతనికే యొసంగుము. (శస్త్రమును వదలి, లేచి, ప్రత్యక్షమువలె నాకాశమునందుఁ జూడ్కి నిలిపి తనలో) రాక్షసా! రాక్షస! ఇదిసుమా కౌటిల్యుని బుద్ధి బలమును జయింపఁదలఁచు నీ బుద్ధిప్రకర్షము!

తే. కొలుతఁ జాణక్యుపై భక్తి దొలఁగఁజేసి
సుఖముగా గెల్తు మౌర్యు నంచును గడంగి
నీవు నేఁడు ప్రయోగించు నీవిభేద
మెల్ల నీ కీడునకె ఫలియించు శఠుఁడ!

(నిష్క్రమించును)

రాజు :—ఆర్యా! వైహీనరీ! యీనాఁడు మొదలుకొని చాణక్యునితో సంబంధములేకుండ చంద్రగుప్తుఁడే స్వయముగా రాజకార్యముల నిర్వర్తించు నని ప్రకృతుల కందఱకును ప్రకటము గావింపుము.

కంచుకి :—(తనలో) ఏమీ! ఉప పదము లేకుండఁగనే యీారక 'చాణక్యుని' అన్నారు. అక్కటా! నిశ్చయముగనే యధికా

రమును దొలఁగించినారు. అయినను ఈ విషయమున మహా రాజులవారి దోష మేమియు లేదు. ఏల యన,

తే. నృపతి కూడనిపని నొనరించు నేని
తప్పిద మదెల్ల సచివునితల నె నిలుచు;
మావటీఁ డొనరించు ప్రమాదమునను
గాద పో వ్యాళ మనుసడి గాంచు గజము.

రాజు :—ఆర్యా! యేమి యాలోచించుచున్నావు?

కంచుకి :—మహారాజా! మఱియేమియు లేదు; భాగ్యవశమునఁ బ్రభువులవా రిప్పుడు నిజముగాఁ బ్రభువులవా రైతి రని సంతోషించుచున్నాఁడను.

రాజు :—(తనలో) మమ్ముఁ గూర్చి యందఱు నిట్లు తలఁచుచుండఁగా నిజకార్యసిద్ధికై కాంక్షించు నార్యులకోరిక ఫలించును గాక (ప్రకాశము) ఆర్యా! త్వరగాఁ బోయి మేము చెప్పిన కార్యము నెఱవేర్పుము.

కంచుకి :—మహారాజుగారి యాజ్ఞానుసారము గావింతును.

(నిష్క్రమించును)

రాజు :—శోణోత్తరా! యీ శుష్కకలహమువలన మాకు తల నొప్పియెత్తి బాధించుచున్నది. కావున శయనాగారమునకు దారిని జూపుము.

ప్రతీ :—మహారాజులుంగారు ఇటు, ఇటు.

రాజు :—(సింహాసనమునుండి లేచి తనలో)

తే. ఆర్యువాజ్ఞను గౌరవ మతకరింప
నాకుఁ దోఁచెడుఁ బుడమి నణంగి పోవ;
నిజముగా గురుధిక్కృతి నెఱపువారి
హృదయ మది యేల సిగ్గుచే బ్రీలకుండు?

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది కృతక కలహ మను
తృతీయాంకము.

# చతుర్థాంకము

(అంతట బాటసారివేషమున నొక పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు)

పురుషుఁడు :—ఏమి ఆశ్చర్యం; ఏమి ఆశ్చర్యం.

(గేయము)

యీ రాకపోకలను యెవఁడు చేయునురా
నూకామడలకంటె దూరానికి పోయి ॥ యీరాక ॥
అరకాలు వొకచోట ఆపనీకుండాను
పరుగులూ పెట్టించు ప్రెభు వాజ్ఞ లేకుంటె ॥ యీరాక ॥

యింకపోయి అమాత్యరాక్షసులవార్ని చూస్తాను. (ముందునకు నడచి) యిదే ప్రెభువువారగు అమాత్యరాక్షసులవారి యిల్లు. (చుట్టుప్రక్కలఁ జూచి) యెవరోయీ యిక్కడ ద్వారపాలకుల్లో వుండేది ? ప్రెభువులవారగు అమాత్యరాక్షసులవారితో యిదుగో కరభకుఁడు పాటలీపుత్రాన్నించీ పరుగులమీద వచ్చివున్నాడని విన్నవించండి.

ద్వారపాలకుఁడు : —(ప్రవేశించి) అయ్యా మెల్లగా మాట్లాడండి. యిదుగో యిక్కణ్ణె అమాత్యులవారు పనుల్ను గురించి ఆలోచించడంతో నిద్దర లేకపోవడంవల్ల తలనొప్పి యెత్తి యింకా పడకగదిలోనుంచీ యివతలికి రాలేదు. అందువల్ల కొంచెంసే పుండు. సమయం దొరికినప్పుడు వారికి నీవు వొచ్చినసంగతి విన్నవిస్తాను.

కరభకుఁడు :—అయ్యా ! అట్లనే చెయ్యండి.

(అంతట పడకగదియందు రాక్షసుఁడును, శకటదాసుఁడును ప్రవేశింతురు. రాక్షసుఁడు ఆలోచనతోనుండును.)

రాక్షసుఁడు :—

చ. కొరవున వైరితోఁ బెడియువీరుల నెల్లర సంగ్రహించినన్
దిర మెద లేక దైవము విధేయము గామి దలంచి వక్రమా
నరిమతి నెంచి, 'యెట్లు గననౌ నిట నీ ఫలసిద్ధి?' యంచు రా
తిరు లనిశంబు నా కిటు గతించెడుఁ గూరుకు లేని చింతలన్.

అదిగాక,

మ. మును బీజస్థితిఁ గార్యమున్ నిలుపఁ, బెంపుం గూర్ప నద్దాని, క
క్వ్యానుకన్ గూఢము గర్భితార్థఫల ముద్భేదింప, నాపై విమ
ర్శను జేయన్, బ్రస్ఫుతార్థముల్ గుదుటఁ గూర్పన్ జూచుచున్ గ్లేశమున్
గను నీరీతిగ దృశ్యకావ్యకవియున్ మాదృగ్జనుండున్ మదిన్.

దురాత్ముఁడగు చాణక్య వటువునకు.....

ద్వార :—(సమీపించి) జయం—

రాక్ష :—పరాజయము కలుగక పోదు.

ద్వార :—అమాత్యులవారికి.

రాక్ష :—(ఎడమ కన్నదరుటను సూచించి తనలో) దురాత్ముఁడగు చాణక్య వటువునకు జయము! అమాత్యులవారికి పరాజయము కలుగక పోదు !! (ప్రకాశము) భద్రా! యేమి నీవు చెప్పఁ దలఁచినది?

ద్వార :— అమాత్యా! యిదుగో కరభకుఁడు పాటలీపుత్రాన్నుంచి వచ్చి అమాత్యులవారి దర్శనాన్ని కోరుతూవున్నాఁడు.

రాక్ష :—వెంటనే లోపలికిఁ బంపుము.

ద్వార :—చిత్తం, తమ వుత్తరువు ప్రకారం చేస్తాను.

(పోయి పురుషునియొద్దకు వచ్చి)

అయ్యా! అమాత్యులవారి దగ్గిరికి పోండి.

(అని నిష్క్రమించును)

కరభకుఁడు :—(రాక్షసుని సమీపించి) జయం, జయం, అమాత్యుల వారికి.

రాక్ష :—భద్రా! కూర్చుండుము.

కరభ :—అమాత్యులవారి ఆజ్ఞ (అని నేలపై కూర్చుండును)

రాక్ష :—(ఆత్మగతము) ఇతనిని ఏమి పనిమీఁదఁ బంపితినో పనులు మెండగుటవలన నిర్ధారణ చేయలేకున్నాఁడను (ఆలోచన నభినయించుచుండును.)

(అంతట బెత్తమును చేతఁ బట్టుకొని యొక పురుషుఁడు ప్రవేశించును)

పురు :—తొలిగిపోండి అయ్యల్లాలా తొలిగి పోండి దూరంగా తొలిగి పోండి.

(గేయము)

దగ్గరుండడం కానేకాదూ దరిసెనమైనా గాదండీ
భాగ్గెము లేనీ వారి కెన్నటికి పెబువులు కనపడరండీ
పున్నెము పండిన ఫలము నిలపగా పుట్టినోల్లు దొరలండీ
మన్నుమీద తిరిగే దేవుళ్లని మనుసున మీరెరగండీ.

(పైకి విని) యెందుకోసం యీ సద్దడం అని అడుగుతూన్నారా? యిడుగో సిన్నదొర మలయకేతులుంగారు. అమాచ్చ రాచ్చసులోరికి తలనొప్పి యెత్తిందని యిని వార్ని సూడడంకోసం యీ పక్కకు వస్తున్నారు. అందుకోసం యీ సద్దడం చేస్తున్నాను.

(అని పురుషుఁడు నిష్క్రమించును)

(పిమ్మట భాగురాయణుఁడును, కంచుకియును వెంట రాఁగా మలయకేతువు ప్రవేశించును)

మలయ :—(నిట్టూర్పు పుచ్చి తనలో) ఇది పదియవ నెల తండ్రిగారు నిర్యాణ మయి; వృథా పౌరుషాభిమానమును బూని మేము వారికి దోసెఁడు తిలోదకములను గూడ విడువక పోయితిమి. ఏల యన,

ఉ. కరముల బాదుకో నెడఁదఁ, గంకణముల్ దుముర్లై తొలంగ, నా
ర్తరవ మెసంగఁ, బయ్యెద చెఱంగులు దూల, ధరారజంబు ముం
గురులఁ గలంపఁ, దల్లులకుఁ గూడిన యీ దురవస్థ విద్విష
త్తరుణులఁ గూర్చ కంజలికిఁ దార్చ నివాపజలంబుఁ దండ్రికిన్.

అనిగదా పూర్వము మేము ప్రతిజ్ఞను గొంటిమి. కావునఁ బెక్కుమాట లేల?

తే. పరపురుషోచితంబగు భార మూని
కదనమునఁ గూలి తండ్రులఁ గలయవలయు;
లేక, తల్లుల కను సోఁకనీక లాగి
శిశుసుతులకంట నీరు గాఱింపవలయు.

(ప్రకాశము) ఆర్యా! జాజలీ! నే నొంటిగ నేపోయి యతర్కితా గమనముచే నమాత్యులవారికి సంతోషము గలిగింపఁ గోరెదను. కావున ననుయాయులగు రాజులతో వారు నా వెంట రా నక్కఱ లేదని నామాటగాఁ దెలుపుము.

కంచుకి:—కుమారుని యాజ్ఞ (పరిక్రమించి పైకిఁ జూచి) ఓహో రాజన్యులారా! యిటనుండి తమ్మెవ్వరును అనుసరింపఁ బని లేదని కుమారులవా రాజ్ఞాపించుచున్నారు. (చూచి సంతోషముతో) అహో! కుమారునియాజ్ఞ వినుటయే తడవుగా రాజులందఱును ముందుకు సాగక నిలిచినారు! కుమారా! ఇటు చూడుము.

మ. కళశం గళ్లెము లాగినన్ గుడిసి నిక్కన్ బొల్చు కందంబులన్
ఖురధారన్ మును మిన్నగల్చుచు నిలన్ గుఱ్ఱంబులన్ గొంద ఱాఁ
గిరి; యేనుంగులు మూకఘంటికల నక్కన్ నిల్వ; రాజన్యు లె
ల్లరు నీ యానతి మీఱ రంబుధులు వేలంబోలె భూమీశ్వరా!

మలయ:—ఆర్యా! జాజలీ! పల్లకివారితోఁగూడ నీవును తిరిగి పొమ్ము. భాగురాయణుఁ డొక్కఁడు మాత్రము నన్ననుసరించుఁగాక.

కంచుకి:—కుమారుని యాజ్ఞ (పల్లకివారితోఁ గూడ నిష్క్రమించును).

మలయ:—చెలీ! భాగురాయణా! భద్రభటాదు లిచ్చటికి వచ్చిన వెంటనే నాకుఁ బంపిన విన్నపములో 'మేము అమాత్యరాక్షసులను పురస్కరించుకొని యాశ్రయణీయులగు కుమారులవారిని నాశ్రయించుటలేదు. మఱి యేమనఁగా కుమారుల సేనాపతి యగు శిఖరసేనుని బురస్కరించుకొని యాశ్రయించుచున్నాము. దురాత్ముఁడగు మంత్రికి లోఁబడిన

చంద్రగుప్తునిపై నపరక్తులమై దగ్గఱఁ జేరఁదగిన గుణముల కలిమిచే నాశ్రయణీయులగు కుమారులవారిని ఆశ్రయించుచున్నాము.' అని తెలిపిరి. వారి మాటల కర్థ మేమో యెంతసే పాలోచించినను నాకు గోచర మగుటలేదు.

భాగు:—కుమారా! యిది యేమియు దుర్బోధమైన విషయము గాదు. 'విజిగీషువును, ఆత్మగుణ సంపన్నుఁడును నగువానిని ప్రియులును, హితులును నగువారిని పురస్కరించుకొని యాశ్రయింపవలయు' ననుట న్యాయ్యమేగదా?

మలయ:—అవును; కాని యమాత్య రాక్షసులవారు మాకు అందఱకంటెను ప్రియులును, హితులును గద?

భాగు:—ఇది నిశ్చయమే; అయినను ఇం దొక్క విషయ మున్నది. అమాత్య రాక్షసులవారు పగపట్టినది చాణక్యునిమీఁదఁ గాని చంద్రగుప్తునిమీఁదఁ గాదు. అందువలన నెప్పుడేని యొకప్పుడు చంద్రగుప్తుఁడు జయగర్వితుఁడగు చాణక్యుని సహింపక మంత్రిపదమునుండి తీసివేయుటయు, నాతరు వాత నితఁడును నందవంశమువాఁడే కావున నందవంశము మీఁది భక్తిచేత నేమి, చందనదాసాదులగు మిత్రులకొఱ కేమి యమాత్యరాక్షసులవారును చంద్రగుప్తునితో సంధి చేసికొనుటయు నసంభవములు గావు. అట్టి సందర్భమునఁ గుమారుఁడు తమ్ముఁగూడ విశ్వసింపకపోవునేమో యను సందేహమే వారిమాటల కర్థము.

మలయ:—యుక్తముగా నున్నది. అమాత్య రాక్షసుల గృహమునకు దారిని చూపుము.

భాగు:—కుమారా! యిటు, ఇటు, (పరిక్రమించి) ఇదే యమాత్యులవారి గృహము. కుమారుఁడు ప్రవేశించునుగాక.

మలయ:—ఇదే ప్రవేశించుచున్నాఁడను.

(ఇరువురును ప్రవేశము నభినయింతురు.)

రాక్ష :—( స్వగతము ) ఆఁ, జ్ఞప్తికి వచ్చినది. (ప్రకాశము) భద్రా! నీవు కుసుమపురమున స్తవకలశుఁడను వైతాళికుని జూచితివా ?

కరభ :—అవును; అమాత్యా ! అతన్ని చూచినాను.

మలయ: — (విని) చెలీ భాగురాయణా! కుసుమపుర వృత్తాంతము ప్రస్తావనలో నున్నది. కావున సమీపింపక విందముగాక. ఏల యన,

క. ఒక వగ మంత్రులు నృపుకడఁ
ప్రకటింతురు సత్త్వభంగభయమున; మఱి వే
ఱొకరీతి నాడుకొందురు
సకలంబును విప్పి స్వీయసల్లాపములన్.

భాగు :—కుమారుని యాజ్ఞ.

రాక్ష :—భద్రా! ఆపని నెఱవేఱినదా ?

కరభ :—అమాత్యులవారి అనుగ్రహంవల్ల నెరవేరింది.

మలయ :—చెలీ! యేమి యాపని ?

భాగు :—అమాత్యుల వృత్తాంతము దురవగాహము సుమా ! ఇంత మాత్రములోనే నిరూపించుటకు శక్యము గాదు; కుమారులు సావధానముగాఁ దుదివఱకును వినుట యుక్తము.

రాక్ష :—భద్రా ! సవిస్తరముగా విన గోరెదను.

కరభ :—విన్నవిస్తున్నాను, వినండి. అమాత్యులవారు నన్ను పంపేటప్పుడు యేమని వుత్తరువు చేశినారంటే, "కరభకా ! నీవు కుసుమపురానికి పోయి అక్కడ వైతాళికుఁడుగా వుండే స్తవకలశునితో మామాటగా, 'దుర్మార్గుఁడైన చాణక్యుఁడు రాజుగారి వుత్తరువులను తోసివేసినప్పుడంతా కోపం దెప్పించే పద్యాలతో నీవు చంద్రగుప్తుణ్ణి పొగడవాలిసింది' అని చెప్ప"మని వుత్తరువు చేసినారు.

రాక్ష :—తరువాత ?

కరభ :—తరువాత నేను కుసుమపురానికిఁ బోయి అమాత్యులవారి సందేశాన్ని స్తవకలశునికి అందించినాను. ఇంతట్లో యేం జరిగిందంటే, నందవంశానికి గలిగిన వినాశంతో మనస్సులో కుమిలిపొయ్యే పౌరు లందరికీ సంతోషాన్ని కలిగిస్తా మని చంద్రగుప్తుఁడు కౌముదీ మహోత్సవాన్ని చాటింపించినాఁడు. పట్నంలో జనమంతా శానారోజులకు తరువాత మళ్ళీ జరగ బోతూవుండే ఆ వుత్సవాన్ని మమకారంతో ఎంతో కావలసిన చుట్టం ఇంటికి వచ్చినప్పటి మాదిరిగా ఎంతో అనురాగం తోను, ఎంతో గొప్పగాను చూచుకున్నారు.

రాక్ష :—(కన్నీటితో) అక్కటా! నందమహారాజా!

తే. కుముదసమ్మోదకుఁడు చంద్రుఁ డమరు నేని
యెల్ల జగమున కానంద హేతువైన
యీవు లేకుండ నేరీతి నించుఁ గౌము
దీమహోత్సవ మకట! పృథ్వీపచంద్ర!

కరభ :—తరువాత జనాని కంతటికీ కండ్ల పండగ్గా వుండే ఆ వుత్సవాన్ని—రాజుకు యిష్టం లేకపోయినా—పాడు చాణక్యుఁడు చెయ్యగూడ దని నిషేధించినాఁడు. ఈ సమయం చూచుకొని స్తవకలశుఁడు చంద్రగుప్తుడికి పురెక్కించే పద్యాలు సాగించినాడు.

రాక్ష :—ఏమా పద్యములు?

కరభ :—('విధిచే నేదొ' మొదలగు పద్యములను చదువును.)

రాక్ష :—(సంతోషముతో) బళీ! మిత్రమా! స్తవకలశా! బళి! సరియైన కాలమున భేద బీజమును నాటితివి. తప్పక ఫలించియే తీఱును. ఏల యన,

తే. ఒక్కపెట్టునఁ దన యుత్సవోత్సుకతకు
భంగ మొనరింప, సైఁపఁడు ప్రాకృతుండు;
సర్వలోకాధికంబు తేజము వహించు
సార్వభౌముండు సయిరింపఁజాలు నెట్లు?

మలయ :—అవును; ఇది యిట్లే.

రాక్ష :—తరువాత, తరువాత ?

కరభ :—ఆ తరువాత తనవుత్తరువుకు భంగం కలగడంతో చంద్రగుప్తుఁడు ఎంతో మండిపడి ప్రస్తావవశంగా శానాదూరం అమాత్యులవారి గుణాన్ని పొగిడి పాపిష్టి చాణక్యుణ్ణి మంత్రి పదవినుంచి వూడబెరికినాడు.

మలయ :—చెలీ! భాగురాయణ! గుణప్రశంసచే చంద్రగుప్తుఁడు రాక్షసునిమీఁదఁ దనకుఁ గల పక్షపాతమును ప్రదర్శించినాఁడు.

భాగు:—కుమారా! గుణప్రశంసతోఁగాదు గాని యంతకంటెఁ జాణక్య వటువును దొలఁగించుటతో నింకను బాగుగా దానిని ప్రదర్శించినాఁడు.

రాక్ష : —భద్రా! చంద్రగుప్తునకు చాణక్యునిపైఁ గోపము గలుగుటకు ఈ కౌముదీ మహోత్సవ ప్రతిషేధ మొక్కటియే కారణమా? లేక వేతేమైనను గలదా ?

మలయ :—చెలీ! చంద్రగుప్తుని కోపమునకు మఱియొక కారణమును వెదకుటలో నీతఁడు చూచు ప్రయోజన మేమి ?

భాగు :—కుమారా! మతిమంతుఁడగు చాణక్యుఁడు కొంచెపాటి ప్రయోజనముకై చంద్రగుప్తునకుఁ గోపమును దెప్పించి యుండఁడు. కృతజ్ఞుఁడగు చంద్రగుప్తుఁడు గూడ నింత మాత్రముననే చాణక్యునియెడ గౌరవము నుల్లంఘింపఁడు. ఎల్లవిధములను సమృద్ధమగు కారణమువలన చాణక్య చంద్రగుప్తులకు విడిపాటు గలిగినచో నది శాశ్వతముగా నుండును. ఇందులకే యితఁడు కారణాంతరము నన్వేషించుట.

కరభ :—వుంది ; చంద్రగుప్తుని కోపానికి కారణం మరి వొకటి గూడా వుంది. యేమంటే, కుమార మలయకేతువు పరారి అయిపొయ్యేటప్పుడూ, అమాత్యులవారు తొలఁగిపొయ్యే టప్పుడూ, యీ౯ న చూస్తూ వూరుకున్నాడని.

రాక్షస :—(సంతోషముతో) మిత్రమా ! శకటదాసా ! చంద్రగుప్తుఁ డింక నాచేతిలోనివాఁడు కాఁగలఁడు.

శకట :—ఇప్పుడు చందనదాసునకు చెఱసాలనుండి విడుదల; మీకు ఆలుబిడ్డలతోఁ గలయిక. ఇప్పుడు జీవసిద్ధికిఁ గష్టములు తీఱుట.

భాగు :—(స్వగతము) నిశ్చయముగా జీవసిద్ధికిఁ గష్టము తీఱినది !

మలయ :—చెలీ ! చంద్రగుప్తుఁడు నాచేతిలోనివాఁడు కాఁగలఁ డనుటలో నీతని యభిప్రాయ మేమి ?

భాగు :—వే ఱేముండును ? చాణక్యునినుండి విడిపోయిన చంద్ర గుప్తుని నుద్ధరించుటలో సౌకర్యము గల దని యీతని భావము.

రాక్ష :—భద్రా ! అధికారమునుండి తొలఁగింపఁబడిన యీ వటువు ఇప్పు డెక్కడ నున్నాఁడు ?

కరభ :—అక్కణ్ణే పాటలీపుత్రంలోనే వున్నాడు.

రాక్ష :—(ఆవేగముతో) ఏమీ ! అక్కడనే యున్నాఁడా ? తపోవన మునకుఁ బోలేదా ? లేక మరల ప్రతిజ్ఞనైనను పూనలేదా?

కరభ :— అమాత్యా ! తపోవనానికి పోతాఁ డని అనుకుంటున్నారు.

రాక్ష :—మిత్రమా ! శకటదాసా ! ఇది యుపపన్నముగా లేదు. చూడుము.

ఉ. మున్ను మహీమహేంద్రుఁ డగు భూపతి యగ్రపదంబునుండి త
న్నెన్నక త్రోసినన్ మది నొకించుకయేని సహింపఁబోవి గ
ర్వోన్నతచిత్తుఁ డీతఁ డెటు లోర్చెడుఁ? దా నయి రాజుఁ జేసినన్
మన్నన లందునార్యుఁ డవమానము నీగతి నాచరించినన్,

మలయ :—మిత్రమా! చాణక్యుఁడు తపోవనమునకుఁ బోయినఁ గాని, లేక మరలఁ బ్రతిజ్ఞకుఁ బూనినఁ గాని యీతని కగు స్వార్థసిద్ధి యేమి?

భాగు:—ఇది యేమంత దుర్బోధమగు విషయముగాదు. చాణక్యుఁడు చంద్రగుప్తున కెంత దూరముగా నున్న నీతని కంత స్వార్థసిద్ధి కలదు.

శకట:—అమాత్యా! వేఱువిధముగా సందేహము నొంద నవసరము లేదు. ఇది యుపపన్నముగనే యున్నది. తాము నాలోచింపుఁడు.

మ. తనవారే తనయాజ్ఞఁ ద్రోయ నృపమూర్ధన్య స్తపాదాబ్జుఁడై
చనుమౌర్యుం డెటు సైఁచు? నుగ్రుఁడయినన్ జ్ఞాతాభిచారక్రియా
ఘన దుఃఖుండగు నవ్విటుండును బ్రతిజ్ఞాపూర్తి దై వేచ్ఛ నొం
దిన భావ్యర్థవినాశభీతిఁ గొనఁ డర్థిన్ నూత్నసంధాదృతిన్.

రాక్ష :—అవును, ఇది యిట్లే యుండును. శకటదాసా! యింక నీవు పోయి కరభకుని విశ్రమింపఁ జేయుము.

శకట:—అమాత్యుల యాజ్ఞ. (అని కరభకునితోఁగూడ నిష్క్రమించును)

రాక్ష :—నేనును గుమారుని జూడఁ దలఁచెదను.

మలయ :—(సమీపించి) నేనే యార్యులదర్శనమునకు వచ్చితిని.

రాక్ష :—(చూచి) ఓహో! కుమారుఁడు! (పీఠమునుండి లేచి) ఇదిగో పీఠము; కుమారుఁడు కూర్చుండునుగాక.

మలయ :—ఇదే కూర్చుందును. తాము నుపవిష్టులుగండు. (యథార్హముగఁ గూరుచుందురు)

మలయ :—ఆర్యా! తలనొప్పి శమించినదా?

రాక్షస :—కుమారునకుఁ గుమారశబ్దము పోయి యధిరాజశబ్దము రాకుండఁగా నాకుఁ దలనొప్పి యెట్లు శమించును?

మలయ :—తాము చేపట్టినతర్వాత నా కిది దుర్లభము గాదు; కాని మన మి ట్లెంతకాలము బలముల నెల్లఁ గూర్చుకొనియుండి యును, శత్రువ్యసనమునకై వేచి యూరకుండవలయును?

రాక్ష :—కుమారా! ఇంకను గాలహరణమున కవకాశ మెక్కడిది? విజయయాత్రకై ప్రస్థానము నొనరింపుము.

మలయ :—ఆర్యా! శత్రువ్యసన మేమైనను జిక్కినదా?

రాక్ష :—ఆహా, చిక్కినది.

మల :—ఎట్టిది యది?

రాక్ష :—సచివవ్యసనము. మఱి యేమున్నది? చాణక్యునినుండి చంద్రగుప్తుఁడు దూరము చేయఁబడినాఁడు.

మల :—ఆర్యా! సచివవ్యసనము వ్యసనమే గాదే!

రాక్ష :—కుమారా! తక్కినరాజులకు సచివవ్యసన మొకవ్యసనము గాదు; కాని చంద్రగుప్తునకుమాత్ర మట్లు గాదు.

మలయ :—ఆర్యా! యిది యిట్లు కాదు. చంద్రగుప్తునిమీఁదఁ బ్రకృతులకుఁ గల యపరాగమునకు చాణక్యునిదోషములే కారణము. అతనిని నిరాకరించినతరువాత మొదటినుండి గూడ చంద్రగుప్తునిపై ననురాగముతోనే యున్న ప్రకృతులు ఇప్పు డింకను విశేషముగా నాతనిపై ననురాగమును జూపుదురు.

రాక్ష :—కుమారా! యిట్లు గాదు. ఈ విషయమునఁ బ్రకృతులలో రెండు తెఱఁగులవా రున్నారు. వారిలోఁ గొందఱు చంద్రగుప్తుని యనుయాయులు కొందఱు నందకులముమీఁద ననురాగము గలవారు. వారిలో చాణక్యుని దోషములు చంద్రగుప్తానుయాయుల యపరాగమునకుఁ గారణములుగాని నందకులానురక్తుల యపరాగమునకుఁ గావు. వా రందఱును పితృకులమైన నందవంశమును కృతఘ్నుఁడై యీతఁడు నాశముచేసె నని * యపరాగమును, సమర్థమును నంది యుండియును దగినే యాశ్రయము లభింపక చంద్రగుప్తుని ననువర్తించుచున్నారు. శత్రువుల నున్మూలించుటకుఁ జాలినవాఁ డనిపించు నీవంటివాఁడు దండెత్తిపోయినచో

వెనువెంటనే యాతనిని వదలి నిన్నే యాశ్రయింతురు. ఈ విషయమున మేమే నిదర్శనము.

మలయ :—ఆర్యా! చంద్రగుప్తునిమీఁద దండెత్తిపోవుటకు నీ సచివ వ్యసన మొక్కటియే కారణమా ? మఱియొకటిగూడ నేమైనను గలదా ?

రాక్ష :—కుమారా! తక్కిన వెన్నియైనను నెందులకు ? ఇదియే యన్నిటికంటెను ప్రధానమైనది.

మల :—ఆర్యా! ఇదియే యన్నిటికంటెను ప్రధానమా ? ఏమీ ? యిప్పుడు చంద్రగుప్తుఁడు తన కార్యభారమును మఱియొక మంత్రిపై నుంచిగాని, లేక స్వయముగనేకాని ప్రతివిధానమును గావించుకొనలేఁడా ?

రాక్ష :—ముమ్మాటికి; కావించుకొనలేఁడు. స్వాయత్తసిద్ధులగు రాజులవిషయమున నిట్టిది సంభవించును. దురాత్ముఁడగు చంద్రగుప్తుఁడన్ననో యెప్పుడును సచివాయత్తసిద్ధిగనే యున్నవాఁడు. కన్నులు లేనివానివలె లోకవ్యవహారమును దేనినిగాని ప్రత్యక్షముగాఁ జూడనివాఁడు ; స్వయముగ నెట్లు ప్రతివిధానము నొనరించుకొనఁజాలును ? ఏల యన

శా. పాలంద్రాగడు వేళఁ దల్లియొడికిన్ బాఁపన్ దదాయత్తుఁడౌ
బాలుండట్టు లమాత్యునుండి యెడఁబాఁపన్ వానిపై నూను భూ
పాలుం డెందు నదృష్టలోకవిషయవ్యాపారమూఢాత్ముఁడై
చాలం డొక్క ముహూర్తమాత్రము సముత్సాహంబునన్ నిల్వఁగన్

మలయ :—(స్వగతము) అదృష్టవశమున నేను సచివాయత్తసిద్ధిని గాలేదు. (ప్రకాశము) ఔను ; అది నిశ్చయమే ; అయినను అభియోగకారణము లనేకము లున్నప్పుడు సచివవ్యసనమును జూచి శత్రువుపై దండెత్తిపోవువానికిఁ దప్పకుండఁ గార్యసిద్ధి గలుగును.

రాక్ష :—కార్యసిద్ధి తప్పక కలుగు ననియే కుమారుఁడు గ్రహించును గాక. ఏల యన,

సీ. సమధిక చతురంగ సైన్యుండవగు ధరాధీశుండ వీవు దండెత్తి నుండ
నందాన్వవాయంబునందలి యనురాగ మరిపురంబున వెల్లి విరియుచుండఁ
జాణక్యుఁ డధికారచలితుఁడై రాజ్యతంత్రములఁ బరాఙ్ముఖత్వమున నుండఁ
గుదురుపాటెఱుఁగని క్రొంగ్రొత్త రాచఱికమున మౌర్యుం డెదఁ గలఁగుచుండ

తే. నేను మీచేతివాఁడనై —

(అని సగముమాటలో లజ్జ నభినయించుచు)

—యొఱిఁగినంత

మార్గమాత్రంబు సకలోద్యమములఁ దెలుప
నీవు కోరుచొ తడవుగా నిలిచె మాట
నేఁడు సాధింపఁదగిన దన్నియు నృపాల !

మల :—ఇట్లిదియే దండెత్తి పోవుటకుఁ దగిన సమయ మని యార్యులు తలఁచినచో నింకను నాఁగి యుండుట యెందులకు?

సీ. అభ్రంకషాత్మమహాశాన్నత్య మేఁచి తత్కూలతుంగతను గగ్గోలుపఱుప
సంస్రవన్మదజలాసారంబు వొంగి ప్రస్యందితత్సలిలంబు డిందుపఱుప
జలధరశ్యామ నిజచ్ఛాయ లెగసి తత్తటమహీజశ్యామతను గుదింప
దంతఘంతోద్భిన్నతటపాటవము రేఁచి ఝరసమాహత తటోచ్ఛ్రియముఁ జెనక

తే. సమదఘీంకృతు లలలనిస్వనము నణఁప
స్ఫురిత సిందూరశోణత శోణసంజ్ఞ
నదము నస్మద్గజేంద్రంబు లన్నదంబు
నొకట భేధంగులను బీల్చి యుమియుఁగాక.

మ. స్వమదాంభః పరిమిశ్ర శీకర సమాసారంబు శోభిల్ల, మం
ద్ర మహాగర్జితరావముల్ సెలఁగ వింధ్యక్షోణీభృద్రాజ మం
భములన్ జిమ్మెడు మేఘమాల లన నస్మద్భద్రదంతావళీ
ఘను లుద్వృత్తగ ముట్టడిం గొనుత యింకన్ బాటలీపుత్రమున్.

(అని భాగురాయణునితోఁగూడ మలయకేతువు నిష్క్రమించును.)

రాక్ష :—ఎవరోయీ అక్కడ ?

పురుషుఁడు :—(ప్రవేశించి) అమాత్యులవారు వుత్తరువు చెయ్యండి.

రాక్ష :—ప్రియంవదకా ! జ్యౌతిషికులలో వాకిట నెవ రున్నారు ?

ప్రియం :—క్షపణకుఁడు.

రాక్ష :—(అపక్షపనమును సూచించి) ఏమీ! క్షపణకుఁడా!
ప్రియం :—జీవసిద్ధి.
రాక్ష :—ఇతఁడు బీభత్సదర్శనుఁడు కాఁడు; లోనికిఁ బ్రవేశ పెట్టుము.
ప్రియం :—అమాత్యులవారి వుత్తరువు ప్రకారం చేస్తాను.
(నిష్క్రమించును)
(అంతట క్షపణకుఁడు ప్రవేశించును)
క్షపణకుఁడు :—
(గేయము)
అజ్ఞానము రోగం - బుద్ధుల
విజ్ఞానము వైద్యం;
మొదటిలో కటువే తథ్యం - కాంచే
తుద కది పరమం పథ్యం;
గమనించండీ వుపదేశం - మది
శ్రమ దొలగించే - ఆదేశం.
(సమీపించి) శ్రావకా! ధర్మలాభం కలుగుఁగాక.
రాక్ష :—భదంతా! మేము దండెత్తి పోవుటకుఁ దగిన దినమును నిరూపింపుము.
క్షపణ :—(ఆలోచించి) శ్రావకా! నిరూపించినాను. పున్నమ తిథి; మధ్యాహ్నంనించీ అన్నివిధాలా శుభస్కరంగా వుంటుంది. ఉత్తరం దిక్కునించీ దక్షిణం దిక్కుకు ప్రయాణం చేసే మీకు నక్షత్రం దక్షిణం. సూర్యుడా అస్తమయం కాబొయ్యే సమయం. సంపూర్ణ మండలంతో చంద్రునికి వుదయమున్నూ. బుధుని లగ్నం. కేతువు వుదయించి వెంటనే అస్తమిస్తాడు. ప్రయాణానికి దివ్యంగా వుంటుంది.
రాక్ష :—భదంతా! తిథియే శుద్ధముగా లేదే!
క్షపణ :—శ్రావకా! 'ఏకగుణా తిథిః, చతుర్గుణం నక్షత్రం, శత గుణ శ్చంద్రః' అని జ్యౌతిష్కుల సిద్ధాంతం. కాబట్టి సౌమ్య

గ్రహాంతో లగ్నం దివ్యంగా వుంటుంది గనక దుర్లగ్నాన్ని విడిచిపెట్టి చంద్రబలంతో సాగిపోయినారంటే మహత్తర మైన లాభం కలుగుతుంది.

రాక్ష :—భదంతా! ఇతర జ్యోతిషికులతోఁ గూడ సంప్రతింపుము.

క్షపణ :—మీరే సంప్రతించండి; నేను పోతున్నాను.

రాక్ష :—ఏమీ! భదంతునకుఁ గోపము వచ్చినదే!

క్షపణ :—మీమీఁద భదంతునికిఁగాదు కోపం.—

రాక్ష :—ఇం కెవరికి?

క్షపణ :—భగవంతుఁడు కృతాంతునకు; లేకుంటే స్వపక్షాన్ని విడిచి పరపక్షాన్ని ప్రమాణంగా గ్రహిస్తారా?

(అని నిష్క్రమించును)

రాక్షస :—ప్రియంవదకా! ప్రొద్దెంత యైనది?

ప్రియం :—సూర్యుఁడు కుంకఁబోతూ వున్నాడు.

రాక్ష :—అహో! సూర్యభగవానుఁడు అస్తమయముగానున్నాఁడు. ఔరా!

మ. అనురాగం బిగురొత్త భానుఁ డుదయం బౌకేళి ఛాయామిషం
బున మున్మున్నగఁ బాఱు నియ్యుపవనీభూజంబు లస్తంగతిన్
గనుచో నాతని వీడి వెన్క కరుగంగా సాఁగెడున్; మున్ను
ల్చిన సేనిన్ ద్వజియింతు రెయ్యెడ గతశ్రీకున్ బతిన్ సేవకుల్.

ఇది రాక్షసోద్యోగ మను

నాల్గవ యంకము.

# పంచమాంకము

(అంతట ముద్రవైచిన జాబును, సొమ్ముల పెట్టెను చేతఁ బట్టుకొని సిద్ధార్థకుఁడు ప్రవేశించును)

సిద్ధా: —ఏమాశ్చర్యం! ఏమాశ్చర్యం!!

(గేయము)

చెప్ప చిత్రమైన తీరేరా, చాణక్యనీతి
తప్పకుండా ఫలము చూపేరా,
గొప్ప బుద్ధి యేటిని రను
దొప్పగా దేశము కాలము
గొప్ప కడవలతోటి నించీ
తప్పకా పోసినా యెదిగీ
తప్పకుండా ఫలము జూపేరా, చాణక్యనీతి
చెప్ప చిత్రమైన తీరేరా.

అందుకోసం సందేహ పడవాలిసిన అవసరమే లేదు. నేను చాణక్యులవారు మొట్టమొదల రాయించి అమాత్య రాక్షసుని వుంగరంతో మొహారు వేసిన ఆ జాబునూ, అదే మొహార్ గొట్టిన సొమ్ముల పెట్టెనూ తీసుకోని పాటలీపుత్రానికి ప్రయాణ మయినానుగదా! దాన్నే సాగిస్తాను. (ముందునకు నడచి చూచి) ఓహో! క్షపణకుఁ డొస్తున్నాడే! యీన అవుపడడం మంచి శకునం గాకపోయినా నష్టంలేదు. అదీ వొకందుకు మంచిదే. వొచ్చిందాకా నిలుస్తాను.

(క్షపణకుఁడు ప్రవేశించి)

(గేయము)

అర్హతులకు మొక్కుము
పాపము
అవల దోసి నిక్కుము
అతి గంభీరమ్మైన బుద్ధితో

అతిలోకము లైనట్టి లోకులను
ప్రతి లేని నిర్వాణపదమ్ముకును
సతతము పొందగ జాలే సురులవు
అర్హతులకు మొక్కెదము.

సిద్ధా :—భదంతా! దండం పెడుతున్నాను.

క్షపణ :—శ్రావకా! ధర్మం సిద్ధించుగాక. (సిద్ధార్థుని తేరిపారం జూచి) శ్రావకా! యెక్కడికో ప్రయాణమైన ట్లవుపడుతున్నావే?

సిద్ధా :—ఈ సంగతిని భదంతు డెట్లా తెలుసుకున్నాడు?

క్షపణ :—శ్రావకా! ఇక్కడ తెలుసుకో వల్సిందేముంది? నీకు దోవను జూపించే యీాజాబే తెలియజేస్తూవుంది.

సిద్ధా :—భదంతుఁడు సరిగానే తెలుసుకున్నాఁడు. నేను నిజంగానే వేఱే దేశానికి పోవాల్నని ప్రయాణమైనాను. సరేగాని యీవాళ రోజుబలం యెట్లావుందో భదంతుఁడు సెల విహ్వాలె.

క్షపణ :—శ్రావకా! నెత్తి గొఱిగించుకున్నానిక నక్షత్రాన్ని అడుగుతున్నావు?

సిద్ధా :—కాదు భదంతా! యిప్పుడు మునిగిపోయిం దేముంది? నీవు చెప్పు అనుకూలంగావుంటే పోతాను; లేకపోతే వెనక్కు తిరిగి పోతాను.

క్షపణ :—శ్రావకా! రోజు అనుకూలంగా వున్నా గూడా యిప్పు డీమలయకేతుకటకాన్నించీ బయటికి పొయ్యేదానికే వీల్లేదు.

సిద్ధా :—భదంతా! యెందువల్లనో చెప్పు.

క్షపణ :—శ్రావకా! చెప్తాను; విను. మొదట్లో యెవరైనా యిక్కణ్ణించీ పోవడానిగ్గాని, రావడానిగ్గాని యేమీా అడ్డంకి లేకుండా వుండేది. కాని యిప్పుడు పాటలీపుత్రానికి శానా దగ్గరగా వుండడంవల్ల ముద్ర వేయించుకోకుండా యెవఁడైనా సరే బయటికి పోవడానిగ్గాని, లోపలికి రావడానిగ్గాని అధికా రులు ఒప్పుకోవడం లేదు. కాబట్టి భాగురాయణుఁడు నీకు

ముద్ర వేసివున్నట్లయితే నిర్భయంగా పో, లేకపోతే కిక్కుఱు మనకుండావుండు. తాణావాళ్ళ చేతుల్లో చిక్కి కాళ్ళు చేతులూ కట్టేయించుకోని కచ్చేర్లోకిమాత్రం పోవాకు.

సిద్ధా:—భదంతునికి తెలేదా యేమి? నేను అమాత్యరాక్షసుల వారి సేవకుణ్ణని. అందువల్ల మొహరేయించుకోకుండా పోతే మాత్రం నన్ను అడ్డగించేదానికి యెవరికి చాతనౌతుంది?

క్షపణ:—శ్రావకా! రాక్షసునివానివైనా సరే, పిశాచంవానివైనా సరే, ముద్ర వేయించుకోకుంటేమాత్రం నీకిక్కణ్ణించీ దాటి పొయ్యేదానికి వుపాయం లేదు.

సిద్ధా:—భదంతా, కోపపడవాకు, నాకు కార్యం నెరవేరుతుం దని దీవించు.

క్షపణ:—శ్రావకా! పో; నీకార్యం నెరవేరుతుంది. నేనూ భాగురాయణునిదగ్గిరికి పోయి ముద్రకోసం అడుగుతాను.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

---

(అంతట భాగురాయణుఁడును, అతనివెంట నొక పురుషుఁడును ప్రవేశింతురు.)

భాగు:—(తనలో) ఔరా! చాణక్యులవారినీతి యెంత విచిత్రముగా నున్నది!

మ. తలఁగూపున్ బలుమాఱుఁ, గార్య్యగతి దుర్దర్శాత్మయై బల్మఱున్,
బలుమాఱున్ గొనవాఱుఁ, బల్మఱుఁ గనున్ గార్యస్థితిన్, బాపురే!
పలుమా ఱొందెడు బీజనష్టి, ఫలసంపద్ధాత్రి యై బల్మఱున్
దిలకింపన్ బుధనీతి తా నియతిరీతిన్ బోల్చుఁ జిత్రాకృతిన్

(ప్రకాశముగా) భాసురకా, కుమారునకు నేను దూరముగా నుండుట యిష్టము గాదు. కావున నాకును నీ యాస్థాన మండపమునందే పీఠమును వేయుము.

పురు:—ఇదిగో పీఠం యిక్కడ వుంది. మంత్రులుంగారు కూరుచోండి.

భాగు:—(కూర్చుండి) భాసురకా! ముద్రకొఱకై యెవరైనను నన్ను చూచుటకు వచ్చినచో వారిని లోపలికి ప్రవేశపెట్టుము.

పురు:—చిత్తం. మంత్రులుంగారి వుత్తరువును నెరవేరుస్తాను.

(నిష్క్రమించును.)

భాగు :—మామీఁద నింతటిస్నేహమును నెఱపు కుమార మలయకేతువును మేము మోసగింపవలయును. అబ్బా! యెంత చేయరాని పని యిది! కాని,

చ. కులమును సిగ్గుఁ గీర్తిఁ దుదకుꠗ దగుమానముఁ ద్రోసి సాల్గురూ
కల కయి విత్తవంతులకుఁ గాయము నమ్మి విచారలేశముꠗ
దలఁగి తదాజ్ఞ సేయు పరతంత్రుఁడు మే లిది కీడ టన్న చిం
తలకుఁ దొడంగి యేగతి నొనర్చెడు నేఁడు విమర్శనక్రియన్ !

(అంతటఁ బ్రతీహారి వెంట రాఁగా మలయకేతుఁడు ప్రవేశించును)

మలయ :—(తనలో) ఔరా! రాక్షసునిగుఱించి యాలోచించిన కొలఁదియు వికల్పములు మెండై కలఁతనొందెడు నా బుద్ధి యేనిర్ణయమునకును రాకున్నది! ఏల యన,

ము. ధృత నందాన్వయ రాగ బంధ దృఢ భక్తిꠗ నందవంశ్యుం డనా
దృతచాణక్యుఁడు మౌర్యుఁ డాఢ్యుఁ డని సంధింపంగ భావించునో ?
మతి మాభక్తిగుణంబు సుస్థిరము సంభావించి సత్యప్రతి
జ్ఞత దీపించునొ ? యం చెడంద సుడియుꠗ జక్రాధిరూఢాకృతిన్.

(ప్రకాశముగ) విజయా! భాగురాయణుఁ డెక్కడ !

ప్రతీహారి :—కుమారా! ఇదుగో యిక్కణ్ణే కటకంలోనించీ బయిటికి పోవాల్నునుకునేవాళ్లకు ముహురు వేసియిచ్చే పని మీాద వున్నాడు.

మలయ:—విజయా! ఒక్కముహూర్తము సేపు కదలకుండ నిలువుము. నావైపునకు దిరుగకముందే వెనుకగాఁ బోయి యితని కన్నులను మూయుదును.

ప్రతీ :—చిత్తం, అట్లనే చేస్తాను.

భాసురకుఁడు :—(ప్రవేశించి) ఆర్యా యిదుగో వొక క్షపణకుఁడు ముహురుకోసం మంత్రులుంగారిని చూడ గోరుతున్నాఁడు.

భాగు :—లోనికి రానిమ్ము.

భాసు :—చిత్తం, చిత్తం (నిష్క్రమించును)

క్షపణకుఁడు: —(ప్రవేశించి) శ్రావకా! నీకు ధర్మం సిద్ధించుగాక.

భాగు :—(చూచుట నభినయించి తనలో) ఓహో! రాక్షసుని మిత్రుఁడు జీవసిద్ధి! (ప్రకాశముగా) భదంతా! ఏదో రాక్షసుని పని మీఁదనే పోవుట లేదుగద?

క్షపణ:—(చెవులు మూసికొని) పాపం శాంతించనీ; శ్రావకా! యెక్కడ, రాక్షసుని పేరుగూడా వినపడకుండా వుంటుందో అక్కడికి పోతున్నాను.

భాగు :—మిత్రునిమీఁద బలవత్తరమగు ప్రణయకోపము కలిగిన ట్లున్నది! అందులకు భదంతునకు రాక్షసుఁడు చేసిన యపరాధ మేమి?

క్షప :—శ్రావకా! రాక్షసుఁడు నా కేమి కీడు చెయ్యలేదు. పరమ దౌర్భాగ్యుణ్ణై అన్నికీళ్ళూ నాకు నేనే చేసుకొన్నాను.

భాగు :—భదంతా! నా కంతకంతకును కుతూహలమును పెంచు చున్నావు.

మలయ :—(స్వగతము) నాకుఁగూడ.

భాగు :—వివరముగాఁ జెప్పుము. వినఁగోరెదను.

మలయ :—(స్వగతము) నేనుఁగూడ.

క్షపణ :—శ్రావకా! దీన్ని వినడం మీ కెందుకులే.

భాగ :—అంతటి రహస్యమైనచో నుండనిమ్ము.

క్షపణ :—అబ్బే, రహస్యమూ గాదు.

భాగు: —రహస్యము గానిచో చెప్పుము.

క్షపణ :—శ్రావకా! యిది రహస్యంగాదు, కాని—అయినప్పటికీ నేను చెప్పను.

భాగు:—నేనుగూడ ముద్ర నియ్యను.

క్షపణ:—(తనలో)ఇంతగా అడుగువానికి నిప్పుడు చెప్పుట యుక్తము. (ప్రకాశముగ) ఇంకేం జేసేది? ఇదుగో చెప్తున్నాను వినండి. పూర్వం పాటలీపురంలో వుండేరోజుల్లో నిర్భాగ్యుడికి నాకు మొట్టమొదటగా రాక్షసునితో స్నేహం కలిసింది. అప్పట్లో రాక్షసుడు మహారహస్యంగా విషకన్యను ప్రయోగంజేసి దాంతో పర్వతమహారాజును చంపించినాడు.

మలయ :— (కన్నీటితోఁ దనలో) ఏమీ? నాయనను జంపినది రాక్షసుఁడా! చాణక్యుఁడు గాఁడా?

భాగు :—తరువాత?

క్షపణ :—దానిమీఁద రాక్షసునికి మిత్రుఁణ్ణని నన్నా పాపిష్టి చాణక్యుఁడు యెంతో అవమానం చేసి వూళ్ళోనుంచి వెళ్ళగొట్టించినాడు. రాచకార్యాల్లో మహానేర్పరైన రాక్షసుడు మళ్లీ దేనికో - నన్ని జీవలోకాన్నించి వెళ్లగొట్టించడానికే కామాలు - అట్లాటిదానికే మొదలుపెడుతున్నాడు.

భాగు :—భదంతా! మొదట మాట యిచ్చినప్రకారము సగము రాజ్యము నిచ్చుటకు నిష్టములేక దుర్మార్గుఁడగు చాణక్యుఁడే యీ యకార్యమును గావించెను; గాని రాక్షసుఁడు గా దని మేము వినియుంటిమే!

క్షపణ :—(చెవులు మూసికొని) పాపము శమించనీ, చాణక్యునికి విషకన్యపేరైనా తెలీదు.

భాగు :—భదంతా, యిదిగో ముద్ర నిత్తును. కాని, కుమారునికి వినిపింతువుగాని రమ్ము.

మలయ :—(కన్నీటితో సమీపించి)

తే. వింటి నెచ్చెలి! వీనుల వ్రీల్చు పలుకు
పగతునిం గూర్చి యాతని పరమహితుఁడు
పలుక; జనకవధవ్యథ జ్వలితమయ్యె
నేఁడు చిరమయ్యు నిదె ద్విగుణీకృతముగ.

క్షపణ :—(తనలో) ఓహో! దురాత్ముడు మలయకేతువు విన్నాడు. బళిబళి! నాపని చక్కగా నెరవేరినది.

(నిష్క్రమించును)

మలయ :— (ప్రత్యక్షమునవలె నాకాశమునఁ జూడ్కి నిలిపి) రాక్షస! రాక్షస! యెంతటి యన్యాయమున కొడిగట్టితివి ?

ఉ. ఈతఁడు నాకుఁ గూర్చు నని యెంతయు నెమ్మది నమ్మి యూఁటగా
నీతల నెల్లకార్యములు నిల్పినవానిని దండ్రి బాంధవ
వ్రాత కవోష్ణ బాష్ప కణవార యుతో నిలఁ గూల వ్రాల్చి వి
ఖ్యాతిగ రాక్షసుండ వయితయ్య! యథార్థము గాఁగ రాక్షసా!

భాగు :—(తనలో) 'రాక్షసుని ప్రాణములను గాపాడవలసిన' దని యార్యుని యాదేశము. కానిమ్ము; ఇట్లు చేసెదను. (ప్రకాశముగా) కుమారా! ఆవేశము నందకుము. కుమారుఁడు పీఠముపైఁ గూరుచున్నచో తరువాత నించుక విజ్ఞాపనము సేయఁదలచియున్నాఁడను.

మలయ :—(కూర్చుండి) మిత్రమా! నీవు చెప్పఁదలఁచిన దేమి ?

భాగు :—కుమారా! అర్థశాస్త్రమున వ్యవహరించువారికి 'వీరు శత్రువులు వీరు మిత్రులు, వీ రుదాసీనులు' నను వ్యవస్థ కార్యవశమువలనఁ గలుగుచుండునుగాని తక్కిన సాధారణ జనులకువలె తమతమయిష్టము ననుసరించి గాదు. అందువలన ఆకాలములో సర్వార్థసిద్ధిని రాజుగాఁ జేయవలయు నని తలఁచుచున్న రాక్షసునకు సుగృహీతనామ ధేయుఁడగు మహారాజు పర్వతేశ్వరుఁడే చంద్రగుప్తునికంటెను బలీయుఁడై యుండుటచే నిజకార్యమునకుఁ బ్రతిబంధమై ప్రధానుఁడగు శత్రుఁడై యుండెను. అట్టి పర్వతేశ్వరునియెడ. రాక్షసుఁ డిట్టి కార్యము నొనరించెననుటలో నా కేమియు నంతగా దోషము కనుపడుట లేదు. కుమారుఁడే యాలోచిఁచునుగాక.

తే. హితుల నహితులఁ గావించు; హితులు గాఁగ
కలుపు నహితులఁ గార్యవశమునఁ జేసి
నీతి మనుజుని మనియుండనే గతంబు
మఱచు జన్మాంతరమునకు మార్ప నేర్చు.

కావున నీవిషయమున రాక్షసునిమీఁద నేరము నారోపించుట యుక్తము గాదు సరిగదా, నందరాజ్యము మనచేతికిఁ జిక్కునంతవఱకును నాతని చేపట్టియుండుటగూడఁ గర్తవ్యము. ఆపిమ్మట నాతనిని బరిగ్రహించుటయో, లేక పరిత్యజించుటయో కుమారుని యిష్టానుసారము గావింపవచ్చును.

మలయ :—అవును ; మిత్రమా, చక్కఁగా నాలోచించితివి. ఏలయన మన మిప్పు డమాత్యుని జంపినచోఁ బ్రకృతిక్షోభము గలుగును. ప్రకృతులు క్షోభించినచో విజయముగూడ సంశయాస్పద మగును.

పురుషుఁడు :—(ప్రవేశించి) జయం, జయం. కుమారులవారికి. తమ ఠాణాదారు దీర్ఘచక్షువు కుమారులుంగారికి విన్నవిస్తున్నాఁడు. 'ఇదిగో జాబుతోగూడ ఒకమనిషి మొహరు లేకుండా కటకంలోనించీ బయటికి పోతూంటే మేము పట్టుకున్నాము. దేనరవారు స్వయంగా పరీక్షించవలసింది' అని.

భాగు :—భద్రా ! లోపలికి పిలుచుకొనిరమ్ము.

పురు :—చిత్తం, అట్లనే చేస్తాను (నిష్క్రమించును)

(పిమ్మట నొక పురుషుఁడు వెంట వచ్చుచుండఁగా బద్ధుఁడగు సిద్ధార్థకుఁడు ప్రవేశించును.)

సిద్ధా :—(తనలో).

(గేయము)

మన్న నాజ్ఞాపింపు నిక్కే మా
మావంటి వారిక
కన్నతల్లికి నీకు మొక్కేమా
ఓ.స్వామి భక్తీ॥ కన్నతల్లికి॥

తప్పు వొప్పు లనే తంటా
లెప్పుడూ రానీయ వంటూ
చెప్పినా పని జేసి నీదయ
యెప్పుడూ నా సామ్మె నంటూ ॥ మన్న న ॥

పురుషుడు :—(సమీపించి) ఆర్యా! యిదుగో ఆమనిషి.

భాగు :—(చూచి) భద్రా! ఇతఁడేమి యెక్కడ నుండియైన నిచటికిఁ గ్రొత్తగా వచ్చినవాఁడా? లేక యిచటనే యెవరియొద్ద నైనఁ గొలువులో నున్నవాఁడా?

సిద్ధా :—ఆర్యా! నేను అమాత్య రాక్షసులవారిదగ్గర కొలువులో వున్నవాణ్ణే.

భాగు :—అటు లైనచో ముద్ర తీసికొనకుండఁగనే యేల కటకము నుండి వెలుపలకు పోవుచున్నావు?

సిద్ధా :—ఆర్యా! పని మిక్కిలీ అవుసరంగా వుండడంవల్ల తొందర పడి పోవాల్సివచ్చింది.

భాగు :—రాజశాసనమునుగూడ నుల్లంఘించునంతటి యవసరమగు పని యెట్టిది?

మలయ :—మిత్రమా! భాగురాయణ, ఉత్తరము నిట్లందు కొనుము.

భాగు :—(సిద్ధార్థుని చేతినుండి యుత్తరమును తీసికొని) కుమారా! యిదిగో ఉత్తరము (ముద్రను చూచి) ఈ ముద్రపై రాక్షసుని పేరున్నది!

మలయ :—ముద్ర చెడిపోకుండ విప్పి యుత్తరము నిట్లు చూపింపుము.

(భాగురాయణుఁ డట్లే చేసి చూపించును.)

మలయ :—(చదువును.)

'స్వస్తి, ఒకానొక చోటినుండి యొకానొకఁడు ఒకానొక చోటనున్న యొకానొక మహాభాగునకుఁ దెలుపుట.

సత్యవచను లగు తాము మా పగతుని ద్రోసివైచి తమ సత్యసంధతను గనుపఱచినారు. మఱి యిప్పుడు తమతో మొట్ట మొదట నేకకార్య సంసిద్ధికై సంధికి నొడంబడియుండిన యీనా మిత్రులకుఁ గూడ మొదట నిచ్చిన మాటప్రకారము సంధిమూల్య మును ప్రతిపాదించి సత్యసంధులగు తాము సంతోషముఁ జేకూర్ప వలసి యున్నది. ఆపై వీరును ఇట్లు మనవైపునకుఁ ద్రిప్పుకొనఁ బడినవారై స్వాశ్రయ వినాశము నొనరించి తమ పరిపణన ప్రదా తను సేవింతురు. వీరిలో కొందఱు పగతుని భాండారమును, నేనుఁగు పిండును గోరియు, తక్కినవారు దేశమును గోరియు నున్నారను నీ విషయమును సత్య సంధులగు తాము మఱచియుండక పోయినను మేమును గుఱుతునకుఁ దెత్తుము. శ్రీమంతులు పంపిన యాభరణ ములు మూఁడును నందినవి. మేమును లేఖము వట్టిదిగాకుండ నేదో కొంచెము పంపితిమి. దానిని పరిగ్రహింపఁ గోరెదము. మా సందేశమును ఆప్తతముఁ డగు నీ సిద్ధార్థకునితోఁ జెప్పి పంపితిమి. దానిని గూడ వినఁగోరెదము.'

మిత్రమా! భాగురాయణ! యేమి యీ యుత్తరము?

భాగు :—భద్రా! సిద్ధార్థకా! యెవరికి, ఈ లేఖ?

సిద్ధా :—ఆర్యా! నాకే తెలేకుండా వుంది.

భాగు :—ఓరి, దూర్తుఁడా! లేఖను దీసికొని పోవుచున్నావు; ఎవరికైనదియు నీకే తెలియకుండ నున్నదా? ఇదంతయు నట్లుండనిమ్ము. కాని నీతోఁ జెప్పిపంపిన మాటలను నీవు వినిపింపవలసిన దెవరికి?

సిద్ధా :—(భయమును నటించుచు) తమరికి.

భాగు :—ఏమీ! మాకా?

సిద్ధా :—తమరికి పట్టుబడడంతో -నేనేం జెప్పవాల్నో- నాకే తెలే కుండా వుంది.

భాగు :—(కోపముతో) ఇదిగో ఇప్పుడే తెలిసికొందువు. భాసురకా, వీనిని బయటికిఁ దీసికొనిపోయి చెప్పునంతవఱకును దన్నుఁడు.

పురుషుడు :—చిత్తం, అట్లనే చేస్తాను. (సిద్ధార్థకుని పిలుచుకొని పోవును. మరలఁ బ్రవేశించి) ఆర్యా! ఇదిగో ముహూర్తేశుండే యీ సొమ్ములపెట్టె వాణ్ణి కొడుతుంటే వాని చంకలోనించి కింద బడింది.

భాగు :—(చూచి) దీనిపైఁగూడ రాక్షసుని ముద్రయే యున్నది.

మలయ :—ఇది లేఖ వట్టిదిగాకుండఁ బంపినది గావచ్చును. దీనినిఁ గూడ ముద్ర చెడకుండ విప్పి చూపింపుము.

(భాగురాయణుఁడట్లే చేసి చూపించును.)

మలయ :—ఏమీ! యీ యాభరణము నేను స్వయముగా నా శరీరముమీఁదినుండి తీసి రాక్షసునకుఁ బంపినది! స్పష్టముగాఁ దెలియుచున్నది. ఈ యుత్తరము చంద్రగుప్తునకు.

భాగు :—కుమారా! యిదిగో మన సందేహ మిప్పుడే తీఱును. భద్రా! యింకను దన్నుఁడు.

పురుష :—చిత్తం. (పోయి తిరిగివచ్చి) ఆర్యా! తంతూవుంటే వీడు అంతా దేవరవారికే సొంతంగా మనవి చేసుకుంటా నని చెప్తున్నాఁడు.

మలయ :—అట్లే కానిమ్ము.

పురు :—చిత్తం (పోయి సిద్ధార్థకునితోఁగూడ మరల వచ్చును.)

సిద్ధా :—(మలయకేతునిపాదములపైఁ బడి) దేవరవారు నాకు అభయం యిచ్చి కరుణించాలె.

మలయ :—భద్రా! పరతంత్రుఁడగు వానికి నెప్పుడును అభయమే. మఱి నీవు చెప్పఁదలఁచిన దేమో చెప్పుము.

సిద్ధా :—దేవరవారు వినండి; అమాత్య రాక్షసులుంగారు యీ జాబిచ్చి నన్ను చంద్రగుప్తుని దగ్గెరికి పంపినాఁడు.

మలయ :—భద్రా! నీతో చెప్పిపంపిన సందేశము వినిపింపుము.

సిద్ధా:—దేవరవారు వినండి, అమాత్యులవారు నాతో చెప్పిపంపిన మాట లేమంటే:—నాకు మిక్కిలీ స్నేహితులుగా వుండే యీ

రాజులైదుగురూ మీతో మొట్టమొదట సంధిచేసుకోడానికి ఒప్పుకొని వున్నారు. వాండ్లెవరంటే, -కులూత దేశపురాజు చిత్రవర్మా, మలయదేశపురాజు సింహనాదుడూ, కాశ్మీరపు రాజు పుష్కరాక్షుడూ, సింధుదేశాన్నేలే సింధుసేనుడూ, పారసీకం ప్రభువు మేఘాక్షుడూ—అనేవాండ్లు. వీండ్లల్లో మొదట చెప్పినరాజులు ముగ్గురూ, మలయకేతువు దేశాన్ని కావాల్నన్ని కోరుతూ వున్నారు. తక్కిన యిద్దరూ యేనిగల దండునూ, ఖజానానూ కోరుతూవున్నారు. కాబట్టి మహారాజుగారు యేవిధంగా చాణక్యుణ్ణి తీసేసి నాకు సంతోషాన్ని కలిగించినారో అదేవిధంగా వీండ్లకున్నూ మొదట పణంగా యేర్పరచుకున్నదాన్ని చేకూర్చవాల్సింది. అనే యీ మాటలే నాతో అమాత్యులుంగారు చెప్పంపించింది.

మలయ :-(తనలో) ఏమీ! చిత్రవర్మాదులు గూడ నాకు ద్రోహము చేయుదురా? అవును, అందువలననే వారికి రాక్షసునిమీఁదనంతులేని యభిమానము (ప్రకాశము) విజయా! అమాత్య రాక్షసులను జూడఁ గోరెదము.

ప్రతీ —కుమారులవారి వుత్తరువును నిరవేరుస్తాను.

(అని నిష్క్రమించును)

(అంతటఁ దనయింట నాసనస్థుఁడై యేమో యాలోచించుచు రాక్షసుఁడును, వెంట నొక సేవకుఁడును ప్రవేశింతురు)

రాక్ష :—(తనలో) మా సైన్యములో నందందును చంద్రగుప్తుని యోధులు నిండియుండుటచే నిక్కముగా నా మనస్సునకేమో పరిశుద్ధి కలుగుట లేదు. ఏల యన,

చ. అనయము సాధ్యనిశ్చితము నన్వయయుక్తము నాత్మపక్షయో
జనము విపక్షదూర మగు సాధన మొప్పెడు; దానె సాధ్యమై
చని యిరుమేలఁ దుల్యగతి సంధిలి, పక్షవిరుద్ధమైన సా
ధనమును గొన్న నిగ్రహము తథ్యము వాదికిఁబోలె జేనికిన్,

అయినను వా రందఱును చంద్రగుప్తునిమీఁద నపరక్తు లగుటకుఁ జాలినంత కారణము లుండి ముందుగానే మేము పన్నిన భేదోపాయములకు లోఁబడి వచ్చి మా సైన్యములోఁ జేరిన వారే. అందువలన వారియెడ ననుమానపడ నవసరము లేదు. (ప్రకాశము) ప్రియంవదకా! కుమారానుయాయులగు రాజులకు మా మాటగా నిట్లు చెప్పుము. కుసుమపుర మిప్పుడు దిన దినమునకును దాపునకు వచ్చుచున్నది. కావున నిఁకముందు ప్రయాణములో మీరు సేనా విభాగముల ననుసరించుకొని నడచుటయుక్తము. ఎట్లన,—

సీ. కదలంగవలె ముందు ఖస శబరేశ్వరుల్ నావెంటఁ బన్ని సైన్యములతోడ
యవన గాంధార భూధవులు మొగ్గర మయి నడిమిభాగము నూని నడువవలయు
నావల వెనువెన్కనై బలంబులతోడ శక హూణ నృపతులు సాగవలయుఁ
గౌలూతపతి మున్నుగాఁ బరిశిష్ట భూధవు లెల్ల బలసముదాత్తవృత్తి

తే. శ్రేయి గనులఁ గుమార భూవిభుని గాచి
బలిసి చనవలె; నీరీతి బలము లెల్లఁ
బయనమున మోహరించి దర్పమున మించి
నడచి జయలక్ష్మి నొక్కట నొడువవలయు.

ప్రియం :—అమాత్యులవారి వుత్తరువును నెరవేరుస్తాను.

(అని నిష్క్రమించును)

ప్రతీహారి :—(ప్రవేశించి) జయం, జయం, మంత్రులవారికి. కుమారుల వారు తమర్ని చూడఁదలుస్తున్నారు.

రాక్ష.—భద్రా! ముహూర్త మాఁగుము. ఎవఁడురా అక్కడ?

పురుషుఁడు :—(ప్రవేశించి) చిత్తం. అమాత్యులవారి వుత్తరువుకు సిద్ధంగా వున్నాను.

రాక్ష :—భద్రా! నీవు పోయి శకటదాసునితో 'కుమారుఁడు మమ్మాభరణమును దాల్పించినాఁడు కావున నలంకరణము లేకుండ మేము కుమారుని దర్శనము నందుట యుక్తము

గాదు, అందువలన పూర్వము గొనియుంటిమే మహా దాభరణ
ములను, వానిలో నుండి యొకదానిని ఇచ్చి పంపుము' అని
మామాటగాఁ జెప్పుము.

పురు :—చిత్తం. సెలవు. (పోయి మరల వచ్చి) అమాత్యా! యిదుగో
ఆభరణాన్ని తీసుకొని వొచ్చినాను.

రాక్ష :—(తీసికొని త న్నలంకరించుకొని లేచి) భద్రా! కుమారుఁడున్న
తావునకు మార్గమును జూపుము.

ప్రతీ :—చిత్తం, మంత్రులవారు నా వెంటనే దయచేయండి.

రాక్ష :—(స్వగతము) అధికారపద మనఁగాఁ దప్పు చేయనివానికిఁ
గూడ మిక్కిలి యాశంకాస్థానము.

ఏల యన.—

ఉ. ఏలినవానినుండి భయ మెత్తెడు సేవకునాత్మఁ దొల్లి; భూ
పాలునియొద్దివారిఁ దలఁపన్ బయి నెమ్మది నాటు; మీఁద దు
ష్ఖలజనంబు రిత్తఁ గలుషింపఁగఁ జేయు పదంబు నందినన్
జాలుఁ; గలంచు నున్నతికిఁ జాలు నిపాత భయంబు చిత్తమున్

ప్రతీ:—(ముందునకు నడచి) అమాత్యా! వీరుగో కుమారులవా
రిక్కణ్ణేవున్నారు. తాము వారిదగ్గరకుపోండి.

రాక్ష :—(చూచి) ఇతఁడే కుమారుఁడు.

తే. శూన్య మగుట విశేషముల్ చూరని దృష్టి
నిశ్చలాంగిగ మునికాల నిలువ నిలిపి
దుర్వహ క్లిష్ట బహు కార్యధుర ననంగ
వ్రాలు నెమ్మోముఁ దాల్చిఁ గెంగేల నితఁడు.

(సమీపించి) కుమారునకు జయ మగుఁ గాక.

మలయ :—ఆర్యా! నమస్కరించుచున్నాఁడను. ఇదిగో పీఠము;
ఆసీనులు గండు.

(రాక్షసుఁడు కూర్చుండును)

మలయ :—ఆర్యా! చిరకాలమునుండి యార్యుల దర్శనము కలుగ
మిచే మే ముద్విగ్నుల మైతిమి.

రాక్ష :—కుమారా! ఈ ప్రయాణములో తగిన సేనా సన్నాహము లను ఏర్పాటుచేయుపనిలో నుండియుండుటచే మే మిట్లు కుమారుని యుపాలంభమునకు గుఱియైతిమి.

మలయ :—ఆర్యా! తా మీ ప్రయాణ విషయమున నొనరించిన సేనా సన్నాహము లేవియో వినఁగోరెదను.

రాక్ష :—కుమారా! మీ యనుయాయులగు రాజులకు నిట్లాదే శించితిని.

('కదలంగవలెముందు' ఇత్యాదికమును చదువును)

మలయ :—(తనలో) ఏమీ! ఎవరు మమ్ము నాశనముచేసి చంద్ర గుప్తుని కొలుచుటకు సమకట్టిరో వారే నన్ను పరివేష్టించి యుందురు! (ప్రకాశము) ఆర్యా! ప్రకృతము కుసుమపురము నకుఁ బోవువాఁడుగాని, లేక యటనుండి యిటకు వచ్చు వాఁడుగాని యెవఁడైనను గలఁడా?

రాక్ష :—కుమారా! రాకపోకలతో నిప్పుడు తీఱిపోయినది. కొలఁది దినములలో మనమే యచటికిఁ బోవుదుము.

మలయ :—(తనలో) ఎఱుక పడుచున్నది. (ప్రకాశము) అట్లయిన నార్యులు లేఖతోఁగూడ నీ పురుషునిఁ బంపితిరే, యెందులకు?

రాక్ష :—(చూచి) ఏమీ! సిద్ధార్థకుఁడే!

సిద్ధా :—ఆర్యా! విన్నవించుకొంటున్నాను. నన్ను తంతూవుంటే

(అని సగము మాటతో మొగము వంచుకొని యూరకుండును)

మలయ :—భాగురాయణా! యజమానుని యెదుట భయపడినాఁడో లేక సిగ్గుపడినాఁడో; ఇతఁడు చెప్పఁడులే; నీవే యార్యుల వారికి తెలియఁజేయుము.

భాగు :—చిత్తము. అట్లే కావించెదను. అమాత్యా! వీఁడు చెప్పు చున్నాఁడు గదా 'అమాత్యుల వారొకయుత్తర మిచ్చి సందేశమును గూడఁ జెప్పి నన్ను చంద్రగుప్తుని యొద్దకుఁ బంపినారు' అని.

రాక్ష : భద్రా! సిద్ధార్థకా! ఇది నిక్కువమా?

సిద్ధా :—(సిగ్గును నటించుచు) ఈ విధంగానే నన్ను తంతూవుంటే - చెప్పినాను.

రాక్ష :—వట్టి యబద్ధ మిది. దెబ్బలు తగులునప్పుడు మనుష్యుఁ డేమి చెప్పకుండును?

మలయ :—మిత్రమా! భాగురాయణా! ఉత్తరమును చూపింపుము. సందేశము నీ సేవకుఁడు తెలుపును.

భాగు :—అమాత్యా! ఇదియే లేఖ.

రాక్ష :—(చదివి) కుమారా! శత్రువు గావించిన ప్రయోగ మిది.

మలయ :-లేఖ వట్టిది గాకుండ నార్యులీయాభరణమును గూడ నంపితిరే! యిది శత్రువు కావించిన ప్రయోగ మెట్లగును?

రాక్ష :—(ఆభరణమును బాఁగఁజూచి) కుమారా! ఇది నేను బంపినది గాదు. కుమారుఁడు నాకుఁ బంపియుండిన దీని నొకానొక సంతోష సందర్భమున సిద్ధార్థకునకుఁ బారితోషికముగా నిచ్చి యుంటిని.

భాగు :—అసాధారణమగు నిట్టి యాభరణమును, అందును కుమారుఁడు ప్రసాద చిహ్నముగాఁ బంపినదానిని, ఈతనికిఁ బారితోషికముగ నిచ్చితిరా?

మలయ :—వాచికమును గూడ నాప్తతముఁడగు నీ సిద్ధార్థకుని వలన వినఁగోరెద నని యార్యులు వ్రాసియున్నారు.

రాక్ష :—లేఖయే నాది కానప్పుడు వాచిక మెక్కడనుండి వచ్చును?

మలయ :—అయిన నీముద్ర యెవ్వరి దందురు?

రాక్ష : - కుమారా! వంచకులు కపటముద్రను గూడ సృష్టింప నేర్తురు.

భాగు :—కుమారా! అమాత్యులు విన్నవించునది బాగుగనే యున్నది. భద్రా! యీ యుత్తరమును వ్రాసిన దెవరు?

(సిద్ధార్థకుఁడు రాక్షసుని మొగము చూచి మోము వ్రాల్చి యూరకుండును.)

భాగు :—మరలఁ దన్నులపాలు గాకుండ వెంటనే చెప్పుము.

సిద్ధా :—ఆర్యా! శకటదాసు రాసినాడు.

రాక్ష :—శకటదాసుఁడు వ్రాసియున్న చో నేను వ్రాసినట్లే.
మలయ :—విజయా! శకటదాసును మేము చూడవలయును.
ప్రతీ :—కుమారులవారి వుత్తరువును నిరవేరుస్తాను.
భాగు :— (తనలో) ఆర్యచాణక్యుల గూఢచారు లనిశ్చితమగు విషయము నెన్నఁటికిని జెప్పరు. అయినను నిట్లు చేయుదును గాక. (ప్రకాశము) కుమారా! శకటదాసుఁ డమాత్య రాక్షసుని యెదుట 'నీ వ్రాఁత తనదే' యని యెన్నఁటికిని నంగీకరింపఁడు. కావున నీతని వ్రాఁతను మరియొకదానిని దెప్పింపుఁడు. అక్షరముల పోలికయే యీ విషయమును స్పష్టముచేయును.
మలయ :—విజయా! యిట్లే చేయుము.
భాగు :—కుమారా! ముద్రనుగూడఁ దెప్పింపుఁడు.
మలయ :—విజయా! రెండింటినిగూడఁ దీసికొనిరమ్ము.
ప్రతీ :—చిత్తము (పోయి తిరిగివచ్చి) కుమారా! యిదిగో శకటదాసు తనచేత్తో వ్రాసినవ్రాఁత. యిదిగో మొహరు.
మలయ :—(రెండింటిని పరిశీలించి చూచి) అక్షరములు ఒక్కవిధముగనే యున్నవి.
రాక్ష :—(తనలో) అక్షరములు ఒక్కవిధముగనే యున్నవి! ఏమీ? దీనిని శకటదాసుఁడే వ్రాసియుండునా?

తే. తొలఁగిపోని యశంబులఁ దూలవుచ్చి
చంచలార్థంబు లెడఁద నాశించె నేమొ?
స్వామిభక్తిని మఱపొంది శకటదాసుఁ
డాలు బిడ్డలఁ దలఁచువాఁ డయ్యె నేమొ?

ఇంకను సందేహ మెందులకు?

సీ. ముద్రిక యాతనిమునివ్రేలఁ దగునది; యతనిమిత్రుఁడు సిద్ధార్థకుండు;
పగవారు పన్నిన పన్నాగమున కాశ్రయంబైన యీలేఖ యతనిదే య
టంచు వ్యక్తం బయ్యె నాతని యన్యలేఖాక్షరంబులు సరియైనకతన;
సంశయింపఁగ నేల? శకటదాసుఁడు భేదకుశలు రా సహితులఁ గూడి యిట్లు

తే. స్వామిభక్తికి మనమున స్వస్తిఁ జెప్పి
పాడు ప్రాణంబులకు నాశపాటుఁ జెంది
కట్ట! కార్పణ్యమున కొడిగట్టుపనికి
లోఁగె; నీరీతిఁ జెనుకీడు మూఁగికొనియె.

మలయ :—(చూచి) ఆర్యా! 'శ్రీమంతుఁ డంపిన మూఁ డలంకార ములును జేరినవి' యని వ్రాసియుంటిరే యీ యాభరణ మేమి వానిలోనుండి యొకటియా? (పరిశీలించి చూచి తనలో) ఏమీ! పూర్వము తండ్రిగారు తాల్చినదే యీ యాభరణము. (ప్రకాశము) ఆర్యా! యెక్కడి దీయాభరణము?

రాక్ష :—వెలకుఁ దీసికొంటిమి.

మలయ :—విజయా! యీ యాభరణమును గుర్తింతువా?

ప్రతీ :—(పరిశీలనగాఁ జూచి కన్నీటితో) కుమారా! యెందుకు గుర్తింప లేను? పేరు తల్చుకోవాల్సిన మహారాజు పర్వతేశ్వరులుంగారు పూర్వము పెట్టుకుంటూవున్న ఆభరణమే యిది.

మలయ :—(కన్నీటితో) అక్కటా! తండ్రీ!

ఉ. భూషణవల్లభుండ వయి పొల్చెదు నీ మెయిఁ దాల్ప నొప్పు నా
భూషణముల్ గదయ్య! కులభూషణ! యియ్యవి; చంద్రమఃకళో
న్మేషముఖాంకు లొప్పఁ బురణింతువు వీని ధరించి తారకా
భూషితమై మనోజ్ఞరుచిఁ బొంపిరివోవు శరత్ప్రదోషముగా.

రాక్ష :—(తనలో) ఏమి యిది? పూర్వము పర్వతేశ్వరుఁడు ధరించిన వనినాఁడు? నిశ్చయముగ చాణక్యుఁడే యీ వర్తకుని బంపి దీనిని మా కమ్మించినాఁడు!

మల :—ఆర్యా! పూర్వము తండ్రిగారు ధరించిన యీ యాభర ణములను, అందును చంద్రగుప్తుని చేతఁ బడినవానిని వెలకుఁ దీసికొంటి మనుట యేమేనియుఁ బొసఁగునా? అయినను నొకవిధముగాఁ బొసఁగియేయున్నది లెండు.

ఆ. అధికలాభమునకు నాశించి చంద్రగు
ప్తుండు విక్రయించుచుండ మమ్ము
విలువగా నొసర్చి విలుచుకొంటిరి వీనిఁ
గ్రూరవర్తనమునఁ గొంతలేక.

రాక్ష :—(తనలో) ఔరా! ఎంత సుశ్లిష్టముగా నున్న దీదోషా
రోపణము!

క. కా దిది నాదులేఖ మనఁ గా, దిట ముద్ర మదీయ మౌట; కై
కోఁదగదుఙ దిగాఙ దెగువకుఙ శకటుం డనుమాట; చేకొనఙ
గాదు మురాసుతుండు నరనాథుఁడు సొమ్ముల నమ్మె నన్న; నాఁ
గాదను మాట వోలదటు గావున నొప్పుకొ టొప్పు నియ్యెడఙ.

మలయ :—ఆర్యుల నీయొక్క మాట యడిగెదను.

రాక్ష :—కుమారా! ఎవ్వ డార్యుఁడో యాతని నడుగుము. మే మిప్పు
డనార్యుల మైతిమి.

మలయ :—

ఉ. ఆతఁడు స్వామిపుత్త్రుఁడు; హితాత్మకుఁ డే; నటఁ గొల్తు; వీఁడు ని
న్నే తగఁ గొల్తు; నం దిదు నిజేచ్ఛ నతం; డిట నిత్తు వీవ; ని
ర్ణీతము యంఁదు సత్కృతులు నిండిన దాస్యము; స్వామ్య మింతు; స్వా
ర్థాతిశయేచ్ఛ యొయ్యది యనార్యుఁగ ని న్నొనరించెఁ? దెల్పుమా!

రాక్ష :—కుమారా! యిట్లు నాపై నభియోగమును మోఁపు నీ
మాటలలోనే నిర్ణయము గూడ నిమిడియున్నది.

ఉ. ఆతఁడు స్వామిపుత్త్రుఁడు; హితాత్మజుఁ డీ; వటఁ గొల్తు; నిందు న
న్నే తగఁ గొల్తు; వం దిదు నిజేచ్ఛ నతం; డిట నిత్తు నేన; ని
ర్ణీతమ యందు సత్కృతుల నిండిన దాస్యము; స్వామ్య మిందు; స్వా
ర్థాతిశయేచ్ఛ యొయ్యది యనార్యుఁగ న న్నొనరించుఁ? దెల్పుమా!

మలయ :—(ఉ తరమును సొమ్ములపెట్టెను జూపి) అయిన నిది యంతయు
నేమి?

రాక్ష :—విధివిలసితము.

మ. అవమానాస్పదమైన సేవకపదంబందున్న నన్నుం దమూ
ధవున న్నెవ్వరు ప్రేమ నోమిరి కృతప్రజ్ఞుల్, కృతజ్ఞుల్ మహీ
ధవు, లాలోకవిదగ్రగణ్యులను విధ్వంసించు పాపుండు మా
నవయత్నచ్ఛిదుఁడైన దుర్విధి నిదానం బింతవట్ భూవరా!

మలయ:—(కోపముతో) ఏమీ యిప్పటికీ కప్పిపుచ్చుటయేనా? ఇది విధివిలసితమా? లోభవిలసితము గాదా? అనార్యుఁడా!

ఉ. ఘోరవిషప్రయోగమునఁ గూర్చిన కన్నియ నంపి మున్ను తూ
లారిచి తీవ నిన్ను మన మారఁగ నమ్మిన తండ్రి; నిష్ఠు నిట్
గౌరవ మిచ్చి మంత్రిగ నొనర్చిన మమ్ముఁ గృతఘ్న! చెండియుట్
వైరికి నమ్మఁ బూనితివి పాపుర! మాంసమటుల్ కసాయివై.

రాక్ష:—(స్వగతము) ఇది మఱి యొకటి; గోరుచుట్టుమీఁద రోఁకటి పోటు. (చెవులుమూసికొని) (ప్రకాశము) పాపము శాంతించుఁ గాక. పర్వతేశ్వరుని విషయమున నే నేపాపము నెఱుఁగను.

మలయ:—అట్లయిన చోఁ దండ్రిగారిని హత్యఁజేసిన దెవరు?

రాక్ష:—దైవమున కే యెఱుక.

మలయ:—దైవమున కెఱుకయా? క్షపణకుఁడు జీవసిద్ధికిఁగాదా?

రాక్ష:—(తనలో) ఏమీ? జీవసిద్ధిగూడఁ జాణక్యుని ప్రయోగము లోనివాఁడా? అక్కటా! శత్రువులు నా హృదయమును గూడఁ బట్టుకొన్నారు.

మలయ:—(కోపముతో) భాసురకా! సేనాపతి యగు శిఖరసేనునకు మామాటగా నిట్లు తెలుపుము. 'కులూతరాజు చిత్రవర్మ, మలయేశ్వరుఁడు సింహనాదుఁడు, కాశ్మీరపతి పుష్కరాక్షుఁడు, సింధురాజు సింధుషేణుఁడు, పారసీకాధిపతి మేఘాక్షుఁడు నను నీ యైదుగురు రాజులును రాక్షసునితోఁ జేరి మా శరీరమునకు ద్రోహము గావించి చంద్రగుప్తుని సేవించుటకు సమకట్టి యున్నారు. వీరిలో మొదటివారు మువ్వురును మా భూమిని గావలె నని కోరుచురఁట. వారిని లోఁతు గోతిలోఁ బడవైచి మట్టితోఁ బూడ్పింపుము. ఏనుఁగు

బలము గావలె నని కోరు తక్కిన యిద్దఱను ఏనుఁగు తోడనే మట్టింపుము. ఇది మా యాజ్ఞ

పురుషుఁడు :—చిత్తం. దేవర వారి వుత్తరువును నెరవేరుస్తాను.

మలయ :—రాక్షసా! నేను విశ్వాసఘాతుకుఁడగు రాక్షసుఁడను గాను. మఱి మలయకేతుఁడను సుమా! కావున యథేచ్ఛముగఁ బొమ్ము; మనసారఁ జంద్రగుప్తునే యాశ్రయింపుము.

తే. విష్ణుగుప్తుండు నీవు నీవిభుఁడు మౌర్యుఁ
డత్తి యొకమిత్తముగఁ గూడి శత్రులైన
నే సమున్మూలన మొనర్ప నేర్తు లీల
నెయిఁ ద్రివర్గంబు రాచు దుర్ణయమువోలె.

భాగురాయణా!

మ. దళమై లోధ్రపరాగ పాండుర లసద్గోడాంగనా గండశో
భలఁ గారొల్పి మిళింద సచ్ఛవులు తద్వ్రాలకశ్రీలు గా
నీలమై మద్ధ్వజినీ తురంగమ ఖురోత్క్షేపోత్థ పాంసు వ్రజం
బులు కా లూనుత దాయలన్ గరిమదాంబుచ్ఛిన్నమూలంబులై.

(అని భాగురాయణునితోడను, బరిజనముతోడను మలయకేతువు

నిష్క్రమించును) .

రాక్ష :—(ఆవేగముతో) ఇసీ! యెంత పాడుపని! నా మూలమునఁ బాపము! చిత్రవర్మాదులకు మరణము సంభవించినది. ఏమీ? రాక్షసుఁడు ప్రయత్నించునది మిత్ర వినాశనమునకుఁ గాని శత్రు వినాశనమునకుఁగాదా? మందభాగ్యుఁడనగు నే నిప్పు డేమి చేయుదును?

సీ. పయనింతునా తపోవనికి? డెందంబునఁ బగ రగుల్కొన శాంతిఁ బడయఁ బెట్టు?
అధిపతిపాదంబు లనుగమింతునా? పగతుండు పైమయి మనియుండ నిట్టి
చందంబు సతులకుఁ జనుఁగాక మగవాడియే? ఖడ్గసఖుఁడనై యిట్టె వైరి
బలములపైఁ బోయి పడుదునా? యయ్యదియును దోఁప దుచితవర్తన మటంచుఁ

తే. గడఁగి చందనదాస మోక్షమున కలుక
నెడఁద తెగువకు నక్క జాలనీక నిలుపుఁ,
బరమఘాతుకమై యొందువగ నదెట్లు
తాల్పఁగా నేరుచుఁ గృతఘ్నతాభరంబు?

(నిష్క్రమించును)

ఇది కూట లేఖ మను

పంచమాంకము.

# షష్ఠాంకము

(అంతట నలంకృతుఁడై సంతోషముతో సిద్ధార్థకుఁడు ప్రవేశించును)

సిద్ధా :— (గేయము)

జయం జయం రాక్షసులను దునిమే
జనార్దనునికిని జయం జయం
జయం జయం మా వల్లనిసామికి
చంద్రగుప్తునికి జయం జయం
జయప్రదంగా జయకార్యములను
సమాప్తి చేసీ విరోధులకా
జయించి మించే చాణుక్యాగ్య్రుల
జయనీతి కిదే జయం జయం.

ఇన్నాళ్లకు సెలవుగా యింకనైనా ప్రియ స్నేహితుఁడగు సమిద్ధార్థకుణ్ణి చూస్తాను. (ముందునకు నడచి చూచి) యిదుగో నా ప్రియ మిత్త్రుడు సమిద్ధార్థకుడు. యీ పక్కనే వస్తున్నాడు. నేనూ యితని దగ్గరికి పోతాను. (అంతట సమిద్ధార్థకుడు ప్రవేశించును.)

సమి :—

(గేయము)

నా సకుని నే నెపుడు చూతూ, వాని
కోసమై యేవీధి గాతూ,
ఏ సంబరములోను యేమో కలత మించు
సారాయి ముట్టితే నోరు విసమునిపించు
సకుడు దగ్గర లేక సంపదల ననుకుంటె
గుండెలో నే శాకు కమ్మినటై తోచు ॥నా సకుని॥

నా ప్రియ స్నేహితుడు సిద్ధార్థకుఁడు మలయ కేతువు కటకాన్నుంచీ వచ్చినా డని తెలిసింది. అతనికోసమె వెతుకుతాను (ముందుకు నడచి సమీపించి) యిదుగో సిద్ధార్థకుడు యిక్కణ్ణే వున్నాడు.

సిద్ధా :—(సమీపించి) ప్రియమిత్రుణికి సౌఖ్యమా ?

(ఇద్దఱును ఒక రొకరిని కౌగిలించుకొందురు.)

సిద్ధా :—మిత్రుడా! యెన్నో రోజులనించీ దేశాంతరంలో వుండి తిరిగీ వూరికి వొచ్చీ కూడా యిప్పటిదాకా నీవు మాయింటికే రాకుండా వుంటే నాకు సౌఖ్య మెక్కణ్ణుంచీ వస్తుంది ?

సిద్ధా :—క్షమించు మిత్రమా! క్షమించు; నన్ను చూడంగానే ఆర్య చాణక్యులవారు పిలిచి 'సిద్ధార్థకా! నీవు పోయి యీ ప్రియ వార్తను చంద్రగుప్త మహారాజుగారికి తెలిపిడి చెయ్యి' మని వుత్తరువును చేసినాడు. తరువాత నేను పోయి మహారాజు గారికి ఆ సంగతి విన్నపంజేసి ఆయన అనుగ్రహాన్ని యీమాదిరిగా అనుభవించి యింకనైనా ప్రియ మిత్రుణ్ణి చూస్తా మని మీ యింటికే వస్తున్నాను.

సమిద్ధా .—మిత్రమా ! నాకు వినిపించవచ్చు ననుకుంటే నీవు మహారాజుగారికి విన్నపంజేసిన ఆ ప్రియవార్త యేమో చెప్పు!

సిద్ధా .—స్నేహితుడా! నీకుగూడా వినిపించగూడంది వుంటుందా ? వినిపిస్తాను, విను. ఆర్యచాణక్యులవారి నీతిప్రభావంతో మతి పోయిన పాపిష్టి మలయకేతువు రాక్షసుణ్ణి వెళ్ళగొట్టి, తన బలంలో ప్రధానంగావున్న చిత్రవర్మ్మదూ మొదలయిన అయిదుగురు రాజులనూ చంపించినాడు. దానిమీాద శిబిరంలోవుండే రాజులంతా 'యితడు మంచి చెడ్డలను ఆలోచించకుండా పనిచేసే చెడ్డనడతవా' డని తలచి మలయ కేతువును విడిచిపెట్టి తమ తమ క్షేమంకోసమై భయంతో చెదరి ఓటమారిన సైన్యాల్ను, పరివారాల్ను వెంటబెట్టు కొని యెవరిదేశాలకు వాండ్లు పోయినారు. ఇట్లా అందరూ పోయింతర్వాత భద్రభటుడూ, పురుషదత్తుడూ, డింగు రాతుడూ, బలగుప్తుడూ, రాజసేనుడూ, భాగురాయణుడూ, రోహితాక్షుడూ, విజయవర్మ్మ మొదలైనవాళ్ళంతా మలయ కేతువును కట్టేసి పట్టుకున్నారు.

సమిద్ధా:—అది సరే గాని, మిత్రమా! భద్రభటుడు మొదలైన వాళ్లు మహారాజు చంద్రగుప్తులవారి మీద సరిపడక యిక్కణ్ణించీ పోయి మలయకేతువుదగ్గర కొలువులో చేరినారని కదా లోకమంతా అనుకుంటూవుంది? మరి చేతఁగాని కవి వ్రాసిన నాటకంలో మాదిరిగా యిది మొదట్లో వొకటి, చివర్లో వొకటిగా తేలిపోవడానికి యేం కారణం?

సిద్ధా:—మిత్రమా! విధివిధానం మాదిరిగా చాణక్యులవారి నీతి నడిచేమార్గం యెవరికిగాని యెట్లా తెలుస్తుంది? దానికి మొక్కవాల్సిందే గాని.

సమిద్ధా:—ఆఁ, తరువాత, తరువాత?

సిద్ధా:—తరువాత యేముందీ? చాణక్యులవారు యిక్కణ్ణించీ కావలసి నన్ని మంచి యుద్ధసాధనాల్తో గూడా పోయి రాజే లేని యీమ్లేచ్ఛబలాన్నంతా లోబరుచుకున్నారు.

సమిద్ధా:—మిత్రమా! యెక్కడ ఆ దండు?

సిద్ధా:—ఇదుగో ఆ దగ్గర్నే చూడు.

(గేయము)

నీళ్ళమబ్బులచాయ నిలిచి గీ పెట్టీని
అల్లవో యేనుగులు సకుడా!
కొల్లబొయ్యే మదముకోపుతో కై పెక్కి
వుల్లాసమున మించు సకుడా!
ములుకోలయేటులకు అలికి వొణికీ పేర
ములు వారు నల్లవో సకుఁడా
కెలుపు పొమ్ముల తరుకు లొలుక సకిలించీని
కులుకు తూగుత్తాలు సకుఁడా ॥

సమిద్ధా:—మిత్రమా! యీసంగతి వుండనీగాని; అందరికీ తెలిసేటట్లు ఆషిద్ధంగా తన అధికారాన్ని, వొదులుకున్న ఆర్య చాణక్యులు యిప్పుడు మళ్ళీ అదే మంత్రిపదానికి యెట్లా యెక్కినాఁడు?

సిద్ధా :—యెంత తెలియనివాడవోయి! అమాత్యరాక్షసుఁడుకూడా అర్థంచేసుకోలేని ఆర్యచాణక్యులబుద్ధిని నీవు అర్థంచేసుకోవాల్ననుకుంటున్నావు!

సమిద్ధా :—అవునుగాని మిత్రమా! అమాత్యరాక్షసుఁ డిప్పుడెక్కడ వున్నాఁడు?

సిద్ధా :—ఆయన ఆ గందరగోళంలోనే మలయకేతువు కటకాన్నించీ బయలుదేరి యీపాటలీ పుత్రానికే వచ్చినాడు. ఈ సంగతి ఆయన్ను కనిపెట్టి వెంబడించి వచ్చిన వుదుంబరుడనే చారుడు ఆర్యచాణక్యులకు తెలిపినాడు.

సమిద్ధా :—మిత్రమా! అమాత్యరాక్షసుఁడు నందరాజ్యాన్ని మళ్ళీ స్థాపించవాల్ననే దృఢనిశ్చయంతో ఆవిధంగా వూరు దాటిపోయినాఁడు గదా! అట్లా పోయినవాడు యేమీ సాధించకుండానే యిప్పుడు తిరిగీ యీ పాటలీపుత్రానికే యెట్లా వొచ్చినాఁడు?

సిద్ధా :—చందనదాసుమీఁది స్నేహంతో వచ్చినా డనుకుంటాను.

సమిద్ధా :—అయితే యింక చందనదాసుకు విడుదల లౌతుం దనుకుంటావా?

సిద్ధా :—అబ్బే! ఆ దురదృష్టవంతునికి విడుదల లెట్లా కలుగుతుంది? యిప్పుడే మన మిద్దరమూ అతణ్ణి వధ్యస్థానానికిపట్టుకొనిపోయి చంపవలసినట్లు ఆర్యచాణక్యుల వుత్తరువుగూడా అయింది.

సమిద్ధా :—(కోపముతో) యేమీ! ఆర్యచాణక్యులకు తలారివాడెవడూ దొరకక్కపోయినాఁడా? ఇట్లాంటి పాపిష్టిపని కూడా మనకే వుత్తరువుచేయవాల్నా?

సిద్ధా :—మిత్రమా! యీ జీవలోకంలో బతుకుమీద ఆశవుండేవాడెవడూ ఆర్యచాణక్యులవుత్తరువుకు యెదురుతిరగ లేడు. కాబట్టి పోదాం రా. తలార్ల వేషంతో చందనదాసుణ్ణి వధ్యస్థానానికి చేరుస్తాము.

(ఇరువురును నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

(అంతట పగ్గమును చేఁబట్టుకొని యొక పురుషుఁడు ప్రవేశించును)

పురుషుఁడు :—

(గేయము)

జమిలి ముప్పూరి గుణములను చొ
క్కముగ బేనిన తాడురా
క్రమము బోని వుపాయముల వు
చ్చుమర గట్టిన తాడురా
సెత్తురువులను బట్టి కట్టను
సిక్కనైనా తాడురా
కొత్తదిది చాణక్య మంతిరి
గొన్న నీతీ తాడురా.

(ముందునకు నడచి చూచి) యిదే ఆర్యచాణక్యులకు వుదుంబరు డనే వేగులవాడు చెప్పినచోటు. ఆర్యచాణక్యుల వుత్తరువుప్రకారం యిక్కణ్ణే నేను అమాచ్చరాకుసుణ్ణి చూడవలసింది. (చూచి) యేమీ! ఇదుగో అమాచ్చరాకుసుడు. నిండా ముసుగుయేసుకోని యీపక్కనే వస్తున్నాడు! నేను యింక యీ పాడుతోపుచెట్లల్లో ఆయనకు కనపడకుండా దాక్కోని యెక్కడ కూచుంటాడో కని పెడతాను. (ముందునకు నడచి యట్లు చేయును)

(అంతట మీద చెప్పినవిధంగా శస్త్రపాణి యై రాక్షసుఁడు ప్రవేశించును)

రాక్ష :—(కన్నీటితో) అక్కటా! ఎంతకష్ట–మెంతకష్టము.

మ. సిరి నష్టాశ్రయభీతయై తవిలె నిన్నీ! జారవోలెం గులాం
తరముఁ; లోకులునుఁ గతానుగతిఁ దన్మార్గంబు వెన్నంటి; రా
తురులై పౌరుషసిద్ధి లేమి విడి రాప్తుల్ కార్యభారంబు; వా
రరయఁ శీర్షములేని యంగకము లట్లై;రేమి సేయందగుఁ?

అదిగాక,

మ. భువనాధీశుఁడు సత్కులీనుఁడగు దేవుఁ డా నాథునిన్ వీడి శే
తవిలెన్ భార్యని శూద్రివోలె నవినీతప్రీతిమై లక్ష్మి; తా
నవు నంచున్ గుదురయ్యె నందె; యెటు సేయన్ వచ్చు? దైవంబు శ
త్రువువోలెన్ బొలివుచ్చు సుస్థిరమదుద్యోగంబు నెల్లప్పుడున్.

ఉ. అట్టితెఱంగుచావున కనర్హుఁడు నాయిలు వెల్వ నాకమున్
మెట్టినఁ బర్వతేశ్వరుని నీడల నల్పితి యత్న; మాతఁడున్
గిట్టినఁ దత్తనూజుఁ గొని నిల్చితి; నిష్ఫల మింతయున్; బగన్
బట్టెను నందరాట్కులముపై విధి; బాపఁడు గాఁడు చూడఁగన్.

ఓరా! మలయకేతుని తెలివితక్కువ! ఏల యన,

మ. తనరాజన్యులు బీజనాశముగ నంతంబైన నీనాఁడు వా
రినె సేవించెడు నట్టిరాక్షసుఁడు వైరిం జేరునే? యక్షతుం
డని చింతింపఁ డొకింత మ్లేచ్ఛుఁ డవివేకాత్ముండు; కా దట్టు; లె
వ్వని కేనిన్ మది తాఱుమాఱు లగు దైవప్రాతికూల్యంబునన్.

అగుఁగాక; ఇప్పటికిఁగూడ రాక్షసుఁడు శత్రువులచేఁ జిక్కి చావనైనను జచ్చునుగాని చంద్రగుప్తునితో సంధి చేసికొనఁడు. చేసిన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనలేకపోయె నను నపకీర్తియైనను మేలుగాని పగతుని మోసమునకు లోఁబడినాఁ డను పరాభవముగాదు. (నలువైపులను జూచి కన్నీటితో) ఇవియేగదా నా దేవుని యడుగుజాడల పరిచయముచేఁ బవిత్రములగు కుసుమపురపుఁ బ్రదేశములు! ఇందేగదా,

మ. ధనురాకర్షణవేళ జాఱి పడ లాండ్రన్ గళ్ళపుంబగ్గ మిం
కను మింటం జనువాజినుండి చలలక్ష్యశ్రేణి బాణాళి మున్
మనుజేశుం డిట నించె, నిల్చె నిచటన్; మాటాడె నిచ్చోట; వా
రిని గోల్పోయి కనంగ నేఁ డిటు లివే ఖిలించు హర్మ్యముల్.

మందభాగ్యుఁడ నగు నే నిప్పు డెచ్చటికిఁ బోవుదును? (చూచి) కానిమ్ము; కనఁబడుచున్నదిగదా యీ జీర్ణోద్యానము. ఇందే ప్రవేశించి యెవనినుండియైనను చందనదాసుని వృత్తాంతము

నెఱుంగుదును. (పరిక్రమించి) మనుష్యులకుఁ గలుగు దశాపరిణామముల యందలి సమవిషమస్థితులు ఎప్పుడు ఎట్లు వచ్చి పైఁబడునో యెవ్వరి కైనను ఎఱుఁగరాదుగదా!

శా. పౌరుల్ వ్రేళుల బాలచంద్రునటు చూపన్, భూపసాహస్ర మిం
పారం జేరి భజింప మున్ను పుర మెయ్యారంబుగన్ వీడుచున్
రారాజుం బలె; నట్టి నేన యిపు డా నాయూరనే చొత్తు నం
ధ్యారంభవ్యథఁ బాదులోపు నిద కట్టా! చోరునట్టుల్ వెఱన్.

ఏమి యీ పిచ్చి? యెవ్వరి యనుగ్రహముచే నిది యెల్ల జరిగినదో వారే యిప్పుడు లేరు. (ప్రదేశము నభినయించి చూచి) ఔరా! యీ జీర్ణోద్యాన మెంత కాంతిహీనముగా నున్నది!

సీ. భూపాలువంశంబువోలెఁ గూలారె మహారంభరమణీయమైన మేడ
ప్రాణమిత్రుని మహాపద సాధుహృదయంబుకరణి బీఁటలువాఱి విరిసెఁ గొలను
ప్రతికూలదైవంబుకతన నీతులువోలె ఫలవిహీనము లయ్యెఁ బాదపములు
కుటిలనయంబు లకోవిదుమదిఁబోలె వనభూమిఁ జెడఁ గ్రమ్ముకొనెఁ దృణములు

తే. ఎండిపోయిన మేనుల నిండువెతల
పురుగుతొలుపుల వ్యసనార్తిఁ బొగిలి, నొగిలి
యకట! ఛాయావిహీనత నంది తరులు
కానఁబడుఁ గాటి కేగడు క్రమము దోఁప.

అహో! క్రూరోరగములకుంగూడఁ బరిచితప్రణయ మెంత బలవత్తరము! ఇదిగో, ఇచ్చట.

మ. కఱకుంగొడ్డలిప్రేటులన్ దగిన యంగంబుల్ వెతం గూర్పఁ బా
పురపుంగూఁతల నేడ్చు భూజముల నొవుల్ గాంచి సావానిడె
ప్పర మాత్మం గలఁగింప నూర్చుచును సర్పవ్రాతముల్ కంచుకాం
బరఖండంబులఁ గట్లు గట్టు ననుకంపన్ దద్వ్రణశ్రేణికిన్.

ఇదిగో ఇచ్చట నొక పగిలిపోయిన పలకరాయి యున్నది. ఇట్టివిషమ దశాపరిణామమునకుఁ దగిన యీ శిలాశకలముమీఁద నొక్క ముహూర్తకాలము కూర్చుండెదను. (కూర్చుండి వినుట నభినయించి) ఏమి ధ్వని! ఆకస్మికముగ నేదో మహాధ్వని వినఁబడుచున్నది!

మ. పెనువేగంబ రయికటక్ శ్రవఃకుహరనిశ్ఛేదంబు గా రేగి, పె
ల్చన లో నిండి బహిర్గతంబు నయి ప్రాసాదప్రపీతోత్థితం
బునుబోలెక్ బటహధ్వనుల్ దరరవంబుల్ మెండుకోఁ బర్వెడుక్
ఘననాందీరవ మియ్యదే దెసల దైర్ఘ్యంబందుచందంబునక్.

(ఆలోచించి) ఓహో! తెలిసినది. ఈ నాందీనాదము మలయకేతువును బట్టి బంధించుటచే రాజకులమునకు (అవి సగముమాటలో అసూయతో) మౌర్యకులమునకుఁ గలిగిన పరితోషమును సూచించునది గాఁబోలును. (కన్నీటితో) అక్కటా! యెంతటికష్టము!

ఆ. వినఁగఁజేసె శత్రువిభవంబు; న న్నిట్లు
కనఁగఁజేసె నిటకుఁ గదలఁ దివిచి
అనుభవింపఁజేయునంతకు నిప్పుడు
పని వహించునేమొ పాడునియతి!

పురుషుఁడు:—యీన కూర్చున్నాఁడు. యింక ఆర్యచాణక్యుల వారు చేసిన వుత్తరువుప్రకారం నిరవేరుస్తాను.

(రాక్షసుని చూడనివానివలె నాతనికి నెదురుగా ఉరిత్రాటిని మెడకుఁ జుట్టుకొనుచున్నాఁడు)

రాక్ష:—(చూచి) ఏమి యిది? యీతఁ డెవఁడో యాత్మహత్య చేసికొనుటకై యురివేసికొనుచున్నాఁడు. పాపము! ఈతఁడును తప్పక నావంటి దుఃఖితుఁడై యుండును. కానిమ్ము! ఇతనినే యడిగెదను. (సమీపించి) భద్రా! నీవు చేసెడి యీపని యేమి?

పురు:—(కన్నీటితో) అయ్యా! ప్రియమైన జనానికి నాశం కలిగినప్పుడు దుఃఖంతో వుండే నావంటి నిర్భాగ్యుఁ డెవఁడైనా చేసే పన్నే నేనూ చేస్తున్నాను.

రాక్ష:—(తనలో) 'తప్పక యీ నిర్భాగ్యుఁడును, నావంటి దుఃఖితుఁడై యుండు' నని నేను తొలుతనే యనుకొంటిని. (ప్రకాశము) భద్రా! మన మిరువురమును సమానవ్యసనులము. కావున నీప్రాణ త్యాగమునకుఁ గారణ మేమో విన నెంతున్ను,

రహస్యముగాని, యతిభారముగాని కానిచో తెలుప
గోరెదను.

పుర :—అయ్యా! రహస్యము గాదు. అతిభారమూ గాదు. కానీ ప్రియస్నేహితుణి వినాశంతో కుమిలిపొయ్యే నాకు చావకుండా యింకా కాలహరణం చెయ్యడానికి చాత గావడంలేదు.

రాక్ష :—(నిట్టూర్పు పుచ్చి తనలో) మిత్రవ్యసనములలో నితరునివలె నిట్లుదాసీనులమైయున్న మమ్ము ఈతఁడు ప్రత్యాఖ్యానించుచున్నాఁడు. (ప్రకాశము) భద్రా! రహస్యమును, అతిభారమును గాదేని వినిపింపుము.

పుర :—అబ్బా! అయ్యగారు యింతగా నిర్బంధం చేస్తున్నారు. కాబట్టి యిదుగో విన్నవిస్తున్నాను. యీ పట్నంలో జిష్ణుదాసుఁడనే రత్నాలసెట్టి వొకాయన వున్నాడు.

రాక్ష :—(తనలో) ఉన్నాఁడు. జిష్ణుదాసుఁడు చందనదాసునకు ప్రియ మిత్రుఁడు.

పుర :—ఆ నా ప్రియమిత్రుడు—

రాక్ష :—(సంతోషముతో తనలో) ఓహో! ప్రియమిత్రుఁ డనుచున్నాఁడు. సంబంధము చాల దగ్గరలోనున్నది. చందనదాసుని వృత్తాంత మీతనికిఁ దప్పక తెలిసియుండును.

పుర :—(కన్నీటితో) యిప్పుడు తనవిభవాన్నంతా బీదసాదలకు దానంజేసి చిచ్చురకడానికి వూళ్ళోనించీ పోయినాడు. నేనూ ఆయన్ను గురించి వినగూడనిమాట వినపడేదానికిముందుగానే నాకు నేనే వురివేసుకోని ప్రాణం విడిచేదానికి యీ పాడు తోపులోనికి వచ్చినాను.

రాక్ష :—భద్రా! నీమిత్రుఁడు అగ్నిప్రవేశముచేయుటకు కారణమేమి?

ఉ. మందులఁ దీఱఁబోని విష

మంబగువ్యాధి యలంచెనో?——

పుర :—లేదు, లేదు.

రాక్ష :— —నృపా

మందవిషాగ్నికల్పరుష

మాడెనా?——

పుర :—అదిగూడా కాదు. చంద్రగుప్తుని రాజ్యంలో అంత ఘాతకం లేదు.

రాక్ష :— —దుర్దశ నంచెనో మనం

బందు నలభ్యయౌవనప

రాంగనపై వలపొంది?—

పుర :—(చెవులు మూసికొని) పాపం శాంతించనీ; ఎంతమాట!
అట్లాటి చెడ్డపనికి యీనదగ్గర తావే లేదు.

రాక్ష :— —నీకు వో

లెం దనచేయి మీఱి కుమి

లించు సుహృద్వ్యసనంబు గల్గెనో?

పుర :—అయ్యా! అదే కారణం యింకేమీ గాదు.

రాక్ష :—(ఆవేగముతోఁ దనలో) చందనదాసుఁ డాతనికిఁ బ్రియమిత్రుఁ డనియు, నాతనివినాశ మీతని యగ్నిప్రవేశమునకుఁ గారణ మనియుఁ దలఁచినకొలఁదియు సుహృత్పక్షపాతియగు హృదయము నన్ను నిశ్చయముగాఁ గళవళపెట్టుచున్నది. (ప్రకాశము) భద్రా! ఆ నీ ప్రియమిత్రుని పవిత్రచరిత్రముఁ గూడ సవిస్తరముగా విన నెంతును.

పుర :—అయ్యా! యీ నిర్భాగ్యుని మరణానికి యింకాగూడా ఆటంకం కలిగించడానికి చాతగావడం లేదు.

రాక్ష :—భద్రా! వినఁదగిన చరిత్ర మిది; వినిపింపుము

పురు :—యింక తప్పదు. యిదుగో విన్నవిస్తున్నాను. వినండి.

రాక్ష :—భద్రా! సావధానుఁడనైతిని.

పురు :—యీ పట్నంలో పూలచౌకుదగ్గిర చందనదాసనే వొక రత్నాలసెట్టి వున్నాడు.

రాక్ష :—(దుఃఖముతోఁ దనలో) ఇదే దైవము మా శోకద్వారమును దెఱచుచున్నాఁడు. హృదయమా! స్థైర్యము నందుము. ఏదియో నీ కత్యంతక్లేశకరమగు వార్త వినవలసియున్నది. (ప్రకాశము) భద్రా! వినియున్నారము. ఆ సజ్జనుఁడు మిత్రవత్సలుఁడు. ఆతని కేమైనది ?

పురు :—ఆయన యీ జిష్ణుదాసునికి ప్రియమిత్రుఁడు.

రాక్ష :—కానిమ్ము, తరువాత ?

పురు :—అందువల్ల యీవాళ జిష్ణుదాసుఁడు ప్రియమిత్రుణి మీద తనకు వుండే స్నేహానికి తగినట్లు చంద్రగుప్తునితో మనవి చేసుకున్నాఁడు.

రాక్ష :—ఏమని ?

పురు :—'మహారాజా! నాదగ్గిర కావలసినంత ధనం వుంది. దాన్ని బదులుగా తీసుకోని నా ప్రియమిత్రుడైన చందనదాసును విడదలచేయించండి' అని మనవిచేసుకున్నాడు.

రాక్ష :—సెబాసు! జిష్ణుదాసా! సెబాసు! మిత్రునిపైఁగల స్నేహమును చక్కఁగాఁ జూపించితివి!

మ. తలిదండ్రుల్ సుతులైన దేనికయి మాత్సర్యంబునన్ శత్రులన్
బలె హింసింతు రొక ళ్ళొకళ్లఁ, జెలులైనన్ జెల్మిఁ బ్రోఁద్రోతు రం
దుల కయ్యర్థమ వీడ నెంతు వ్యసనార్తున్ మిత్రుఁ గాపాడఁగాఁ
దలఁపన్ గోమటి వైన నీయెడల నర్థం బంది ధన్యత్వమున్.

(ప్రకాశము) పిమ్మట నాతని యీ విన్నపమును విని మౌర్యుఁ డేమని చెప్పెను ?

పురు :—జిష్ణుదాసునిమాటలు విని చంద్రగుప్తు డాయనతో 'జిష్ణుదాసుఁడా! మేము చందనదాసుణ్ణి ఖైదుచేసింది ధనంకోసం గాదు. యింకెందుకంటె — ఇతడు అమాత్యరాక్షసుని కుటుంబాన్ని దాచిపెట్టి యెన్నివిధాల అడిగినా వొప్పగించక పోవడంచేతనే యితణ్ణి ఖైదులో పెట్టినాము. కాబట్టి యిప్పటికైనా అమాత్యరాక్షసుని కుటుంబాన్ని వొప్పగిస్తే ఆ తర్వాత యితణ్ణి విడదలచేస్తాము. వొప్పగించకుంటే మరణ దండనం విధిస్తాము.' అని చెప్పి అప్పుడే చందనదాసుణ్ణి చంపేచోటికి చేర్చడానికి వుత్తరువు చేసినాడు. ఆతర్వాత జిష్ణుదాసుడు ప్రియమిత్రుడైన చందదాసుణ్ణిగురించి విన గూడని పాడుమాటను వినకుండా ఆలోపల్నే చిచ్చులో దూకుతా నని పట్నంలోనించీ దాటిపోయినాడు. ఆమీదట నేనుగూడా నా ప్రియమిత్రుడైన జిష్ణుదాసుణ్ణిగూర్చి వినగూడనిమాట వినకుండా ముందుగానే స్వంతంగానే వురేసుకోని ప్రాణాల్ను విడుస్తా మని యీ పాడుతోపులోకి వచ్చినాను.

రాక్ష :—చంపలేదుగదా యింకను చందనదాసును ?

పురు .— లేదు. ఇంక చంపుతారు. యిప్పటికీ ఆయన్ను అమాత్య రాక్షసుని యింటివాండ్లను వొప్పగించ మని మాటిమాటికి అడుగుతూవున్నారు. స్నేహితులంటే ప్రాణాల్ను అప్పగించే యీయనో యేమయినా వాండ్లను అప్పగించడంలేదు. యీ కారణంతో ఆయన మరణదండన అములుజరిగేదానికి కాలహరణం జరుగుతూ వుంది.

రాక్ష :—(సంతోషముతోఁ దనలో) మేలు! చందనదాసా! మేలు!

తే. మున్ను శరణాగతత్రాణమునను శిబిక
నొక్క పారావతముతోడ నుప్పతిలిన
మేలియశ మెల్ల నేఁడు దక్కించుకొంటివి నీతి
సజ్జనాగ్రణి! యొకమిత్రు సాకఁజేసి.

(ప్రకాశము) భద్రా! పొమ్ము; నీ విప్పుడే యతి వేగముగా జిష్ణుదాసుని యొద్దకుఁ బోయి యాతని నగ్నిప్రవేశము గావింపకుండ నివారింపుము. నేను చందనదాసుని మరణమును దప్పించెదను.

పురు :—సరే గాని తమ రేవుపాయంతో చందనదాసుణ్ణి చావకుండా తప్పిస్తారు?

రాక్ష :— (కత్తిని దూసి) సర్వ ప్రయత్నములను నాతోడు నీడ యగు నీ ఖడ్గముతో

మ. జలదాపాయ వినిర్మలాంబరరుచిన్ జన్యాదరస్ఫూర్తి ను
త్పులకం బైనటు వాఁడి మీఱి, రిపుసందోహైక విక్షేప ని
ష్ఠుల సత్త్వంబునఁ బొల్చు కేలియనుఁగుందోడీకృపాణంబు నా
ల్గ్లా లుపున్ నెచ్చెలికై కలంగు నను నెట్లుం దెంపు గావింపఁగన్.

పురు :—అయ్యా! యీ విధంగా చందనదాసుసెట్టి ప్రాణాలను కాపాడడం ... చనగా తెలుపుతూనే వున్నా కాలం చాలని కష్టదశల్లో పడివుండడంతో తమర్ని పేరు చెప్పుకోవాల్సిన మా అమాత్య రాక్షసులవారే నని నమ్మకంగా చెప్ప లేకుండా వున్నాను. నా సందేహాన్ని పోగొట్టి నన్ను అనుగ్రహించండి.

(అని పాదములపైఁ బడును)

రాక్ష : భద్రా! అతఁడనే నేను. స్వామి వంశనాశనమును అనుభవించి, మిత్ర నాశనమునకుఁ గూడఁ గారణమై తలఁపరాని పాడు పేరుతో నున్న యీ యనార్యుఁడను; సార్థకనామధేయుఁడ నగు రాక్షసుఁడను.

పురు :— (సంతోషముతో మరల పాదములపైఁ బడి) ఏ మాశ్చర్యం! ఏ మాశ్చర్యం! యిప్పుడు ధన్యుణ్ణైనాను.

రాక్ష :—లెమ్ము; కాలహరణము చేయకుము. ఇప్పుడే పోయి 'ఇదిగో రాక్షసుఁడు చందనదాసును మరణమునుండి తప్పించు' నని జిష్ణుదాసునకుఁ దెలియఁజేయుము.

(అని జలదాపాయేత్యాది పద్యమును జదువుచు ఒఱదూసిన కత్తితోఁ బరిక్రమించును)

పురు :—అమాత్యులవారు అనుగ్రహించాలె. వొక సంగతి మనవి చేస్తాను. యింతకుముందు వొకప్పుడు పాపిష్టి చంద్రగుప్తుడు శకటదాసయ్యకు మరణదండనం వుత్తరువు చేసినాడు. ఆయన్ను చంపేచోటికి తీసుకొనిపోయిం తర్వాత యెవరో వొకాయన అక్కణ్ణించీ ఆయన్ను తప్పించుకొని యిద్దరూ యింకో దేశానికి పరారై పోయినారు. దానిమీద పాడు చంద్రగుప్తుడు ఎందుకోసం మీరింత అజాగ్రత్తగా వున్నారని తలార్లందర్నీ చంపించి, కారుచిచ్చుమాదిరిగా శకటదాసయ్య మీద మండుతూవున్న తన కోపాన్ని చల్లార్చుకున్నాడు. ఆ రోజునుంచీ, చంపేచోటిదగ్గర తలార్లు వెయ్యి కండ్లతో కనిపెట్టుకుంటూ కత్తిపట్టుకొనుండే కొత్తవాడెవడైనా ముందరగాని శెగ్గాని కనపడ్డాడంటే తమ ప్రాణాల్ను కాపాడుకోవడంకోసం చంపవలసినవాణ్ణి ఆ నిముషంలోనే చంపేస్తున్నారు. అందువల్ల అమాత్యులవారు యీ మాదిరిగా అక్కడికి కత్తి తీసుకొనిపోతే తమరే చందనదాసశెట్టిని చంపడాన్ని ఇంకా తొందరపెట్టినవాళ్లౌతారు.

(అని నిష్క్రమించును)

రాక్ష :—ఔరా! చాణక్యవటువునీతిమార్గమెంత దుర్బోధముగానున్నది!

చ. శకటుఁడు నన్నుఁ జేరుట ద్విషన్మతచేష్టితమేని, కన్క ఘా
తుకుల వధింప నేల పగతుం? డటు మోసము లేకయున్న, నే
మికరణి నిట్టిలేఖ వొడమింపఁగఁ గల్గు? నటంచు నెంచు నా
శకట! మనంబు తర్కపదమై తుదినిశ్చయ మంద డియ్యెడన్.

(ఆలోచించి)

శా. పోతిన్ దీఱదు నేఁడు; ఘాతుకులు మున్నే వధ్య హింసింత్రు త
ద్రీతిన్ గన్గొన; నెన్నఁడో ఫలము నీతిన్; దాన నేఁ జేమి? నా స్నే
కై తా దుర్దశనొందఁ బ్రాణహితుఁ డౌదాస్యంబునుం గా; దిఁకన్
గాతుం గాత మదాత్మ నిష్క్రియముగాఁ గల్పించి మిత్రాగ్రణిన్.

(నిష్క్రమించును.

ఇది కపటపాశ మను

షష్ఠాంకము

---

# సప్తమాంకము

(అంతట వజ్రలోముఁడను చండాలుఁడు ప్రవేశించును)

వజ్ర :—తొలిగిపోండి ; అయ్యల్లారా! తొలిగిపోండి. దూరంగా తొలిగిపోండి.

(గేయము)

ఆలు బిడ్డ పానాలమీద మీ
 కాశ గినక వుంటే
దూలా న్నుంచే పెబువులతో పగ
 తొలగం డది యిసమంటే ॥
తెగులో సావో అపత్తె మైతే
 తెస్తాదీ తన కండీ
పగతో దొరల కపత్తెం సేస్తే
 పాడౌ కులమంతా నండీ ॥

యిదుగో అయ్యల్లారా! యీ మాటమీద గినక మీకు నమ్మకం లాకపోతే యీ శందనదాసయ్యసెట్టిని సూడండి. మన పెబువులోరికి అపత్తెం సేసిందానివల్ల యీన్ను పెండ్లామూ బిడ్డలూ యేడుస్తా వస్తావుంటే-సంపే సోటికి తీసుకోని పోతుండాము. (ఆకాశము వైపు విని) సాములో క్లేంద్రో అంటా వుండారే; శందనదాసయ్యను విడిపిచ్చడానికి వుపాయ మేందైన వుండాదా? అని అడుగుతా వున్నారా? వుండాది సోములూ వుండాది. యీన అమచ్చరచ్చసులోరి పెండ్లాన్ని పిల్లల్ని తెచ్చి వొప్పగించడం వొకటే వుపాయం. (మరల విని) ఏమంటుండారూ? యీన మరుగుసొచ్చి నోళ్లమీద కానా దయ సూపేవాడు ; తన వొక్కని పానం కోసం యిట్లాంటి పాడు పన్ని యెప్పటికీ సెయ్యడు అంటూ వుండారా? యిట్లాంటి పాడు పన్ని సెయ్యకపోతే యీనకు వొచ్చే మంచి అవుస్తను తమురు జాగరతగా సూస్తూ వుండండి. అంతేగాని యిప్పుడీ వుపాయాల్ను అడగడంతో యేమౌతుంది!

(అంతట బిల్వపత్త్రిఁడను చండాలుఁడు వెంట వచ్చుచుండఁగా వధ్యవేష ముతో భుజముపై శూలము దాల్చి చందనదాసుఁడును అతనివెంట నాతని యాలు బిడ్డలును ప్రవేశింతురు)

చందన :— అక్కటా! యెంత యనుచితము! ఇస్సీ!

తే. సచ్చరిత్రభంగభీతి నిచ్చలును మసలు
మమ్ముఁబోటుల విమలవంశమ్మునందు
దొంగలకుఁ గల్గఁదగిన మృత్యువు ఘటింతు
వేమనఁ? గృతాంత! నీకుఁ బ్రజ్ఞామళితము.

ఎంత పొరపాటు! ఘాతుకు లగువారికి 'వీ రుదాసీనులు, వీరు తక్కినవారు' అను భేద మెక్కడ నున్నది?

ఆ. మాంసములను మాని మరణభయంబునఁ
బూరి గఱచి బ్రదుకు పుణ్యజీవి
హారిణశాబకంబు హాత మొనరింప ని
ర్బంధ మున్నె బోయవాని కెందు.

(నలువైపులను జూచి) ఓ ప్రియ వయస్యా! జిష్ణుదాసా! యేల నాకు బదులేనియుఁ బలుకకున్నావు? ఎంతపిచ్చి! యిట్టి సమయమున నా దృష్టిపథమునఁ బడుమానవు లెందు లభింతురు? (కన్నీటితో) వీరలో నా ప్రియమిత్రులు, తాము చేయఁజాలినది లేమిచే నశ్రు పాత మాత్రమునఁ బ్రతిక్రియ నొనరించి శరీరములతో మాత్రము వెనుకకు మరలువారై శోకదీనములగు మొగముల నీ వైపునకుఁ ద్రిప్పి కన్నీటి బరువుచేఁ గ్రుంగు చూపుతో నింకను నన్ననుగ మించుచునే యున్నారు.

బిల్వపత్త్రిఁడు :—అయ్యోవ్! శందనదాసయ్యా! సంపే సోటికి వొచ్చినావ్. మీా వాళ్లందర్నీ ఇంక సాగనంపు.

చందన :—(కుటుంబినితో) ఆర్యా! పాపనితోఁగూడ నీవింక వెనుకకు మరలుము. ఇంతకంటె నావల నన్నుసరించుట యుక్తము గాదు.

కుటుంబిని :—(కన్నీటితో) ఆర్యపుత్రుల ప్రయాణం లోకాంతరాని గ్గాని దేశాంతరాని గ్గాదు.

చందన :—ఆర్యా! యీ మరణము నాకు మిత్రకార్యవశమునఁ గలుగుచున్నది ; గాని పురుషదోషమునఁ గాదు. దుఃఖింప కుము.

కుటుంబిని :—అది నిజమే గాని యిది కులస్త్రీలకు వెనక్కి తిరిగి పోవలసిన కాలం గాదు.

చందన :—అయిన నేమి చేయఁదలఁచితివి ?

కుటుం :—ఆర్య పుత్రుల పాదాల్నే అనుసరించి నన్ను ధన్యురాల్ని చేసుకుంటాను..

చందన :—ఆర్యా! యనుచిత మిది ; ఈ కుమారుఁడు లోక వ్యవహారములను వినినైన నెఱుంగనివాఁడు. ఈ పసిపాపని ననుగ్రహించుట నీకుఁ గర్తవ్యము.

కుటుం :—కులదేవతలు ప్రసన్నులై యీ పాపణ్ణి అనుగ్రహించనీ! నాయనా! తండ్రిగారి పాదాలకు కడపటి నమస్కారం చెయ్యి.

పుత్రుఁడు :—(తండ్రి పాదములపైఁబడి) నాయనా! మిమ్మల్ని విడిచి పెట్టిపోయి నేం చెయ్యవాలసిం దేముంది ?

చందన — కుమారా! చాణక్యుఁడు లేని దేశమున నివసింపుము.

బిల్వపత్రుఁడు !—శందనదాసయ్యా! కొఱితిని బాతేసినామ్. యింక నీవు సిద్ధంగా వుండు.

కుటుం :—ఆర్యులారా! కాపాడండి, కాపాడండి.

చందన :—ఆర్యా! యేల యింకను నిచ్చట వాపోయెదవు ? ఎవరు దుఃఖితులమొఱ లాలించి దయఁజూపుచుండిరో యా మహారాజులు నందులు దివి కేగినారు.

వజ్ర :—ఒరేయ్ : బిల్లవత్తుడా! పట్టుకోరా శందనదాసయ్యను. యింటోళ్లు వాండ్లకై వాండ్లే యెనక్కి తిరిగిపోతారు.

బిల్వ :—ఒరేయ్ వజరలోముడా! యిదుగో పట్టుకుంటా వుండాను.

చందన :—భద్రా! ఆఁగుము; ఒక్కముహూర్త మాఁగుము. పసి పాపని కౌఁగిలించుకొందును. (కుమారుని కౌఁగిలించుకొని యాఘ్రాణ మొనర్చి) నాయనా! మరణ మనునది యేనాఁటికైనను తప్పక కలుగునదే కావున నెప్పటికైనను మిత్రకార్యము నిర్వహించుచునే మరణము ననుభవింతువుగాక.

పుత్రుఁడు :—నాయనా! యిదికూడా నాకు చెప్పవాల్నా! యిది మనకు వంశాన్నించీ వొచ్చే ఆచారమే గాదా?

వజ్ర :—ఒలేయ్ పట్టుకోరా యీన్ను.

(చండాలు రిరువురును జందనదాసుని బట్టుకొందురు)

కుటుం :—(బొమ్మ బాదుకొనుచు) ఆర్యుల్లారా! కాపాడండీ, కాపాడండీ.

(తెరను తొలఁగఁద్రోసికొని ప్రవేశించి)

రాక్ష :—అమ్మా! భయపడకుము, భయపడకుము. ఓరోరి తలారులారా! చంపవల దీ చందనదాసుని.

ఉ. వైరికులంబునట్లు పతివంశముఁ గూల నెవండు నూచె, శ
ల్లారడి యుండ నెవ్వఁడు మహోత్సవరీతి సుహృద్విపత్తులన్;
గూరుచు వంచనావమతిఁ గ్రుంకిన నెవ్వని కాత్మ; యట్టి నా
కోరి! బిగింపుఁడీ కుమపురోత్కటమూర్ధము వధ్యమాలికన్.

చందన :—(చూచి కన్నీటితో) అమాత్యా! యేమి యిది?

రాక్ష :—నీ పుణ్యాతమ చరిత్రములో నొక భాగమునకు ననుకరణము.

చందన :—అమాత్యా! నాయీ ప్రయాసమునంతయును నిష్ఫలముగా నొనరించి తా మేమి చేసితిరి?

రాక్ష :—మిత్రమా! స్వార్థమునే చేసితిని. ఏల మాటాడవు? (ఒక చండాలునివైపు దిరిగి) భద్రా! దురాత్ముఁడగు చాణక్యునకుఁ దెలుపుము.

వజ్ర :—యేమని?

రాక్ష :—

ఉ. పాపము నిండి మెండుకొను పాడుకలిన్ దనప్రాణ మన్యర
క్షాపరతన్ వ్యయించెదుయశంబున ధూతశిబిప్రశస్తియై
యేపున బుద్ధవృత్తము జయించెదునీజగదేకపూజ్యుఁడీ
ట్లీ పగిదిన్ వధన్ గనెడు నెవ్వనికై, యతఁడేన వచ్చితిన్.

వజ్ర :—ఒలేయ్ బిల్లవత్తుఁడా! నీవే యీ శందనదాససెట్టిని బట్టుకోని యిదుగో యీ వల్లకాటిసెట్టునీణ్ణ రొవ్వంత సే వుండు. అంతట్లో నేనూ పొయ్యి అమచ్చరచ్చసులు శిక్కిౘ్రని శాణక్క్యులయ్యోరికి మనవి సేసొస్తాను.

బిల్వ :—ఒలేయ్ వజరలోముఁడా! అట్నేవుంటాలే; పో.

(అని యాలుబిడ్డలతోఁ గూడనున్న చందనదాసుని దీసికొనిపోవును)

వజ్ర :—అమాచ్చ్యలోరు రాండి (రాక్షసునితోఁగూడ ముందునకు నడచి) వాకిటికాడ కావిలుండేవాళ్ళల్లో యెవురయ్యా అక్కడ వుండేది? నందుల్నంతా వమస నాశనంజేసి మౌరియకులాన్ని నిలబెట్నే మారాజు శాణక్క లయ్యోరికి మనవి శెయ్యండ.

రాక్ష :—ఇదిగూడ వినవలసి వచ్చెనా?

వజ్ర :—యేమంటె? 'సోము లోళ్లనీతి బలంతో తనబుద్ధంతా కట్లల్లో పడిపొయ్యి అమచ్చ రచ్చసులోరు శిక్కిబణ్ణారు' అని మనవి శెయ్యండి.

(అంతట మొగముమాత్రము వెలి కగపడునట్లు తాల్చిన మేలి కవచముతో చాణక్యుఁడు ప్రవేశించును.)

చాణ :—భద్రా!

శా. మంటల్ నిమ్ము దవాగ్ని ముంజెఱఁగునం బంధించె నెవ్వండు? వె
న్వెంటన్ ద్రాళులచే గట్టి గాలి నెవఁ డాఁపెన్? బోనునం బెట్టి మి
న్నంటెన్ సింధుర దాన వాసిత సటంబౌ సింహముల్ దా నెవం
డొంటిం జేతుల నెవ్వఁ డీఁదె జలజంతూదగ్రవారాంనిధిన్?

వజ్ర :—నీతి మారగంలో యెంతో నేరుపుండే స్వాములోళ్లు దప్ప లోకంలో యింకెవ రున్నారు ?

చాణ :—కాదు, ఇది యెంతమాత్రమును గాదు. నందకులముపైఁ బగఁ బూనిన దైవ మని చెప్పుము.

రాక్ష :—(చూచి తనలో) ఔరా! యీతఁడే దురాత్ముఁడు-కాదు మహాత్ముఁడు. కౌటిల్యుఁడు.

ఆ. సర్వరత్నములకు సాగరంబును బోలె
శాస్త్రములకు నెల్ల జన్మభూమి
యితఁడు; మచ్చరమున నీతనిగుణముల
మేము తృప్తి నంద లేము గాక.

చాణ :—(చూచి సంతోషముతో) ఈతఁడే యమాత్యరాక్షసుఁడు. ఈ మహాత్ముఁడే కదా !

తే. కన్నుమూయని దీర్ఘజాగరణములకుఁ
గారణములైన గురుతర కల్పన శ్రే
మముల వృషలుని సేనకు, మాదుమతికిఁ
జాలకాలమునుండి బేజారు సేసె.

(మేలి కవచమును దివిచివైచి సమీపించి) ఓ యమాత్య రాక్షసా! విష్ణుగుప్తుఁ డభివాదము చేయుచున్నాఁడు.

రాక్ష :—(తనలో) అమాత్యుఁడను విశేషణ మిపుడు లజ్జాకరము. (ప్రకాశము) ఓ విష్ణుగుప్తా! నేను జండాలస్పర్శదూషితుఁడ నైతిని ; స్పృశింపకుము.

చాణ :—అమాత్యరాక్షసా ! ఈతఁడు చండాలుఁడు గాఁడు. పూర్వము మీరును జూచినవాఁడే. సిద్ధార్థకుఁ డను రాజపురుషుఁడు. ఈతఁడే కృత్రిమస్నేహమును గల్పించుకొని, పాపము! ఏమియు నెఱుఁగని శకటదాసునిచేత నట్టి కపట లేఖమును వ్రాయించినాఁడు. మఱి యీ రెండవవాఁడు గలఁడే, యితఁడును సమిద్ధార్థకుఁ డను రాజపురుషుఁడేగాని ఛండాలుఁడు గాఁడు.

రాక్ష :—(తనలో) అదృష్టవశమున దీనిచే శకటదాసుపైఁ గలిగిన యనుమానము పరాస్తమైనది.

చాణ :—పెక్కుమాట లేల ? ఇదిగో సర్వమును సంక్షేపముగాఁ దెలుపుదును.

సీ. భద్రభటాదులై పరగు నయ్యుద్యోగు, లత్తెఱంగున సిద్ధమైనలేఖ,
అట్లు మీకడఁ జేరినట్టి సిద్ధార్థకుం, డయ్యలంకారత్రయప్రసక్తి,
అమీదు ప్రియమిత్రుఁ డన నున్న క్షపణకుఁ, డల్ల జీర్ణోద్యానమందుఁ గనిన
యట్టి యార్తుండగు నా పూరుషుండును, నవ్విధంబునఁ జెల్లనైన యట్టి

తే. శ్రేష్ఠి చందనదాసుని శ్రీవినాశ
మాది యగు క్లేశ మిది యెల్ల నరయ వృషలుఁ
దేచి మీతోడ సంధిక్రై వేచి సలుప
నైన నీతియ సుమ్ము వీరాగ్రగణ్య !

ఏఁడుగో వృషలుఁడును మీదర్శనమునకు వచ్చుచున్నాఁడు ; చూడుఁడు.

రాక్ష :—(తనలో) ఏమిగతి ? చూతునుగాక.

(అంతట రాజును యథావిభవము పరివారమును ప్రవేశించును)

రాజు :—(తనలో) యుద్ధముతో నవసరము లేకుండఁగనే యార్యులు దుర్జయమగు శత్రుసైన్యమును బరాజయ మొనరించినారు. అందుచే నా కేమో సిగ్గగుచున్నది.

తే. ఫలసమాగమ మందియుఁ బనికిఁ గామి
దనరు వైలక్ష్యమున వంత దలరె ననఁగ
నమ్ము లెల్ల నధోముఖత్వమ్ము నంది
తాల్చుఁ దూణీరశయనవ్రతప్రతిష్ఠ.

అది కాదు. అట్లేల తలఁపవలయును?

చ. గెలువఁగఁ జాలు శింజిని లగింపని సింగిణితోన గెల్వఁగా
వలసినదాని, నుర్వర నెవండయినన్ నిజతంత్ర మెల్లచే
శలఁ గను మాయకుండఁగ మెలంగుచు దేశికు లర్థి నాకునుం
బలె సవరింతురేని తనపాటికి హాయిగ నిద్ర నుండినన్,

(చాణక్యుని సమీపించి) ఆర్యా! చంద్రగుప్తుఁడు నమస్కరించు చున్నాఁడు

చాణ :—వృషలా! నీకు మా యాశీర్వచనముల కేమి కొదవ? వీరుగో పూజనీయులగు నమాత్యరాక్షసులు. వీరికి నమస్కరింపుము.

రాజు :—(రాక్షసుని సమీపించి) ఆర్యా! చంద్రగుప్తుఁడు నమస్కరించు చున్నాఁడు.

రాక్ష :—(చూచి తనలో) ఔరా! యితఁడే చంద్రగుప్తుఁడు!

తే. బాలుఁడయ్యును లోకసంభావితోజ్జ్వ
లోదయుండయి రాజ్యంబు నొందె నితఁడు
నేటికిఁ గ్రమక్రమముగ; ననేకపంబు
యూథపతివైభవము నందునోజ మెఱయ.

(ప్రకాశము) రాజా! జయ మగుఁగాక.

రాజు :—ఆర్యా!

తే. అరసి చూచిన భువనంబునందు నెల్లఁ
గలదె నా కింక గెలువనికార్య మొకటి?
షడ్గుణవిచారదివిషదాచార్యు లార్యు
లెల్లపనులను గను మూయ కెలమి నుండ.

రాక్ష :—(స్వగతము) కౌటిల్యుని శిష్యుఁడు నన్ను భృత్యభావమునఁ బేర్కొనుచున్నాఁడు. కాదు, కాదు. ఇది చంద్రగుప్తుని వినయమే; కాని నాకుఁగల మాత్సర్యము దానిని విపరీతముగాఁ దోఁపఁజేయుచున్నది. ఏవిధముగాఁ జూచినను జాణక్యుఁడు కీర్తిశాలి యగుట యుక్తముగానే యున్నది. ఏల యన,—

చ. తగిన జిగీషువుం గొనునతండు జడాత్ముఁడయేని నిశ్చయం
బుగఁ గనుఁ గీర్తనీయపదముల్ సచివుం డటుగాక, యెయ్యెడల్
దగని విమూఢునిన్ గొనునతండు సతంబు విశుద్ధనీతియై
తగినను గూలజద్రుమవిధంబునఁ గూలు నిజాశ్రయత్వతిన్.

చాణ :—అమాత్యరాక్షసా! చందనదాసుని జీవితమును గాపాడ వలయుననియే కోరుదువా?

రాక్ష :—విష్ణుగుప్తా! సందేహ మేల?

చాణ :—చందనదాసుని జీవితముఁ గాపాడవలయుననియే తలంతు వేని - యిదిగో శస్త్రము, దీనిని గ్రహింపుము

రాక్ష :—వలదు. విష్ణుగుప్తా! వలదు. ఈ శస్త్రమును, అందును నీవు గ్రహించియున్నదానిని గ్రహించుట మాకు యోగ్యత లేదు.

చాణ :—అమాత్యరాక్షసా! నేను యోగ్యుఁడను, మీరు కారు అనుట యేటి మాట? అటు చూడుము.

శా. జీను ల్వాయవు, కళ్లెము ల్విడవు, శోషించెన్ శరీరంబు,
శ్వానీకంబు లకే; గజంబు లకే, తీయంబోని సన్నాహమున్
బూన న్వాపవు వీపులన్ మనుఁగఁగన్ గ్రోలన్ దినన్ బందుకో
మాకె న్నిర్ధళితారివీర నిను సంభావించి ధీరాగ్రణీ!

ఉండుఁగాక ; ఇది యంతయు నెందులకు? మీరు శస్త్రమును గ్రహింపనియెడల చందనదాసునకుఁ బ్రతుకు లేదు.

రాక్ష :—విష్ణుగుప్తా! లోఁబడి పోయితిని. ఎట్టి కార్యమునకైనను అంగీకరింపఁజేయు మిత్రస్నేహమునకు నోఁదల ప్రాల్చెదను.

చాణ :—(సంతోషములో శస్త్రము నొసఁగి) వృషలా! అమాత్య రాక్షసులవారు శస్త్రగ్రహణము నొనరించి యనుగ్రహింపఁగా నెంతయు వర్ధిల్లుచున్నాఁడవు. ఎంతటి మహాభాగ్యము!

రాజు :—ఇది యంతయు నార్యుల యనుగ్రహము. చంద్రగుప్తుఁ డనుభవించుచున్నాఁడు.

పురుషుఁడు :—(ప్రవేశించి) జయం, జయం. మహా మంత్రులవారికి. ఇదుగో భద్రభటుడూ, భాగురాయణుఁడూ మొదలైవాం డ్లంతా మలయకేతువును ముడికట్లతోఁగూడా తీసుకోని వచ్చి వాకిటిముంగసాల్లో వున్నారు.

చాణ :—భద్రా! వారుగో అమాత్య రాక్షసులవారు. వారికి విన్నవింపుము. వారే యిప్పుడు కర్తవ్యము నెఱుఁగుదురు.

రాక్ష :—(తనలో) ఏమి చేయుదును? కౌటిల్యుఁడు వన్నిట్లు భృత్యపదమున నిలిపి యిప్పుడు విజ్ఞాపనమునుగూడఁ జేయించుచున్నాఁడు. కానిమ్ము; మార్గాంతరము లేదు. (ప్రకాశము) మహారాజా! మేమీ మలయకేతువునొద్దఁ గొంతకాల ముండిన విషయము తమకును దెలిసియే యున్నది. కావున నీతనికిఁ బ్రాణరక్షణ మొనరింతురుగాక.

రాజు :—(చాణక్యుని ముఖమున జూచును)

చాణ :—వృషలా! అమాత్య రాక్షసుల వారి యీ తొలి కోరిక తప్పక యాదరింపఁ దగియున్నది. (పురుషునివైపు చూచి) భద్రా! మామాటగా భద్రభటాదులతో 'అమాత్య రాక్షసుల వారి విజ్ఞాపనముపై మహారాజ చంద్రగుప్తులు మలయకేతువున కాతనితండ్రిరాజ్యము నొసంగుచున్నాఁడు. కావున మీ రందఱును నాతనితోఁగూడఁ బోయి, యాతనిని నిజ రాజ్య ప్రతిష్ఠితునిఁ గావించిన తరువాతఁ దిరిగి రావలసినది. అని చెప్పుము. మఱియును దుర్గపాలుఁడను విజయపాలునితో అమాత్య రాక్షసులవారు శస్త్రగ్రహణమును గావించుటచే మిక్కిలి సంతోషము నొంది మహారాజ చంద్రగుప్తుల వా రాజ్ఞాపించుచున్నారు. 'ఈ చందనదాస శ్రేష్ఠిని సామ్రాజ్యమున నన్ని పట్టణములకును బెద్దసెట్టిగా నొనరింపవలసినది. ఏనుఁగులును, గుఱ్ఱములును దప్పఁ దక్కిన యన్ని ప్రాణులకును బంధమోక్షణము గావింపవలసినది. కాదు; అమాత్య రాక్షసులు కార్యతంత్రమును దీర్చుచుండఁగా హస్త్యశ్వములతో మాత్రమేమి యవసరము? కావున నిప్పుడే,

తే. ఏనుఁగులు గుఱ్ఱములతోడ నెల్లయవియు
బంధనమునుండి విడువఁగఁబడును గాక
యేను బూర్ణప్రతిజ్ఞుఁడ నైనకతన
నాదుశిఖమాత్ర మొకఁడు బంధంబుఁ గనుత.

అని మామాటగాఁ జెప్పుము.

పుర :—ఆర్యులవారి వుత్తరువును నెరవేరుస్తాను.

(నిష్క్రమించును.)

చాణ :—ఓ రాజా! చంద్రగుప్తా! ఓ యమాత్యరాక్షసా! మీ కింకను నేమి ప్రియమును గావింతును?

రాజు :—ఇంతకంటెను ప్రియ మే మున్నది?

తే. మైత్రి లభియించె రాక్షసామాత్యుతోడ
నృపపదంబునఁ గుదురు నందితిమి మేము,
అఖిలశాత్రవోన్మూలన మయ్యె; నింకఁ
గలదె యింతకు మించినకార్య మెందు?

రాక్ష :—అయినను గొఱఁతయున్నచో నిట్లగుఁగాక.

(భరత వాక్యము)

శా. సౌకర్యం బలరన్ జగద్భరణ దీక్షం గొన్న యాదేవు దం
ష్ట్రాకోటిన్ బ్రళయార్తయై ధరణి మున్ ప్రాపించె; రాజాకృతిన్
లోకం బేలఁగ వేనిదోర్యుగము నొందున్ నేఁడు మ్లేచ్ఛార్తి; స
శ్రీకాత్మీయుఁ డవంతివర్మ సుచిరశ్రీ నేలు నాతం డిలన్.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది నిర్వహణ మను

సప్తమాంకము.

---

విద్వచ్ఛిరోమణి

# అవధానము చంద్రశేఖర శర్మగారి

## యితర గ్రంథములు

---

### ముద్రితములు

**ప్రవాసి :—** 0-12-0

ఉత్తమశ్రేణికిఁ జెందిన ఖండకావ్యము. భావశబలమగు నుదాత్త శృంగారమిందు నిబద్ధము. పెక్కురు పండితులచేతను, ప్రముఖ పత్రికల చేతను ప్రశంసింపఁబడినది.

"The psycological situations that the poet creates are superb. This poet's style well illustrates the beauty of native Telugu. His verse runs like limpid water. He often reminds one of P.ngali Surana and Salivahana Gadha Sapta Sati.

—*The Hindu, dated July 14th 1940.*

**దీనచింతామణి :—** 0-4-0

భక్తి జ్ఞాన వైరాగ్య బోధకమగు శతకము. పలువురు పండితుల ప్రశంసల నందినది.

### అముద్రితములు

**అలంకారశేఖరము :—** కేశవమిశ్రునికృతికి ఆంధ్రీకరణము. అలంకార శాస్త్రమునఁ బ్రవేశమును గోరువారికి మిక్కిలి యుపయుక్తము. కావ్యశిల్పమునకు సంబంధించిన అపూర్వ సంప్రదాయములిందుఁ జక్కఁగా వివరింపఁబడియున్నవి.

**మాతృగుప్తుఁడు :—** కాశ్మీరకవి చరిత్రము. నూత్న కల్పనల తోను, నుదాత్త భావములతోను హృద్యమైనది.

**కాదంబరి :—** జగత్ప్రసిద్ధమగు భట్టనారాయణుని రచనమునకు సంగ్రహరూపమగు నాంధ్రానువాదము. కథావేగమునకు భంగము కలిగింపని సముచిత వర్ణనములతోఁ గూడిన యుత్తమరచనము.

కార్యదర్శి,

**సాహితీసామ్రాజ్యము**

పోరుమామిళ్ల పోష్టు

కడప జిల్లా.

Printed at the Weldun Press, Madras-21